ఓమ్

# ఈశ్వరరహస్యసారము

గ్రంథకర్త:
A. N. MURTI.



పబ్లిషర్సు:
బ్రహ్మానంద బాలయోగి,
శ్రీ కైవల్యాశ్రమము, (కరెవరం.)

[వెల రు. 1—0—0.

ఓమ్.

# ఈశ్వర రహస్య సారము.

2

గ్రంథకర్త:

**A. N. MURTI.**

పబ్లిషరు:

బ్రహ్మానంద బాలయోగి,

శ్రీ కైవల్యాశ్రమము, కఠెవరం.

తెనాలి తాలూకా

ఓమ్.

# భూమిక.

ఒక వనపాలకుఁడొక చిన్న మొక్కను నొక గొప్ప వృక్షము క్రింద నాటిన యెడల నది చక్కగా నాటుకొని పుష్పించి ఫలించదు. ఎందుకన పెద్దవృక్షము చిన్న మొక్కను వృద్ధికి రానీయదు. అందుకు కారణము మొక్కకు చాలినంత జలవాయు ప్రకాశములను లభింపకుండఁ జేసి పెద్ద వృక్షమాటంకముఁ జేయుచున్నది. గావున నే మంచి తెలివిగల మాలిమి తన తోటలో ప్రతి చెట్టునకును స్వతంత్రము అనగా నది వృద్ధియగుటకు బాధలు లేకుండ జూచుకొనుచుండును. ఇట్టిదశ యొక యుద్భిజ్జమునకు నుండగా నిక మనష్యునకు చెప్పవలసినదేమున్నది? ఓషధి వనస్పతి విద్యావిశారదుఁడగు నొకవనపాలకుఁడెట్లు నియమపూర్వకమైన స్వతంత్రమును మొక్కలకు నిచ్చుచున్నాడో అట్లే ప్రపంచ రూపమగువనమును సృష్టించిన భగవంతుడిందలి మానవరూప వృక్షములకు స్వతంత్రమియ్యకుండినచో నెంతటి బుద్ధిహీనుఁడనవలయును? గనుక దేవుఁడవశ్యముగ మానవునకు స్వాతంత్ర్యమిచ్చియున్నాడు. అందరికిని స్వతంత్రమానసికశక్తుల నిచ్చియున్నాడు. అట్టి స్వాతంత్ర్యమును వికాసపరచి, స్వచ్ఛందతాపూర్వకముగ నిర్వహించవలయునని మనుష్యులాజ్ఞాపింపఁ బడియున్నారు. దీనిని గమనింపనివారున్నతిని బొందజాలక యనామకులై యధోగతికి దిగి నశించి పోదురు.

లోకమందొకటి జరుగుచున్నదేమన:—నొకమనుష్యుఁడు రెండవవానిని, యధికారబలముచేతనో- మతబలవంతముచేతనో మూర్ఖముచేతనో లోబరచుకొని, వాని స్వచ్ఛందమును, సత్యమును, నిచ్ఛాపూర్తికిని విరుద్ధముగ దాసుని చేసికొని స్వాధీనపరచుకొనుటకుఁ గోరుచున్నాఁడు. అనేకులీయన్యాయమును, నీతి విరోధమును నెదిరించజాలక బంధనములలోఁ జిక్కిపోవుచున్నారు.

కొన్ని శతాబ్దములకు ముందు యూరోపునందలి కొందరు జాతీయులు, నిరపరాధులగు నాఫ్రికా నివాసులను (హబ్సీనియా జాతివారిని) పట్టుకొనిమృగములవలె విక్రయించి దానిసవ్యాపారమునుఁ జేసిరి. అప్పటి యూరోపు సభ్యులు హబ్సీనియావారిని, యీశ్వరుఁడు గులాములుగా సృష్టించియున్నాడని భావించిరి. గావున వారి యున్నతికి భంగము చేసిరి. హబ్సీనియా వారీశ్వరదత్తమగు స్వతంత్రశక్తిని వినియోగించుటకు నుపాయ మెరుఁగక నుండినంత వరకు దాస్యము చేసిరి. వారి బుద్ధి వికసించిన వెంటనే- అల్పకాలములోనే స్వాతంత్ర్యపీఠమెక్కి సుఖాత్ములైరి. వారు ప్రబోధాత్ములై స్వయంసహాయమును గోరి స్వాత్మావలంబనులై స్వవిశ్వాస మభ్యసించిరి.

మన దేశమందనేకులు ప్రారబ్ధము ప్రారబ్ధమని పలవరించుచున్నారుగాని ప్రారబ్ధమననేమె యెరుంగకున్నవారు. స్వతంత్రశక్తిని నాశన పరచుకొని పురుషార్థ విహీనులై యుండుట నొసటివ్రాతయని యెచ్చటను చెప్పియుండ

లేదు. దీనిని యాధ్యాత్మిక దుఃఖము అనగా స్వయాకృతాప రాధమని చెప్పియున్నారు. పరమాత్ముఁడు మనుష్యునకు కర్మజేయుటయందు స్వతంత్ర మిచ్చియున్నాడు. గనుక మనుష్యుడనుభవించు దుఃఖములన్నియు కర్మఫలములుగా నున్నవి. మానవుఁడు బుద్ధిపూర్వకముగ స్వాతంత్ర్యమును బోగొట్టుకొనుట ప్రారబ్ధమని భ్రమింప రాదు. స్వార్థులు మూఢులను మోసపరచి వంచించుటకై పరులతో "మీకు స్వతంత్రము లేదు; అధికారము లేదు; మాకు లోబడియుండుట మీకు ధర్మము; ఇది మీతలవ్రాత" యని చెప్పుచుందురు.

అయితే స్వతంత్రము నియమరహితమై యుండలేదు. ఏ యే విషయములలో నజ్ఞానమును యవివేకమును భ్రమ ప్రమాదముగలదో- యట్టి విషయములందు స్వతంత్రము హాని కారకమై నన్నర్థము సంభవించును. గనుక సృష్టిని యమ- రాజ్య నియమ- లోక నియమాదుల ననుసరించిన స్వాతంత్ర్యమే- మానవ మాత్రులందరికిని సుఖ హేతువై యుండును.

మన మిపుడు సత్యాసత్య వివేకమునకు బునాది యగు వాక్స్వతంత్రమును గురించి మరువరాదు. ఈశ్వరుఁడు మనకు వాక్కును సత్యము చెప్పుటకై యిచ్చియున్నాడు. ఎందు కనగా నీశ్వరుఁడు సత్యస్వరూపుడు. లోకములో ప్రతివారును ముక్తకంఠముతో "సత్యము చెప్పవలయును; సత్యమాచరించవలెను." అని చెప్పుచున్నారు. ప్రాథమికులును "సత్యంవద- ధర్మంచర" యని చెప్పియున్నారు; కాని యసంఖ్యాకులు

స్వయం సత్య పాలకులుగా నుండలేదు. గాని, యసత్యవాదు లందరును దోషులని నేను దూషింపను. బహుమంది తమకు వాక్ స్వతంత్రము లేనందున యసత్యముల బలుకుచున్నారు. మిథ్యాచారములు సలుపుచున్నారు. ఒకని వాక్ స్వతంత్ర మును బలాత్కారముగ లాగుకొనినప్పుడు వాడెట్లు సత్య ముఁజెప్పగలఁడు?

ఒక గ్రామమందొక పురోహిత నామధారకుడు కేవలము దురాచారపరుఁడై యుండెను. నామిత్రుని కది తెలియును. ఆ పురోహితుని తమ యింటికి యొకనాడు భోజ నమునకు పిలువుమని యింటి యజమానుఁ డాజ్ఞాపించెను. నా మిత్రుడాలాగేచేసెను. నేనప్పుడు నీవు తెలిసి యుండియు దురాచారుఁడగు పురోహితుని భోజనమునకు బిలువవచ్చునా? యని యాక్షేపింపగా-స్వతంత్రములేదు గనుక నేనేమియు చెప్పకూడదని బదులుచెప్పినాడు. ఈస్థితిలో నిజము చెప్పుమని మన ముపదేశించి ప్రయోజనమేమి? గనుక మొదట సత్య ముయొక్క ప్రచారమార్గమున కటంకములనుగురించి చర్చించ వలయును. అధికాంశము మనుష్యునియొక్క వాక్ స్వతంత్ర మపహరింపఁబడుటచేతనే నిజము చెప్పవలసియుండియు చెప్ప జాలకుండును. ఒక రోగి, యౌషధము పుచ్చుకొని పథ్య ముండెను. ఆరోగికి "తీర్థము" అని చెప్పి కొంకాయనీరును త్రాగనిచ్చిరి. అది యాతనికి కుపథ్యమై యున్నందున కోపించి, కొంకాయనీరని చెప్పక తీర్థమని యబద్ధ మెందుకు చెప్పితివని రోగి పలికెను. అందుకు బదులు-కొంకాయనీరు అనుటకు

హాకధికారముగాని, స్వాతంత్ర్యముగాని లేదని యాంతడు చెప్పెను.

ఈ గతియే—సామాజిక దశయందును రాజనీతి యందును, మత విషయమునందును సంభవించి యున్నందున సబద్ధము చెప్పకుండ మనుష్యుఁడు జీవింపజాలడను మంతవ్యమును తదాచరణమును వ్యాప్తములై యున్నవి.

ఒక యధికార శక్తిగల మనుష్యుఁ డన్యాయ యుక్తమగు మాటలాడుచున్నాడు. దానిని న్యాయ ప్రియుఁడొకఁడు నిక్కరించి తద్విరుద్ధముగ మాటలాడుట కుద్యమించుచుండగా నా యధికార శక్తిగలవాడు దురాభిమానియై వానిని యథాసాధ్యమగు చేష్టలతో నణచి వేయుచున్నాడు. ఈ ప్రకారముగ వాక్ స్వతంత్రతను గొంతుకోయగా - నసత్యము జయించి సత్యము పడిపోవుచున్నది.

పై యుదాహరణమువలన వాక్ స్వతంత్రమునకు నన్యాయము ఘోర శత్రువని స్థిరపడుచున్నది. సత్యమున కిట్లు సర్వదా సకల స్థలములయందును యపజయము గలుగుచున్నది. లోకములో గల సమస్త దోషములకును మిథ్యయనునది మూలమైయున్నది. దీనియందన్ని చెడుగులును యంతర్గతమై యున్నవి. గనుకనే మనువు "నాస్తి సత్యాత్పరోధర్మః నానృతాత్పాతకం పరమ్" అనగా సత్యమునకంటె ధర్మము లేదు; అసత్యమునకంటె పాపము లేదని చెప్పియున్నాడు. అక్షరశః యీ యుపదేశము శ్రేష్ఠమైయున్నది. గనుక సత్యాభావమును ప్రకటించుటకు నెచ్చట యాటంకము కలదో-

యచ్చట ధర్మభావము శూన్యమై యిచ్చకమును, ముఖస్తు తియు, ధూర్తతయు, నటనము మున్నగు దుర్గుణములు నిండి పోవును. ఈ యపరాధమంతయు వాక్ స్వతంత్రత నష్టమగుట చేత కలిగినది. దీనికి తోడుగ మన ప్రాచీనులేర్పరచిన దార్శ నిక ప్రబంధము అనగా తర్కవిద్య- కాలక్రమమున మనలో క్షీణించి పోయినది. వాగ్దేవతచుట్టును కువాద కుశంక నిరం కుశ భూతములు చుట్టుకొని సత్యాసత్య నిర్ణయ సామర్థ్య మడుగంటి యధఃపతనమైనది. ఇందువలన ప్రమాణరహితమై నట్టి మత మతాంతరములు ప్రబలుటయు వాక్ స్వాతంత్రము క్షీణించుటయు సంభవించియున్నది.

మన సంతానము అంధవిశ్వాస కూపమునబడినది. ఎవరికిని స్వతంత్ర విచారములేదు. కపట విద్యల సభ్యసించిరి: మన పుత్ర పుత్రికలు సత్యము వచించుట కడు దుస్తరమైయు న్నది. అసత్యమును మిగుల ననాయాసముగ పలుకుటకు నేర్చుకొనిరి. ఈశ్వరభక్తులు కాజాలక పోయిరి. జడపదార్థ ములకు భక్తులైరి. ధార్మికులు గాకున్నవారు. ఉచ్చవిచార పరులుగారు. శుద్ధభావములు గలిగియుండలేదు. నీతి పథావ లంబనులు గాకపోయిరి. దీనికంతటికి కారణమేమి? మన సంతతికి వాక్ స్వతంత్రము నియ్యలేదు. ఎందుకు ? దాని మహత్తును మనమెరుంగజాలము. అది మనకొక క్రొత్తశబ్ద ముగా నున్నది.

అనేకులు పరమార్థ రక్షణ నెపమున స్వార్థులై సత్యా సత్యవిమర్శన జ్ఞానములేని పామరులను వంచించు చున్నవారు.

తమ యుదరపోషణము నిమిత్తము కల్పించిన కుకర్మలన్నియు ధర్మములని నమ్మించుచున్నారు. అట్టి స్వార్థులను మనము పూజ్యులని గౌరవించి పూజించుచున్నారము. హిందూ మత-మతాంతర సంస్థలనేకములట్టివేయని నేను నిరూపింప నక్కఱ లేదు. ఇట్టి దుష్ట సంస్థలనుండి తప్పించుకొనుటకు సత్యాసత్య వివేకముండవలయును. లేకున్న మన తనుమనధనములు స్వార్థుల పాలుచేసి వ్యర్థులమై పోయెదము. మనమెప్పుడో- సుస్వభావమైన సత్య శిఖరమునుండి జారి నానాముఖముల మత మతాంతర కూపములలోఁ బడి యంగములు విఱిగి పైకి లేవ లేక యున్నారము. మఱియు నసంగత- కుసంస్కార శృంఖలాన్వితులై బంధింపఁబడి, యట్టి యసంభవములనే సంభవములని వాదించునంతటి దుర్గతికి దిగి యున్నారము. సత్యాసత్య విమర్శన బుద్ధి క్షీణించినందున మనుష్య సాంఘిక స్థితియును దాని సీమనుండి బహుదూరము వెడలిపోయినది!

చూడుడు! మన ముక్కులుగోసిన వారికి దుడ్డు నిచ్చెదము. మన యంగములను గాల్చువారికి బుజముల నిచ్చెదము. మన మర్మాంగములను ఛేదించు కొనుమని. యొకసారిచెప్పిన చాలును. దానిని యోచించక గోసికొనుచునే యుందుము. మన శరీరముయొక్క ప్రతియణువు నందును పామర సేవకత్వములు నిండియున్నవి. ఎవరేమి చెప్పినను 'చిత్తము మహాప్రభూ!' యని తలలూచెదము. యదార్థ తత్వమెరుంగనివారు కన్నులున్న యంధు లని మన పూర్వులు చెప్పియున్నారు. ఇప్పుడెచ్చట జూచినను యత్యయవైదిక మత బంధనములకు మను.

ష్యులు లోబడియుండుటచే- తద్విముక్తికై ప్రాదుర్భూత మావశ్యకమై యున్నది. ఈ యదార్థ జ్ఞానమును స్వాతంత్రమును ప్రకాశింపఁజేసి, మతమతాంతర మిథ్యాశాసనములచేత లోకుల హృదయములందు నిండియుండు యాటంక యంధకారములను తొలగించవలయును. వైదిక మంతవ్యము లింతవరకే మతాంతర యనంత ప్రవాహమున గొట్టుకొనిపోయినవి. అట్టి స్థానమున వానిని మరల ప్రతిష్ఠించి నాటుటకై మొదట నీ భూమిరూపమగు సత్యాసత్య వివేకమను వేదికను స్థిరపరచుకొనవలయును. అప్పుడు మనుష్యులాత్మోన్నతినిఁ బొందజాలియుందురు.

ఇప్పటి మన యాసక్తియు- మన తిండి తీర్థము- రీతి రివాజు- చాల చలనము- నాచార వ్యవహారములన్నియు దుఃఖదాయక పరివర్తనములై యున్నవి. మనయందు మేధాశక్తియు, బలమును నాధ్యాత్మ జ్ఞానమును, ఐకమత్యమును నితాంతముగ నష్టమై యున్నవి. ఇందుకు కారణము సత్యాసత్య వివేక శూన్యముతప్ప మరివేరొకటి లేదు. ఇప్పుడందరు నన్నిదిశలయందును- దేశోన్నతి- జనోన్నతి- ఆత్మోన్నతి యని యఱచుచున్నారు. ఈ యార్తనాదములచే దేశోన్నతి యగునా? ఉన్నతి యంతయు సత్యాసత్య వివేకమందున్నది. ఎంతవరకు యదార్థమగు జ్ఞానము వ్యాపింపదో అంతవరకు దేశోద్ధారము కానేరదు.

ఎవరేమై పోయినను మాకేమని యూరకుండరాదు. ఒక సారథి తప్పత్రాగి బండిని పడద్రోసినయెడల నందుగల

వారి కెందరికో హాని సంభవించును. ఆలాగుననే యొకడు చేయుతప్పులవలన లోకములో ననేకులకు నష్టకష్టముల కాస్పదము కావచ్చును. గనుకనే మనప్రాచీనులు స్వార్థబుద్ధి మహాపాతకమని చెప్పియున్నారు.

గనుక ప్రతిమానవుడును సృష్టినియమ, రాజ్యనియమ లోక నియమాదులతో గూడిన స్వాతంత్ర్యమును వ్యాపింపఁ జేసి సత్యాసత్య వివేకమునకు బునాదిని వేయ వలయును. నియమరహితముగ పిచ్చివానికి నాయుధమునిచ్చి యుద్ధము నకుఁ బంపుటయు బాలునకు పాములనిచ్చి యాటలాడుమను టయు మాత్ర మనుచితముగా నుండును.

ఒక బీజమునకు మొలకెత్తి వృక్షమగు శక్తి స్వాభావి కమై యుండినను దానికి సాధనములగు భూమియు జలమును యావశ్యకములగును. ఆలాగుననే సత్యా సత్య వివేకము మానవునకు నైజమైయుండినను అందుకు సాధనమగు స్వాతంత్ర్య ము తప్పక యావశ్యకమై యున్నది. అదిలేకున్న సర్వము నిష్ఫలమగును. ఇందుకు నిదర్శనము మాచే ప్రకటింపఁబడిన ఫలిత జ్యోతిష ఖండనమును పఠించియు నామోదించియు విశ్వసించియు ముహూర్త సముద్రమున మునిగియుండు వారెందరో గలరు. అందుకు స్వాతంత్ర్యము లేకుండుటయే ముఖ్యకారణ మని వారే చెప్పుచున్నవారు. తమ యంతరాత్మను పరవశము చేసినవారు యథార్థజ్ఞానమున కర్హులుగానేరరు. గాన పాఠకులు మొట్టమొదట ఆత్మవశులు గావలయునని గోరుచున్నారము.

---

**A. N. M.**

# త్రిదేవనిర్ణయము.

భగవంతుఁ డొకడు.

" యోదేవేష్వధి దేవఏకఆసీత్ । కస్మైదేవాయ హవిషావిధేమ" ఋ.

యః = ఏ. దేవేషు అధి + = సూర్య, చంద్ర, నక్షత్ర, పృథివి, అగ్ని, జల, వాయు, ఆకాశ, ప్రాణ, యింద్రియాది సమస్త దేవతలలో ఏకః + దేవః = ఒకఁడగు మహాదేవుఁడు. ఆసీత్ = విద్యమానుఁడైయున్నాడు. ఆ మహాదేవుని కొరకు మనము స్తుతి ప్రార్థన వందన యుపాసనాదులు భక్తియుక్తముగ జేయుదుముగాత"

కోవిదవరులారా ! ఏకాలమందు బ్రహ్మవాదులగు మధుచ్ఛందా- మేధాతిథి- దీర్ఘతమా- అగస్త్య- కక్షీవాన్- గృత్సమద- విశ్వామిత్ర- వామదేవ- అత్రి- భరద్వాజ- బృహస్పతి- వసిష్ట- నారద- కశ్యప- నారాయణ- శివసంకల్ప- యాజ్ఞవల్క్య- ఐతరేయాది మహర్షులు, వారిపుత్ర పౌత్ర దౌహిత్ర మిత్రులును, బ్రహ్మవాదినులగు లోపాముద్ర- రోమశా- అపాలా- ఘోషా- సూర్యా- ఊర్వశీ యమీ- కద్రూ- గార్గీ- మొదలగు విదుషీమణులు నుండిరో- యాకాలమందు కేవలమొక్క పర పరబ్రహ్మను నమ్మి యాతనినే యుపాసించుచుండిరి. ఆ పరమాత్మను యనేక నామములతో పిలుచుచుండిరి. ఇంద్ర- మిత్ర- వరుణ- అగ్ని- సుపర్ణ-

గరుత్మాన్- మాతరిశ్వా- ప్రథివీ- వాయువాది నామములచే స్తుతించు చుండిరి. ఉదాహరణము.

"ఇంద్రంమిత్రం వరుణమగ్ని మాహురథో దివ్యః ససుప ర్ణోగరుత్మాన్ । ఏకంసద్విప్రాబహుధావద న్త్యగ్నిం యమం మాతరిశ్వానమాహుః । సువర్ణం విప్రాఃకవయో వచోభిరేకం సంతంబహుధా కల్పయంతి ।

ఇదేప్రకారముగ మనువు తనస్మృతియందు-

" ప్రశాసితారం సర్వేషా మణీయాసమణోరపి । రుక్మాభం స్వప్నధీగమ్యం విద్యాత్తం పురుషంపరం। ఏతమేకె వదంత్యగ్నిం మనుమన్యేప్రజాపతిం । ఇంద్రమేకేఽపరేప్రాణ మపరే బ్రహ్మశాశ్వతం ॥ అని చెప్పియున్నాడు.

బహుకాలానంతరము ఋషి సంతానము పరబ్రహ్మను మరచి ప్రాకృత పదార్థముల నుపాసించుటకు ప్రారంభించి యున్నారు. విద్వాంసులయొక్క న్యూనతచేతను, యుపదేశ ముయొక్క పరిపాటి సర్వథా లుప్తమై పోవుటచేతను ప్రజ లజ్ఞానులై వారి వారి యిష్టానుసారముగ పదార్థ యారాధన ములను ప్రారంభించిరి. అట్టిస్థితిలో పండితులైనవారు జనులను కేవల బ్రహ్మము వరకుఁ జేర్చలేక అసంఖ్య దేవతారాధననుండి తప్పించి త్రిమూర్త్యారాధనమును స్థాపించిరి. ద్యులోకవాసి యగు సూర్యదేవుఁడును, అంతరిక్షస్థుడగు వాయు దేవుఁడును, పృథివీస్థ యగ్నిదేవుఁడును నిజమైన దేవతలని నమ్మునట్లు చేసిరి. ఈ సూర్య వాయ్వగ్నిత్రయములను యజ్ఞములందు పూజింపఁ బ్రారంభించిరి. అప్పటికింకను యీ త్రిమూర్తులకు విగ్రహము

లను కల్పించి యుండలేదు. జైనసాంప్రదాయ ముత్పన్నమై తీర్థంకరమూర్తి పూజలారంభమైన తరువాత దానిని చూచి విద్వాంసులు తమలో సహితము విగ్రహారాధనమును స్థాపించుటకై సూర్యస్థానమందు విష్ణువును, వాయుస్థానమందు బ్రహ్మను, విద్యుత్ స్థానమందు రుద్రుని కల్పించిరి. మొదట సూర్య ప్రతినిధియగు విష్ణునిగురించి వివరించుచున్నారము.

## వి ష్ణు నా మ ము.

పూర్వకాలమందు సూర్యుని పేరు విష్ణువుగానుండెను.

"తత్రవిష్ణుశ్చ శక్రశ్చ జజ్ఞాతేపునరేవచ । అర్యమాచైవ ధాతాచ త్వష్టాపూషాతథైవచ । వివస్వాన్ సవితాచైవ మిత్రోవరుణఏవచ। అంశోభగశ్చాదితిజా ఆదిత్యా ద్వాదశస్మృతాః ॥

(వి-పు। జీనానందవిద్యాసాగర ప్రకాశిత 1882 సం॥ కలకత్తాప్రతి.)

విష్ణువు మొదలుగాగల పండ్రెండుపేర్లు సూర్యునికి గలవు.

"ధాతార్యమాచ మిత్రశ్చ వరుణోంశోభగస్తథా ।
ఇంద్రోవివస్వాన్ పూషాచ త్వష్టాచసవితాతథా ।
పర్జన్యశ్చైవ విష్ణుశ్చ ఆదిత్యాద్వాదశస్మృతాః ॥

(మహాభారతం- ఆ- 123 అ. ప్రతాపచంద్రక ప్రకాశిత 1806 క।)

ఇచ్చటను సూర్యునిపేరు విష్ణువని గలదు. విష్ణుపదమనగా ఆకాశము అర్థాత్ సూర్యస్థానము.

వైదిక కోశము 5-వ అధ్యాయము 6-వ ఖండమందు:- త్వష్టా- సవితా- భగః- సూర్యః- పూషా- విష్ణు- వైశ్వాన

రః- వరుణః- అనియును, భాష్యకర్తలగు యాస్కాచార్యులు విష్ణుశబ్దమునకు సూర్యుఁడని అర్థము వ్రాసియున్నారు.

" ఇరావతీ ధేనుమతీహిభూతం సూయవసినీ మనుష్యే దశాస్యా। వ్యస్కభ్నారోదసీ విష్ణవేతే దాధర్థపృథివీమభితో మయూఖైః॥ ఋ॥

విష్ణో = హేసూర్య. ఏతే + రోగసీ = ఈద్యులోక భూలోకములను. వ్యస్కభ్నాః=పట్టుకొనియున్నాడవు. మయూఖైః= నీ కిరణములతో అర్థాత్ ఆకర్షణ శక్తిచేత పృథివీమ్ = భూమిని. అభితః = నాలుగు దిక్కులనుండియు. దాధర్త = ధరించి యున్నానని యర్థము. ఇందువలన విష్ణునామము సూర్యునకని విదితమగుచున్నది. ఈ హేతువుచేతనే విష్ణుదేవుని కల్పించినవారలు సూర్యనామముయొక్క ఆధారముచేతను సమస్తము నుతత్సంబంధము చేతనుఁ జేర్చియున్నారు.

## విష్ణు వాహనము.

సూర్యుని గుణములన్నియు నీ కల్పిత విష్ణునియందు స్థాపితము చేయబడినవి. ఏయేపదములకు రెండర్థములు రెండు సమాసములు గలవో యట్టిశబ్దములను వాహనాది కల్పనలయందు నుపయోగింపఁ బడి యున్నవి. చూడుడు !

సుపర్ణ శబ్దార్థము సూర్యకిరణములకును గరుడ పక్షికిని చెల్లుచున్నది. ఎట్లన:—

" ఖేదయః- కరుణాః- గావః- రశ్మయః- అభీశవః- దీధిదయః- గభస్తయః- వనం- ఉస్రాః- వసవః- మరీచియాః-

మయూఖాః- సప్తఋషయః- సాధ్యాః- సుపర్ణాః- ఇతి పంచ దశరస్మినామాని. (వైదికకోశము ప్రథమాధ్యాయము 5-వ ఖండము.)

నిరుక్తము (4-2) నందు 'వయః సుపర్ణాఉపసేదురింద్రం' అనిగలదు. ఇది ఋగ్వేద మంత్రము. దీనిని యాస్కాచార్యులు నిరుక్తమందుదహరించి సూర్య కిరణములను అలంకారరూపముగ వర్ణించియున్నారు. (వయః) అతి గమనశీల (సుపర్ణాః) కిరణములు (ఇంద్రమ్) సూర్యసమీపమున (ఉప+సేదుః) చేరెను. (నాధమానాః) యాచనఁజేయుచు అర్థాత్ కిరణములు సూర్యుని సమీపించెను. ఆ కిరణములెట్లున్నవి ? (ప్రియమేధాః) యజ్ఞప్రియములై యున్నవి. సూర్యోదయము వినా యజ్ఞము జరుగదు. ఇత్యాదిగ యాస్కాచార్యులు సుపర్ణాః ఆదిత్యరశ్మయః అని వ్రాసినారు.

యత్రాసుపర్ణా అమృతస్యభాగ మను మంత్రమునకు సయితము యాస్కాచార్యులు "సుపర్ణా= సుపతనా ఆదిత్యరశ్మయః, అని వ్యాఖ్యానముచేసినారు. "గరుత్మాన్ గరుడస్తార్క్ష్యో వైనతేయః ఖగేశ్వరః। నాగాంతకో విష్ణురథః సుపర్ణః పన్నగాశనః" అని అమరము ఈ గరుడపక్షి నామములలో గరుత్మాన్-తార్క్ష్య శబ్దములు సూర్యకిరణార్థమందు వేదములో వచ్చియున్నవి. ఇచ్చట విచారాంశమేమన:— సూర్యునికి వాహనము కిరణము. ఎందుకనగా కిరణముల ద్వారా సూర్యుఁడు సర్వత్ర వ్యాపించుచున్నాడు. ఎప్పుడు సూర్యస్థానమందు విష్ణుదేవుఁడు ప్రత్యేకముగ కల్పింపఁబడెనో

అప్పుడే సూర్యుని వాహనమగు కిరణము (సుపర్ణము) యొక్క నామముచేతనే విష్ణువాహనమును కల్పింపఁబడెను. పేరునుబట్టి మనుష్యులలో గరుడపక్షియను అర్థవ్యాప్తిని యనుసరించి విష్ణువాహనము గరుడుఁడని ప్రతీతిగలిగినది.

గరుడపక్షి సర్పమును తినుచున్నది. సర్పమునకు 'అహి' యను పేరొకటి గలదు. వైదిక కోశమందు 'అహి' యనఁగా మేఘమునకర్థము. 'అహి-అభ్రమ్-బలాహకః' (నిఘంటు 1-10) సూర్యుని సుపర్ణకిరణము అహి అర్థాత్ మేఘమును భక్షించుచున్నది. ఈలాగున ద్వ్యర్థకశబ్దములు సంగతముచేసి విష్ణువును ప్రతిష్ఠించియున్నవారు.

సుపర్ణుఁడమృత హరణముచేసినకథ, మహాభారత ఆది పర్వమునందుఁగలదు. ఈ యాఖ్యాయికయొక్క మూలము సయితము సూర్యకిరణముగా నున్నది. అమృతమన జలమగుచున్నది. సుపర్ణుఁడను సూర్యకిరణము అమృతమను జలమున హరించుచున్నాడు. పాఠకమహాశయులారా! స్వయంవివేచన చేసి చూడుడు! ఋగ్వేదములోని

యత్రాసుపర్ణా అమృతస్యభాగ మనిమేషంవిదథాభి స్వరంతి । ఇనోవిశ్వస్యభువనస్య గోపాః సమాధీరః పాకమత్రా వివేశ" అను మంత్రాశయమును తీసికొని యీ సౌపర్ణాఖ్యానము రచింపబడినది. పై మంత్రమునకు నిరుక్తమందు యాస్కాచార్యులిట్లు వ్యాఖ్యానము చేసియున్నారు. సూర్య కిరణములు భూమినుండి జలాంశములను తపింపఁజేసి హరించుచున్నవి. అందుచే సంపూర్ణ భువనము రక్షింపబడుచున్నది.

పురాణములందు విష్ణువు క్షీరసాగరమందు నివసించు నని యున్నది. వైదిక కోశమందు సముద్రము ఆకాశమనంబడు చున్నది. యథా:—

అంబరమ్-వియత్-వ్యోమ-బర్హిః-ధన్వ-అంతరిక్షం ఆకాశమ్-ఆపః-పృథివీ-భూః-స్వయంభూ-అధ్వా-పుష్కరం-సగరః సముద్రః-అధ్వరమితి షోడ శాంతరిక్ష నామాని (నిఘంటు 1-3).

"ఏకః సుపర్ణ ససముద్ర మావివేశస ఇదం విశ్వభువనం విచష్టే। తంపాకేన మనసాఽపశ్యమంతి తస్తంమాతా రేఢి సఉ రేఢి మాతరమ్" (ఋ)పైమంత్రమునకు సాయణాచార్యు లిట్లు భాష్యము వ్రాసియున్నారు.

"ఏకః సర్వకార్యేష్వ సహాయః సుపర్ణః సుపతనః మధ్యమస్థానోదేవః సముద్రమంతరిక్షమ్ ఆవివేశ ఆవిశతి ఆవిశ్యచ సఇదం విశ్వం సర్వం భువనం భూతజాతం విచష్టే అనుగ్రాహ్యతయాఽభిపశ్యతి। తమేవం రూపం దేవం పాకేన పరిపక్వేన మనసా అంతితః సమీప అహమ పస్యమ దర్శమ్। కించమాతా ఉదకానాం నిర్మాత్రీ మాధ్యమికా వాక్ తం రేఢి ఆస్వాదయతి ఉపజీవన మాత్ర మత్రలక్ష్యతే। సఉస ఖలు మాతరం వాచంరేఢి లేఢితామేవోపజీవతి లిహఆస్వాదనే। అథ దుర్గాచార్య భాష్యమ్ ఏకఏవ అద్వితీయః యస్య పతనే గమనే। ప్రతిమాయానం అన్యం ద్వితీయంనాస్తి। ససుపర్ణః సుపతనో వాయుః సముద్రమ్ అంతరిక్షమ్ నిత్యం ఆవివేశ ఆవిశతిన కదాచిదప్యనావిష్టస్తత్ర। సచపునః సర్వభూతా

నుప్ర ప్రవేశీ తదా విశ్వం భువనం సర్వాణి ఇమాని। భూతాని విచష్టే అభివిపశ్యతి। యథాద్రష్టవ్యాని। తమేవం వర్తమానం అహంపాకేన మనసా విపక్వ ప్రజ్ఞానేన సర్వగత మపి సంతమ్ అంతికమ్ ఇవ అపశ్యమ్। ఋషిర్దృష్టదేవతా సత్వతః కస్మైచిదాచక్షాణో బ్రవీతి। తం మాతా రేళ్హి శిశురేఢి మాతరమ్। మాతా మాధ్యమికా వాక్ తముపజీవతి। పరస్ప రాశ్రయత్వా త్తయోర్వృత్తే రథ్యాత్మవదితి"।

భావార్థమేమన:—వాయువు (సముద్రమ్+అవివేశ) ఆకాశమందు వ్యాప్తమై యుండును. ఇచ్చట సాయణాచార్యులు సముద్ర శబ్దమునకు ఆకాశమని అర్థము చేసియున్నారు. "సముద్రియః సముద్రవ స్త్యస్మాదాప ఇతి సముద్రమంతరిక్షం తత్రభవః సముద్రియః" అని వ్రాసియున్నారు. ఎప్పుడు విష్ణు దేవుఁడు సూర్యునికంటె నన్యమని భావింపఁబడెనో అప్పుడు పృథివీస్థ సముద్రము విష్ణుని నివాస స్థానముగ భావింపఁబ డెను. ఎప్పుడు విష్ణుశబ్దమునకు సూర్యుడని అర్థవ్యాప్తియుం డెనో అప్పుడు సముద్రము అనగా ఆకాశము అర్థాత్ అంత రిక్షము నివాసముగ నుండెను. అట్టిసూర్యుని భూమికి దెచ్చిన తరువాత భూమిపైగల జలాశయము నివాసముగ చేయవలసి వచ్చెను.

వైదిక కోశము నిఘంటుప్రమాణములచే 'అప్' శబ్దము ఆకాశవాచకమగుచున్నది. దీనిని మరచిపోయి సంస్కృతభా షలో ననర్థము చేయబడినది. అప్ శబ్దము నిత్య బహువచన మందు వచ్చుచున్నది. ప్రథమలో 'ఆపః' యగుచున్నది. ఇప్పుడీ

శబ్దము కేవలము జలమనుటయందే ప్రయుక్తమగుచున్నది. ఈ హేతువుచేత మా నారాయణుఁడు జలమందు వసించువాడని కల్పితమైన కథలను రచించిరి.

భగవంతుఁడు సంపూర్ణ జగత్తంతయు వ్యాపించి యున్నాడు గాని కేవలము జలమునందు నివసింపడు. *

సగర శబ్దము సంయితము ఆకాస వాచకము. ఆకాశ మందు మేఘములుండుటవలన మేఘముకూడ సముద్రము అథవా సాగరమనఁబడుచున్నది. ఆకాశ సాగరమునుండియే పృథివీ సాగర మేర్పడును గనుక "సగరస్యాపత్యాం సాగరః" అని చెప్పఁబడుచున్నది. ఆకాశమునకు సముద్రము పుత్రుడై యుండుటచేత సాగర మనఁబడుచున్నది. లోకులు సగర శబ్ద ముయొక్క భావమును తెలియక సగర చక్రవర్తి కథను కల్పించియున్నవారు.

విష్ణువు శేషశాయి యనుటకు ద్వ్యర్థక శబ్దమే కారణ మైయున్నది. సూర్యుని యాకర్షణ శక్తివలన పృథివ్యాది సమస్తగోళములు నిలిచి యున్నవి. సూర్యుఁడేమి యాధారమున నిలచియున్నవాడని ప్రశ్న వేయ తుదకొక మహాశక్తియుక్తమగు పదార్థముయొక్క యాధారమని చెప్పెదము. తుట్టతుదకిదంతయు నెవరి యాధారమున నిలిచినదన్నప్పుడు అచింత్యశక్తి మంతుఁడగు నా పరమేశ్వరుని యాధారమని నిశ్చయింతుము. అట్టి బ్రహ్మకు శేషమని పేరు. ప్రకృతిగాక మిగిలినదేది?

బ్రహ్మము. అదే శేషము. శేష శబ్దమునకు సర్పమనియు నర్థము. సూర్యుఁడు విష్ణువయ్యెను. తదాధారమగు బ్రహ్మవిశేషము పృథివీస్థమైనప్పుడు సర్పవిశేషమై పర్యంకమయ్యెను.

అనంత శబ్దము పామునకు నాకాశమునకును గలదు. ఆకాశము సూర్యునకు శయనాధారము. సూర్యస్థానీయుఁడగు విష్ణువున కాధారము అనంతశబ్దార్థమగు నాకాశము. దానిని మూర్తివంతముగఁ జేయుటలో శబ్దార్థము ననుసరించి సర్పమయ్యెను.

హరిశబ్దము సూర్యునకును వైదికకోశమందు సూర్య కిరణములకును వాడఁబడియున్నది. సూర్యుఁడు సహస్రకిరణములు గలవాఁడు అర్థాత్ బహు కిరణములుగలవాఁడు. గనుక యనంతవాచకమగు సహస్ర శబ్దమును సర్పఫణములతో సంబంధముచేయబడినది. తర్వాత హరి శబ్దమునకు విష్ణువని అర్థము యేర్పడినది.

విష్ణువు చతుర్భుజుఁడని పురాణములందు గలదు. కొన్ని చోట్ల "కృతపాదః సుపర్ణాంసేప్రలంబాష్ట మహాభుజః- దశబాహుర్మహాతేజో దేవతా రినిషూదనః" అని యెనిమిది భుజములు గలవాఁడని పదిబాహువులు గలవని చెప్పఁబడినది. కాని రెండు తలలవాఁడని నాలుగు కన్నులు గలవాఁడని యెచ్చటను చెప్పియుండలేదు. ఐతే నాలుగు భుజములు గలవాడని మాత్ర మేల చెప్పవలయును? కారణ

లందును వ్యాపించి యుండును. కిరణములకు కర- భుజ- హ_స్త శబ్దములు ప్రయుక్తములై యున్నవి.

"చతసృషు దిక్షుభుజాః కిరణాయస్య స చతుర్భుజః సూర్యః" అథవా "చత్వారోభుజా బాహవోయస్యస చతుర్భుజః" అని సమాసము. సూర్యస్థానమందెప్పుడు విష్ణుదేవుఁడు కల్పితమాయెనో అప్పుడు చతుర్భుజ శబ్దము విష్ణువునందు సంఘటిత మయ్యెను. సూర్యునకు దిక్కులు బాహువులై యున్నవి. అవి నాలుగనియు నెనిమిదనియు పదియనియు మూడురీతులను చెప్పఁబడు చుండుట సుప్రసిద్ధము. కిరణము లన్నిదిక్కులయందును వ్యాపించును గాన సూర్యునివలెనే తత్ స్థానమునందు కల్పితమైన విష్ణువు చతుర్భుజుఁడును అష్టభుజుఁడును దశభుజుఁడు నయ్యెను.

విష్ణువు కృష్ణవర్ణముగలవాడని సర్వత్రగలదు. వేద మందు సూర్య దేవునికి కృష్ణశబ్దము వాడబడియున్నది. సూర్యుని యందాకర్షణశక్తి యధికముగ నుండుటవలన నతనికి కృష్ణ శబ్దము చెప్పఁబడినది. ఆకర్షణశక్తి యుక్తమగు పదార్థమునకు కృష్ణయనిపేరు. ప్రపంచ మందలి ప్రతి పరమాణువందును ఆకర్షణశక్తికలదు గాని సూర్యునియందది యెక్కువగలదు. గనుక సూర్యునియందు కృష్ణ శబ్దార్థము ఆకర్షణమైయుండెను. విష్ణునియందు నలుపు అథవా శ్యామవర్ణముగా నున్నది. ఇది అర్థపరివర్తనము.

[కొన్నిచోట్ల విష్ణువు శ్వేత వర్ణముగలవాడని మూల గ్రంథముననున్నది. అది మనప్రాంత్యమందు ప్రచలితమై యుండ లేదు. గాన నాయంశమును విడిచితిమి.]

శ్యామ శబ్దమునకు సుందర రూపమని అర్థము. కావ్యాదులందు "శీతకాలేభవేదుష్ణా గ్రీష్మేచ సుఖ శీతలా। తప్త కాంచనవర్ణా భాసా శ్యామేత్యభిధీయతే" అనగాపరమసుందరి యగుస్త్రీని కావ్యములందు 'శ్యామా' యని పిలువఁబడి యున్నది. శ్యామ శబ్దమిచట సుందరమునే బోధించుచున్నది. ఎందుకన మనదేశమందెచ్చటఁ జూచినను సుందరమగు మోహనరూపవిగ్రహములున్నవి గాని యే మందిరమందును వృద్ధ రూపములు లేవు. రావణుని సంహరించిన సమయమందు రాముడు బాలుఁడుగా నుండలేదు. అయినను రాము విగ్రహ మెచ్చటజూచినను బాల్యరూపమే యుండును. కృష్ణశబ్దమునకు శ్యామశబ్దము పర్యాయపదముగా విష్ణువర్ణన మందనేక చోట్ల నున్నది. ముఖ్యముగ వేదమందు సూర్యుడు కృష్ణ వాచ్యుఁడై యున్నవాడు. ఎందుకన తనపరిత@స్థిత గ్రహముల నన్నింటిని ఆకర్షించియుండుటచేతనే సూర్యస్థానీయ విష్ణువు కృష్ణవర్ణమని చెప్పఁబడెను. ఇంతియగాక విష్ణువుయొక్క అవతారములు గూడ కృష్ణ వర్ణమని చెప్పబడినది.

విష్ణువుయొక్క సతి లక్ష్మి అథవా శ్రీదేవిగా నున్నది. శోభా-సంపత్తులకు లక్ష్మి- శ్రీలని పేరు. ఈభూలోకములో శోభా-సంపదలకు కారకులెవరు ? సూర్యుఁడు లేకున్న శుభ సంపదలు బొత్తిగానుండవు. సంధ్యాసమయమప్పుడు ప్రకృతిని

చూడుడు! సమస్త ప్రాణులయందును పరివర్తనములు ప్రాప్తించును. ఆకాశమునకు భూషణములగు విహంగగణములు తమతమ నివాసములు గూర్చి వెడలుచున్నవి. పశుగణంబులు తమ విలాసంబులు మాని గ్రామములు చేరుచున్నవి. అంధకారమగు వేళకు సర్వప్రాణులును భయభీతులై కాలముగడపుచున్నవి. చిన్నచిన్న పతంగ మక్షికాదులు తమ క్రీడాకౌతుకములు త్యజించి యేదో యొకచోట మౌనముగ కాలముం బుచ్చుచున్నవి. అంతటను భయమావరించు చున్నది. సమస్త ప్రాణికోటియు సూర్యునిరాక కెదురు చూచుచుండును. పండితులు రాత్రిని ప్రళయమని వర్ణింతురు. రాత్రి సమయమందు వెన్నెల ప్రకాశించి శోభాయమానమై యున్నను అదియు సూర్యదేవుని యనుగ్రహమే యగును. చంద్రునకు స్వయం ప్రకాశము లేదు. అది సూర్యునివలననే కలుగును. సూర్యుడు లేకున్న ప్రాణులకు దృష్టి లేదు. దృష్టిలేనప్పుడు శోభా-సంపదల మాటయేమి? పంటలెక్కడివి? వర్షమెట్లు కురియును? సూర్యుఁడు లేకున్న మేఘములేర్పడవు. ఏవిధమైన రూపముండదు. ఈ కారణముచేతనే సూర్యుఁడు విశ్వరూపుఁడనఁబడుచున్నాఁడు. అతఁడు రోగవినాశకుఁడు. సూర్యుఁడు లేకున్న ఓషధులు వృక్షాదులుండవు. గనుక సంపద సౌందర్యములు అర్థాత్ లక్ష్మీ శ్రీలు సూర్యస్థానీయమగు విష్ణువునకు పత్నిగా చేయబడి యున్నది.

"శ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ" యను యజుర్వేదమంత్ర మునకు మహీధరుఁడు పైయభిప్రాయ యుక్తముగనే భాష్య మును వ్రాసియున్నాఁడు. చూడుడు.

"హే ఆదిత్య! శ్రీః లక్ష్మీశ్చ తేతవపత్న్యౌజాయా స్థానీయే త్వద్వశ్యేయిత్యర్థః । యయాసర్వజనాశ్రయణీ యోభవతి సాశ్రీః శ్రీయతేఽనయా శ్రీః సంపదిత్యర్థః । యయాలక్ష్యతే దృశ్యతే జనైఃసాలక్ష్మీః సౌందర్యమిత్యర్థః । " ఇత్యాది-

పత్నియన శక్తిమాత్రమని భావించవలయును. పాల యిత్రీశక్తియొక్క పేరు పత్నియగుచున్నది. జడములకు మనుష్యు లకువలె స్త్రీలులేరు. పరంతు వానిలో నొకమహాశక్తిగలదు. దానిచే జగత్పాలన పోషణలు జరుగును. అట్టిశక్తిపేరు పత్ని యనఁబడుచున్నది.

లక్ష్మి సముద్ర మందుద్భవించినది. సముద్రమన నాకా శమని యిదివరకే నిరూపించినారము. లక్ష్మియన సూర్యశక్తి యని విస్పష్టమైనది. సూర్యుని విష్ణురూపముగ- (దేహధారిగ) కల్పించినప్పుడు మనుష్యవత్ పత్ని కావలసివచ్చెను. గనుక సూర్యశక్తిని లక్ష్మిగా కల్పింపఁబడెను. లక్ష్మియన శోభా- సౌందర్య- సంపద- ఐశ్వర్యాదులని సాధారణముగా రూఢి లోనున్నది.

పురాణములందు విష్ణువునకు కమలపుష్పములందు ప్రీతియు ప్రసన్నత కలుగునని చెప్పఁబడియున్నది. ఈ విషయ మందును సూర్య సంఘటనమే కారణముగానున్నది. అలంకార రూపముగ కమలినీరూపమగు స్త్రీకి నాయకుఁడు సూర్యుఁ

డగుచున్నాడు. సూర్యోదయమైనతోడనే కమలము ప్రస్ఫుటిత మగుచున్నది. అస్తమైన తోడనే సంకుచితమగుచున్నది. ఈ హేతువుచేత సూర్య స్థానీయుడగు విష్ణువు కమిలినీ నాయకుడని వర్ణింపబడినది. మరియు పుండరీకాక్ష కమల నయనాది విశేషణములచే పిలువబడుచున్నాడు. కమలము నకు వేయిదళములుండుటవలన సహస్ర పత్రమనియు సూర్యు నకు సహస్రాంశుడనియు సంబంధము చేయబడియున్నది. గనుక విష్ణువు సూర్యస్థానీయుడని విస్పష్టమగుచున్నది.

పురాణేతి హాసములందు సముద్రమథన కథయొకటి కలదు. అందు కొన్నివ్యత్యాసములున్నవి. రామాయణము, భారతము రెంటిలో శోధించినయెడల వ్యత్యస్తము తెలియును. ఈ కథయొక్క భావమేమి? ఇంతవరకే సముద్ర మన నాకాశ మని విదితమైనది కదా? అసుర శబ్దమునకు మేఘమని యర్థము. ఇందుకు ప్రమాణము:—

అద్రిః- గ్రావా- గోత్రః- బలః- అశ్నః- పురభోజాః- వలిశానః-అశ్మా-పర్వతః-గిరిః-వ్రజః చరుః-వరాహాః-శంబరః- రోహిణః- రైవతః- ఫలిగః- ఉపరః- తపలః- చమసః- అహిః- అభ్రం- బలాహకః- మేఘః- దృతిః ఓదనః వృషంధిః- వృత్రః- అసురః కోశః-ఇతిత్రింశన్మేఘనామాని(నిఘంటు 1-10). ఇందు వలన అసురశబ్దము మేఘవాచకమనిస్పష్టమయ్యెను. దివ్య గుణముగల ప్రతిపదార్థమునకును 'దేవ' నామముగలదు. దేవశబ్ద మునకుసూర్యకిరణములర్థము. సూర్యకిరణములగు దేవతలును, మేఘములగు నసురులునుకలసి సముద్రమను ఆకాశమును మథ

నము చేయుటవలన జలరూపమగు నమృత ముత్పన్న మగుచున్నది. 'పయః కీలాలమమృతం' బనియమరము. మేఘరూపములుగానుండు అసురులు అమృతమును తీసికొని పోవుచుండుట ప్రత్యక్షముగఁ జూచుచున్నారము. అప్పుడు విష్ణురూపుఁడగు సూర్యుఁడు విద్యుత్ రూపమగు మోహినీ యవతారమును ధరించి అసుర గణమునందు ప్రవేశించి భిన్న భిన్నముచేసి అమృతమును గురిపింపగా సమస్త పదార్థరూపములగు దేవతలు తృప్తులగుచున్నారు. ఈలాగున ప్రతి సమయమందును సముద్రమథనము జరుగుచున్నది.

వర్షారంభమునకు మునుపు మిక్కిలి యుష్ణ ముత్పన్నమగుచున్నది. అది యొకప్పుడు మిక్కిలి దుఃఖదాయక మగుచున్నది. ఈ యుష్ణాధిక్యమునకే హాలాహల కాలకూట విషమని పేరు. ఈ విషమాకాశసముద్రమం దుత్పన్నమై లోకమును తపింపజేయుచున్నది. జంతు సంతానములను తత్తఱింప జేయుచున్నది. దానిని విద్యుత్ రూపమగు రుద్రుఁడు పానము చేయుచున్నాడు. అర్థాత్ నశింపజేసి పూర్ణవర్షమును గురిపించుచున్నాడు.

వర్షఋతువునందూర్ధ్వముగ నుత్పన్నమగు వాయువున కుచ్చైఃశ్రవమని పేరు. ఇది సూర్యుని యాధీనమందున్నది. "అశూవ్యాప్తవ్ సంఘాతేచ" యను సమాసము చేత ఘనీభూతమై వ్యాపించుటచేత వాయువు అశ్వమనఁ బడుచున్నది. సముద్రమథనమందలి ఉచ్చైఃశ్రవమిదియే.

ఐరావతమను యేనుఁగు ప్రకటమయ్యెనని యున్నది. ఇరా నామము అన్న వర్షాదులకు చెల్లును. "ఇరాంద్రృణాతీతి వా ఇరాం దదాతీతి వా ఇరాం దధాతీతి వా ఇరాం దారయతే ఇతివా ఇరాం ధారయతే ఇతివా" ఇత్యాది నిరుక్తప్రమాణములవలన నిరావాఙ్ సంబంధమగు వస్తువు "ఐరావత" మగుచున్నది.

మేఘమునకు సంయుత మైరావతమని పేరు. వర్షముచే నిండియుండు మేఘమున కైరావతమని పేరు. అనఁగా మందగమనముగల మేఘము ఐరావతమనఁబడును. ఇదియు నాకాశమునం దుత్పత్తియగుచున్నది. చతుర్దిక్కుల నుత్పన్నములై వృక్షాకారముగ గనుపించు మేఘముల సమూహాము పారిజాత నామముచే పిలువఁబడు చున్నది. ఇదియు నాకాశ సముద్రమం దుత్పత్తియగుచున్నది.

సముద్రమథనమందొక కౌస్తుభమణి యుత్పన్నమయ్యెనని గలదు. "కౌపృథివ్యాంపదార్థాఙ్ యఃస్తోభవతిస్తభ్నాతి హింసతీతి కౌస్తుభో మేఘవృష్టప్రస్తరః" పృథ్వీపైగల పదార్థములను హింసించునట్టి ప్రస్తరము కౌస్తుభమగుచున్నది. ఇది మేఘమునుండి పడునట్టి మేఘాగ్నిప్రస్తరము. దీనిని ధరించి యుండువాడు సూర్యుఁడు అనగా విష్ణువు.

వారుణీదేవి యుత్పన్నమైనట్లు కొన్ని చోట్ల చెప్పఁబడినది. ఇది వర్షముయొక్క రూపాంతరము.

విచార శీలురగు విద్వాంసులారా! సముద్రమథనము యొక్క సత్య మింతయే యని విష్ణుసూక్త మంత్రార్థములను

పఠించినచో విదితమగును. ప్రాచీనార్థమును తెలియుటకు ప్రయత్నించుడు.

వామనావతారము యొక్క కథయు పురాణములందు విస్తారముగ గలదు. భారతీయులు తమ పూజ్యభగవానుఁడు ఛలకపటములు గలవాఁడని నమ్మి ప్రమోదమగ్నులగు నంతటి ఘోరాంధకారమగు నీసమయమునుఁ జూచి మాకు మిక్కిలి దుఃఖమగుచున్నది. అంతియకాదు తాము ను ఛలకపటములతో జీవనము జరుపుట విధియని తలంచియున్నారు. యదార్థమును కనుగొనుట మనకర్తవ్యమైయున్నది. గనుక నీకథ యెట్లు కల్పింపఁబడినదో చూడుడు. సూర్యుఁడే యీ వామనావతార కథకు కారణమై యున్నాడు. ఈ కథయందు త్రివిక్రమ శబ్దము ప్రయోగింపఁ బడియున్నది. ఎవని కిరణములు త్రిలోకములందు వ్యాప్తమగునో- అతఁడు త్రివిక్రముఁడనబడుచున్నాఁడు. సూర్య కిరణములు ద్యులోకమందును అంతరిక్ష లోకమందును పృథ్వీలోకమందును వ్యాప్తమగుచున్నవి. గాన సూర్యుఁడు త్రివిక్రముఁడు. ప్రాతఃకాల సూర్యునకు వామనుఁడనిపేరు. ఎందుకనఁగా ప్రాతఃకాలమందు సూర్యుడు మిక్కిలి యల్ప ముగ కనఁబడుచున్నాడు. అట్లు చిన్నగ ప్రతీతమగు సమయ మందు అంధకారము ప్రబలియుండును. అట్టి యంధకారమునకు బలియనిపేరు. సూర్యుఁడు ప్రబలుచు నూర్ధ్వముగ వ్యాపించిన ప్పుడు అంధకార మనఁబడు బలి పాతాళలోకము చేరును. అనగా నశించుటయే పాతాళగమనము. అప్పుడు దేవగణము

అర్థాత్ జీవగణము ప్రసన్నమగుచున్నది. ఆ కథయొక్క భావమింతయే.

విష్ణు శబ్దము—(1) విష్‌ఌ వ్యాప్తౌ (2) విశ ప్రవేశనే (3) విపూర్వక అక్షూవ్యాప్తౌ సంఘాతేచ-యీ ధాతువుల వలన సిద్ధమగుచున్నది. సర్వస్థలమందును అథవా అంతటను యేదివ్యాపించి ప్రవేశమగునో అది విష్ణువనబడుచున్నది. ఇది పరమాత్మయందు ముఖ్యమై సూర్యునియందు గౌణమగు చున్నది. సూర్యుఁడు భూగోళము కంటెను 13 లక్షలంతలు గొప్పయై కిరణములతో ప్రకాశించుచు నుష్ణమును సర్వత్ర వ్యాపింపఁ జేయుచున్నాఁడు. ఇందుచేత సూర్యుఁడు విష్ణువనఁ బడుచున్నాఁడు. ఇట్టి కారణముచేతనే యజ్ఞమునయితము విష్ణువని పిలువఁబడుచున్నది. గుణమునసరించి శబ్దప్రయోగము చేయ బడియున్నది. వామనుఁడదితి గర్భమందుత్పత్తియైనవాఁడని గలదు. వేదమందు సూర్యుని అదితి పుత్రుఁడని చెప్పియున్నది. యాస్కాచార్యులందుకు "ఆదిత్యః కస్మాత్ ఆదత్తే రసాన్ । ఆదత్తేభాసం జ్యోతిషామాదీప్తోభాసేతివా అదితేః పుత్రఇతివా" (నిరుక్త 2-13).

రసముల పీల్చువాఁడు అథవా చంద్రనక్షత్రాది కాంతులను తీసికొనుచున్నాఁడు. జ్యోతిచే నావృతమైన వాఁడు గనుక ఆదిత్యుఁడనఁబడుచున్నాఁడు.

ద్యౌ- అదితి యీరెండుపేర్లును ద్యులోకవాచకములు. "అదితి ద్యౌరదితిరంతరిక్షమ్" అని వేదమందు గలదు. పుత్ర శబ్దము మనుష్యపుత్రవతు కానేరదు. ద్యులోకమునకు

సూర్యుఁడు భూషణముగనున్నాఁడు గావున దివస్పుత్రుఁ డన బడుచున్నాఁడు. ద్యులోకస్థగ్రహ గోళముల నన్నింటిని తన ధారణశక్తివలన రక్షించుచుండుటచేత అథవా పోషించుట చేత 'దివస్పుత్రుఁడ' య్యెను. "దివః పుత్రాయతేస ఇతి దివస్పుత్రః । దివః పాలకా యేతివా" యని మహీధరులు చెప్పి యున్నారు. అదితియన, దినమునకు పేరు. వామన బలి కథ యంతయు ప్రాతఃకాలిక సూర్యవర్ణనముగా నున్నది. ఈ కథ ప్రతిదినమందును జరుగుచున్నది. పద్మ పురాణమందొక భాగ ముగ చెప్పఁబడు కార్తికమాహాత్మ్యములో నొక కథగలదు. ఇది విష్ణువునకు తులసి యెట్లు ప్రియతమ మయ్యెనను ప్రశ్న పైజరిగినది. ఇంద్ర రుద్రులకు యుద్ధముజరుగుట ఇంద్రుఁడు పడిపోవుట బృహస్పతివచ్చి రుద్రుని ప్రార్థించుట రుద్రుఁడు తనఫాలనేత్రాగ్నిని సముద్రమునఁ బడవేయుట తక్షణ మది యొక బాలుడగుట ఆ బాలునకు జలంధరుఁడని సముద్రుఁడు బ్రహ్మచే నామకరణము చేయించుట. జలంధరుఁడు వృందను వివాహమాడి దేవతల నోడించుట. జలంధరుని వధకు సాధన మాతని సతియగు వృందయొక్క పాతివ్రత భంగముగావింప వలెనని విష్ణువుతలంచి మాయచేసి జలంధర రూపమును ధరించి వృంద యొక్క పతివ్రత్యమును భంగపరచుట. ఆమె విష్ణువునకు శాపమిచ్చుట, విష్ణువును శపించి వృంధయగ్నిప్రవే శముఁ జేయుట. విష్ణువు మోహపరవశుఁడై వృందను స్మరిం చుచు జగత్తును ధ్వంసము చేయుటకుపక్రమించుట. దేవతలు మహేశునితో మొఱపెట్టుకొన నతఁడు మూలప్రకృతి

యొద్దకుఁ బంపుట. లక్ష్మి సరస్వతీ పార్వతీ రూపములతో ప్రకృతి మూడు బీజములనిచ్చి విష్ణువుండుచోట యావిత్తనముల నాటుమని చెప్పుట. దేవతలట్లేచేయ నవి-ధాత్రి (ఉసిరిక) మాలతీ (జాజి) తులసీ యను మూడు చెట్లుగ సరస్వతీ లక్ష్మి గౌరి యీ ముగ్గురును మొలచుట. తులసితో గూడి విష్ణువు వైకుంఠముఁ జేరుట యిత్యాదికథ కల్పింపఁబడినది. ఈ కథను స్త్రీలధికముగ వినుచుందురు. సోదరులారా! ఈ కథను వినుటవలనను పురుషులు విష్ణునిచర్య ననుసరించినను గృహస్థ ధర్మమేమగునో మిక్కిలి ధ్యానముతో యోచించుడు. ఇందు శివద్రోహము గలదు. గాన దీనిని వైష్ణవ పక్షపాతి కల్పించినదని తెలియుచున్నది. అయిన విష్ణునిపై వచింపరానట్టియు తలంపరానట్టియు కళంకమును మోపియున్నవాఁడు. గావున వాడు మహాపాతకుఁడని చెప్పవలయును. ఇదంతయు యథార్థమెరుంగని గొప్ప దోషము.

జలంధరుఁడన మేఘమని యర్థము. "జలం ధర తీతి జలంధరః" రుద్ర శబ్దము విద్యుత్తునకు నామమని తెలియును గదా ? విద్యుత్ శక్తి అర్థాత్ ఆగ్నేయ శక్తి అధికమై సముద్రముమీద పడినప్పుడు జలంధర నామక మేఘముత్పత్తి యగుచున్నది. విద్యుత్ మేఘముతో యుద్ధము చేయును. కాని కేవల విద్యుత్తుచే మేఘము మరణించదు. మేఘముల సమూహమునకు వృందమని పేరు. ఇది స్త్రీలింగముగ ప్రయోగింపఁబడి జలంధరుని స్త్రీగా వర్ణింపఁ బడినది. వృందమీద సూర్యకిరణములు పడుటచేత కరగి భూమిపై పడుట కారంభ

మగుచున్నది. దీనినే పాతివ్రత భంగమని తలంచవలయును. వృంద వినాశము తటస్థించిన యుత్తరక్షణముననే జలంధర వినష్టముకూడ సంభవించును. ఇట్టి సత్యమెఱుఁగజాలక మూర్ఖులు నానావిధముల చెడిపోవుచున్నవారు. ఇది మిక్కిలి శోకము ! అనేకు లార్షగ్రంథములను జూడక ప్రాథమికుల యందును, మహాత్ములయందును, మిథ్యలగు కలంకముల నారోపించుచున్నారు. బ్రాహ్మణ గ్రంధములందు రాత్రికి అహల్యయనిపేరు. "అహర్ లీయతే=అహల్యా" పగలు లయ మగుటకు అహల్యయనఁబడుచున్నది. ఇంద్రుఁడన సూర్యుఁడు. రాత్రి సమయాధిపతి చంద్రుఁడు అర్థాత్ గౌతముఁడు "తమసిగచ్ఛతి = గౌతమ" రాత్రిగమనము చేయువాఁడు. ఈ యుత్తమాలంకారమును చెరిచి పాడుజేసి వ్యభిచారమును స్థాపించు కథలను కల్పించి యున్నారు.

మహాశయులారా ! ఈరీతిగా మనము విష్ణుసంబంధ మైన గాథల నన్నింటిని వివేచనచేసి చూచిన యెడల నన్నియు సూర్యునియందు సంఘటిత మగుచుండును. ఈ గూఢాశయ మెఱుంగనివారు విష్ణుదేవుని నిర్మించిరి. తరువాత వారు విగ్ర హములను నెలకొల్పిరి. వైష్ణవమతమును సృజించిరి. తుదకు తుచ్ఛమగు పదార్థములను సయితము విష్ణు స్వరూపముగ భావించి పూజింపసాగిరి. సాలగ్రామ పూజయే యిందు కుదాహరణము. సాలగ్రామము శిలకాదు. అది గవ్వ అథవా గుల్ల. దానిలోనొకవిధమగు జలజంతువుండును. దానిని ఇంగ్లీషు వారు Ammonite ఎమ్మోనైట్ యని పిలిచెదరు.

గండకీ నదిలో మృతమైనవియు జీవితముతో చరించునవియు గలవు. మిక్కిలి చిన్నవి యొక అణువంతయు, మిక్కిలి పెద్దవి బండి చక్రమంతయు నుండును. అది గవ్వజాతి యనియు శిలకాదనియు ప్రకృతిశాస్త్రజ్ఞులు కనిపెట్టియున్నారు. దాని సుందరత్వమును జూచి పామరులు ప్రథమములో పూజించిరి. క్రమక్రమముగ నది పండితులవరకు పరంపరాచారమాయెను. ఇవియు సూర్యుని బోలియుండును. అనేక రేఖలుండును. సూర్యభగవానుని యవతారములని యిప్పటికిని పూజించుట మనము చూచుచున్నారము.

తులసీ యుపాఖ్యానము మఱియొకటికలదు. ఈకథలో తులసియొక్క శాపముచేత విష్ణువు సాలగ్రామమై పోయినట్లు కల్పింపఁబడినది. శంఖచూడుఁడను రాక్షసుఁడుండెను. అతని భార్య తులసీ నామముగలది. సతిపతులిద్దరును విష్ణుభక్తిపరాయణులు. భార్యయొక్క పాతివ్రత్య మహిమచేత శంఖచూడుఁడతి ప్రతాపశాలి యాయెను. వానిని జయించుటకు విష్ణువు వంచించి వాని కవచము మున్నగువానిని యపహరించి వృందనువలె తులసిని భ్రమింపఁజేసి పాతివ్రత భంగము చేసెను. ఇది తెలిసి విష్ణువును పాషాణమగునట్లు శపించెను. తులసియొక్క శరీరమే గండకీనది యయ్యెను. దాని కేశములు తులసి వృక్షము లయ్యెను. ఇత్యాదిగ వర్ణింపఁబడి యున్నది.

ఇట్లు ప్రాథమికులు సూర్యప్రతినిధిగ వర్ణించిన యలంకారములు కాలక్రమమున సత్యమని నమ్ముటవలన నాధునికు లనేకులు సంబంధము లేని కథలను సయితము కల్పింప

సాగిరి. విష్ణు అవతారములు ప్రబలెను. వైష్ణవమతము స్థాపితమాయెను. విష్ణువే భగవంతుఁడయ్యెను. ఆలయములు నిర్మింపఁబడెను. తీర్థస్థానము లేర్పడెను. ఈలాగుననే బ్రహ్మయు నొక ప్రత్యేక దైవమని భావింపఁ బడియున్నది. ఆ విచారమును సమీక్ష చేయుదము.

---

# వాయువే బ్రహ్మ.

వాయువు భూమ్యాకాశములు నిండియున్నను దృష్టిగోచరము కానేరదు. అయినను దాని పనియు నది చేయు క్రియయు. ప్రతిబాలునకు సహితము తెలియును. సముద్ర జలమందెట్లు మత్స్యాది జలజంతువులు నివసించునో తద్వతు మనము వాయువునందున్నారము. సూర్యచంద్ర నక్షత్రములు సర్వదా దృశ్యములు కానేరవు. వాయువు ప్రతి క్షణము విద్యమానమై యుండును. సదా తన కర్మము నాచరించుచుండును. ఇది బాహ్య ప్రపంచమందేగాక జీవకోటియొక్క యాభ్యంతరిక నేత్ర శ్రోత్ర కర్ణ ఘ్రాణ మనోబుధ్యాదులు విశ్రాంతియందుండగా ప్రాణవాయువు సదా చలించుచుండును. దానికి నిద్రలేదు. విశ్రామములేదు. కల్పాంతరమువరకు నీలాగే వాయువు పనిచేయుచుండవలయును. ఇందువలన వాయువుయొక్క దినపరిమితి మిగులగొప్పది. వాయువులేకుండ మనమొకక్షణము జీవించజాలము. స్థావరములు సహితము, వాయువులేకుండ జీవింపజాలవు. అగ్నియన్ననో వాయువును విడిచియుండదు. గనుక వాయువు దేవుడనిపిలుచుటకు యోగ్యముగా నున్నయది.

గ్రీష్మఋతువునందు వాయువు వృద్ధియగుచుండుట సర్వజనవిదితము. ఇది యుష్ణముచేత వృద్ధియగుచున్నది. సూర్యుని తీక్షణకిరణములు వాయుమధ్యమందు ప్రవేసించుట

చేత నది ఛిన్నభిన్నమై నానాదిక్కులకు వ్యాపించి వీచుట కారంభించుచున్నది. అప్పుడు వాయువునందు విస్తృతము వేగము రెండును యధికమగుచున్నవి. ఈ కారణముచేత వాయువు సూర్యపుత్రుఁ డనఁబడుచున్నాఁడు. నలుదిక్కులు వ్యాపించుటచేత చతుర్ముఖుఁడనఁబడుచున్నవాఁడు.

వాయువువలన శబ్దముయొక్క యుత్పత్తియు గ్రహణము అర్థాత్ వ్యాపింపఁజేసి వినునట్లు చేయుటయు సంభవమగుచుండును. మన యాభ్యంతర ప్రాణవాయువు చేతనే మనకు వాక్కు అనగా నోటియందు శబ్దోచ్చారణ మేర్పడుచున్నది. అభ్యంతరవాయువు వాణిని యుత్పత్తిచేయగా బాహ్యవాయువు దానిని గ్రహించుచున్నది. వాయువు బ్రహ్మ యని యిదివరకే చెప్పియున్నారము. వాణిని యుత్పత్తిచేయుటచే వాణి అథవా సరస్వతికి బ్రహ్మ జనకుఁడయ్యెను. వాగ్వాణీ సరస్వతి యను నామములు, శబ్దవాచకములని అమరకోశమందు గలదు.

భాషయనఁగా వాయువుయొక్క శక్తియగుచున్నయది. శబ్దము నుత్పన్నముచేసి మఱియు దానిని గ్రహించుట వాయుధర్మము. వాయువులేనిచోట శబ్దము వ్యాపింపదు. మరియు నొక గృహమునుండియు, గృహము లోపలికిని, వాయువుయొక్క రాకపోకలు లేకుండచేసి గృహమందొక గొప్ప గంటవాయించినను వెలుపల నుండువారికది వినఁబడదు. ఇందువలన శబ్దరూపమగు సరస్వతి వాయురూపమగు బ్రహ్మకు పుత్రియు శక్తియు నగుచున్నది. బ్రహ్మ తన పుత్రిని తానే

గ్రహించెనను యలంకారము గ్రహింపలేనివారు కల్పితమగు యశ్లీలగాథలను రచించియున్నవారు.

సూర్యుని కారణముచేత వాయువు మిగుల వేగవంత మగునని యిదివరకు మనకుఁ దెలియునుగదా? ఇందువలన వాయువునకు సూర్యుఁడు వాహనమయ్యెను. సూర్యునకు వైదిక లౌకిక భాషలయందు 'హంస' యని పేరు గలదు. ♦ ఈ హేతువుచేత వాయుస్థానీయ బ్రహ్మకు సూర్యస్థానీయ మగు 'హంస' వాహనమయ్యెను.

వాయువు ప్రతి క్షణమందును సృష్టిచేయుచున్నది. సర్వత్ర ప్రవేశించుచున్నది. గనుక మాతరిశ్వాయని పిలువఁ బడుచున్నది. మాతా అర్థాత్ నిర్మాణము చేయునది యగు చున్నది. సమస్త సామర్థ్యములకు సాధన భూతమైనది. గాన ధాతా-విధాతా-స్రష్టా యిత్యాది నామములచే పిలువఁబడు చున్నది.

సంస్కృతమందు యీశబ్దరూపము "బ్రహ్మన్" అగు చున్నది. ఇది "బ్రహ్మా-బ్రహ్మ"యని పుం నపుంసక యుభయ లింగమగుచున్నది. పరమేశ్వరునకును ఋత్విగాదులకును అర్థ మగుచున్నది.

ఇప్పుడు బ్రహ్మయొక్క యుత్పత్తిని వివేచనము చేయు దము. విష్ణునామధారియగు సూర్యుఁడు సముద్రనామము గల ఆకాశమందు శయనించియున్నాడు. అతని (నాభీ) నుండి కమలకుసుమనఁబడు యుష్ణము ప్రకటమగుచున్నది. దానిచే

♦ 'భానుర్హంసః సహస్రాంసు' అని అమరము.

నుద్భవించిన బ్రహ్మాఖ్యగలవాయువు నలుదిశల వ్యాపించుట చేత చతుర్ముఖుఁడై వాయుదేవునికి ప్రతినిధిగ నున్నవాఁడు.

వాణియొక్క యుత్పత్తి, వాయువువలన నగుచున్నది. పునః యా వాణిని వాయువే గ్రహణముచేయుచున్నది. అంత రిక వాయువుచే నుత్పన్నమైన వాణిని బాహ్యవాయువు గ్రహించుచున్నది. వాయువు బాహ్యాంతరములందు వ్యాపిం చుటచేత మహనీయమనఁబడుచున్నది. వాణియు నీమహనీయ మగు వాయువునుండి మోహినియై పుట్టి వాయువునందే లీన మగుచున్నది. యధార్థమెరుంగని పామరులు బ్రహ్మ తన పుత్రినే తాను గ్రహించెనని కథలను కల్పించి మందిరములు నిర్మించి విగ్రహములు స్థాపించి పూజింపసాగిరి. బ్రహ్మకు గాయత్రీ అథవా సావిత్రీ యను మరియొక భార్యగలదని పద్మపురాణమందొక కథకలదు. "సావిత్ర్యాస్తు పరంనాస్తి" (మ 2-83) యిత్యాది ప్రమాణములవలన గాయత్రి పేరే సావిత్రి యని సిద్ధమగుచున్నది.

" సవితుః సూర్యస్య ఇయంసావిత్రీ " సూర్యుని శక్తి సావిత్రి యనఁబడుచున్నది. సూర్యుని శక్తియగు నుష్ణమును గ్రహించి ( పొంది ) వాయువు శక్తియుక్తమై సృష్టిని చేయు చున్నది. వాయుస్థానీయమగు బ్రహ్మ పృథక్ దైవమని యెప్పుడు కల్పితమయ్యెనో — అప్పుడు సావిత్రియు స్త్రీయై వాయు గుణములన్నియు బ్రహ్మయందు ఘటితమయ్యెను.

భారతీ — ఇళా — సరస్వతీ వాచకములు మూడును వాణియొక్క పర్యాయనామములని తలంపఁబడుచున్నవి.

సాయణభాష్యమందు "శుచిదేవేష్వర్పితాహో త్రామత్సు భారతీ । ఇలాసరస్వతీ మహీబర్హిఃసీదంతు యజ్ఞియాః॥" అను మంత్రమందు:—దుస్థానవాణి భారతియనియు, పార్థివవాణి ఇలాయనియు, మేఘస్థమాధ్యమివాణి సరస్వతి యనియు గలదు.

విష్ణువునకు క్షీరసాగరము నివాసస్థానముగ నున్నట్లు బ్రహ్మకు నొక నివాసస్థానము లేదు. కారణమేమన; వాయువున కొక నియమితస్థానముండుట సంభవము కానేరదు. అది సర్వదా సకలస్థానములందును వ్యాపించి వీచుచుండును. విశ్రమము బొత్తిగ లేదు. బ్రహ్మకు పుష్కరాసనము గలదు. "పుష్కరాంభో రుహాణిచ" యని పుష్కరమునకు కమలమని యర్థము. నిఘంటువునందు:—అంబరమ్-వియత్ - వ్యోమ-బర్హిః-ధన్వ-అంతరిక్షం - ఆకాశం - ఆపః - పృథివీ-భూః - స్వయంభూ-అధ్వా- పుష్కరం- సాగరః- సముద్రః అధ్వరం- ఇతిషోడశాంతరిక్ష నామాని (1-3) యని, పుష్కరమనగా- ఆకాశమనియు నర్థము గలదు. వాయువంతరిక్షమునుండి సర్వత్ర తనసృష్టిని నడుపుచుండుటచేత వాయుస్థానీయుఁడగు కల్పితబ్రహ్మ పద్మాసనుఁడయ్యెను.

వాయువెప్పుడు విశ్రమించి శయనించునో అప్పుడే ప్రళయము సంభవించుననుటకు సందియములేదు. గనుక వాయువుయొక్క అహోరాత్రకాలము బహు దీర్ఘమైనది. వాయువు జాగ్రదవస్థయందుండువరకు సృష్టి జరుగును. శయనావస్థయందుండునపుడు ప్రళయమగును. వాయుస్థానమందు

బ్రహ్మ కల్పింపఁబడినాడని యీ యంశము వలన దృష్టమగు చున్నది.

బ్రహ్మ భూలోకమునందు పూజార్హుఁడు గాడని పురాణములందు చెప్పఁబడినది తన పుత్రిని మోహించినందున యపూజ్యుఁడయ్యెననియు, మహాదేవుని సముఖమం దసత్యముఁ బలికెననియు నిట్టి కారణములు గలవు. బ్రహ్మదేవుఁడు వాయు స్థానీయుఁడని ప్రాథమికులకు స్పష్టముగ తెలిసియుండెను. స్వయం ప్రాణస్వరూపుఁడగు వానికి ప్రాణప్రతిష్ఠము చేయుట కేవలమసంగతము. సర్వత్ర చరించుచు సమస్త జీవకోటికి జీవనాధారముగనుండు వాయువునకు ఆవాహన విసర్జనాది క్రియ లుచితములుగావు. సృష్టియంతయు నిండుకొని తాండవ మాడువానిని బంధించు టెట్లు? వానికి బంధనము విముక్తియు నుచితములు గానేరవు. ఇది తెలిసి సనాతనులు బ్రహ్మను స్థాపించి పూజించుచుండలేదు. ఆధునికులందులకు కారణము లుగ కొన్ని కథలను కల్పించిరి.

సూర్యకిరణములు వాయువునందు పడుటవలన నలు దిశల వ్యాపించి చతుర్ముఖుఁడగుటచే సూర్యుఁడు వాయువు నకు తండ్రియని వర్ణింపఁబడినది. సూర్యుఁడు తనశక్తి వాయు వునకిచ్చుటచేత వాయువు శక్తిమంతుఁడైనందున సూర్యుఁడు వాయువునకు మామయయ్యెను. సూర్యుఁడే తన యుష్ణము చేత వాయువును నడిపించును గనుక వాయునకు సూర్యుఁడే వాహనమాయెను.

విజ్ఞానులారా! సూర్య-వాయు పృథివ్యాదులన్నియు జడపదార్థములు. వీనిలో నొకటి మఱియొక దానికి పితగాని పిత్రుఁడుగాని మామగాగాని కాజాలదు. అంతయు రూప కాలంకారము. సూర్యుని పేరే విష్ణువు. ఈ విష్ణువు వాయు స్థానీయ బ్రహ్మకు తండ్రి యయ్యెను. సూర్యుఁడు హంస యనబడు చుండుటచే వాయుస్థానీయ బ్రహ్మకు వాహన మయ్యెను. సూర్యశక్తికి సావిత్రీ యనిపేరు. ఈ హేతువుచేత బ్రహ్మపత్ని సావిత్రి యయ్యెను. ఈ యలంకార రహస్యము నెఱుంగని యాధునికులు నానా పరివర్తనములచే నిటుపాటి కథల ననేకములు కల్పించిరి. ఈ నూతన గాథలన్నియు సత్యము- విస్మృతినొంది అర్థాత్ యదార్థమును మఱచిన బహుకాలమునకు రచింపఁ బడియున్నవి. ఇంక రుద్రునిగుఱించి విచారింతము.

---

# రుద్ర నిర్ణయము.

మహాశయులారా!

భగవంతుని లీలఁ జూడుడు! శీతల జలమందు మహా తీక్ష్ణమగు విద్యుత్ప్రకాశము నుంచియున్నాఁడు. ప్రాణప్రదమగు మేఘమెక్కడ? దానిలో ప్రాణాపాయకరమగు విద్యుత్పాత మెక్కడ? ఒకచోట వారివాహములు వర్షించి ప్రజల నానం దాబ్ధిలో ముంచుట. మఱియొకచోట వడగండ్లు పడి హాహా కారము కలిగించుట.

ఆహా! విచిత్రమగు నీశ్వర ఘటనాదులు మిగుల యద్భుతములు. మిక్కిలి శక్తిసంపన్నములు. వానిపనిఁ జూచి యానంద మొకప్పుడును భీతి యొకప్పుడును యొకటే సమయ మందు రెండును గలుగుచుండును. ధారాధరము గర్జించి నప్పుడు సర్వులును భయకంపితులగుదురు. భూమిసారవంతమై ఫలించినప్పుడు సుఖానందములు గలిగియుందురు. పరికించి చూచితిమేని హాని మిగుల యల్పము; లాభ మనంతము.

మేఘమందుగల విద్యుదగ్నివంటి తీక్ష్ణ పదార్థము లోక మునందు మరియొకటి లేదుగదా? అది యెటువంటి ఘోరని నాదము చేయునో సర్వజనానుభవమై యున్నది. అది యెంత వేగముగలది? దాని పరమశోభను చూచి యున్నారము. నల్లని మేఘమాలలు నలుదిక్కులు నిండుచున్నవి. అప్పుడు వానిపై విద్యుల్లత యొక క్షణము వ్యాపించి విలుప్తమై పోవు చున్నది. ఒకప్పుడు దానినుండి అశని (వజ్రము) గర్జించుచు భూమిపైఁబడి పదార్థములను భస్మము చేయుచున్నది. భూమి యందుగల యగ్నికింత తీక్ష్ణమును వేగమును లేదు. అశనికి క్షణిక ద్యుతియని పేరు. పృథివ్యగ్ని-పదార్థములను మిక్కిలి యాలస్యముగ కాల్చుచున్నది. మేఘాగ్ని- కనురెప్పపాటులో దగ్ధము చేయుచున్నది. క్షణమాత్రములో వేలకొలది క్రోశ ములు పరుగెత్తుచున్నది. భూమ్యగ్ని యొక పదార్థమునుండి వెడలునప్పుడంతటి శబ్దముచేయదు. మేఘాగ్ని వెడలు నప్పుడు భయంకరమగు గర్జనము చేయుచున్నది.

అటు గర్జించు వారెవ్వరు? వానికి వజ్రము-కులిశము-బిదురము- పవి-శతకోటి- స్వరు-శంబ-దంభోళి-హ్రాదినియను పేరులు గలవు. ఇందు వజ్రశబ్దము పుంలింగము కూడ నగును. అన్యాన్య జీవులను భీతిపరచి యేడ్పించుట చేత వజ్రికి రుద్రుఁడను పేరుపెట్టఁ బడినది. మేఘ మంతరిక్షమందుండునప్పుడు దాని స్వరూపము హిమాలయ పర్వత తుల్యముగ భాసించుటచేతను, వైదిక కోశమందు పర్వత నామములన్నియు మేఘ వాచకములగుచుండుటచేతను, మేఘమందుత్పన్నమగు విద్యుద్రూపమునకు పార్వతి యని పేరు వచ్చినది. వజ్రికి శక్తిగనుక రుద్రునికి సతియని వర్ణింపఁబడినది. వర్షించుటవలన మేఘము వృషభమయ్యెను. మేఘ వృషభము, వజ్రరుద్రునకు వాహనమయ్యెను. విద్యుత్ యొక్క ప్రకాశ ధారలు రుద్రుని జటాజూట మయ్యెను. గనుక రుద్రుఁడుధూర్జటి యనఁబడుచున్నాడు. విద్యుత్తు భూమిపైబడు రూపము బాణము. మేఘమందు ధనురాకారముగ ప్రకాశించునది ధనుషగును. దానిపేరు పినాకము. ఈవిద్యుద్రూపమగు అస్త్రముచేత సమస్తమును రుద్రుఁడు భస్మము చేయగలడు. గనుక యాతని చిహ్నము భస్మము. జలధారలు గలిగియున్నాడు గావున గంగాధరుఁ డనఁబడుచున్నాడు. మేఘ ఘటము — గజ చర్మముతో సమానముగ నుండుటచేత కృత్తివాసుఁడను పేరు వచ్చెను. మేఘము పైననే చంద్రుఁడు గలడు. గనుక చంద్రశేఖరుఁ డయ్యెను. నీటికి అహియను పేరుగలదని యిదివరకే చూపియున్నారము. నీరు నిండి యుండుటచేత శోభించును గనుక అహిభూషణుఁ

డనఁబడెను. వజ్రరూపము ఆకాశ పాతాళముల వరకు వ్యాపించుటచేత మహా దేవుఁడనఁబడెను. అథవా శతకోటి యన వచ్చును. ఈ అశని దేవుఁడు మేఘరూప వృషభముపై గూర్చుండి మేఘ ప్రవిద్యుత్తులను ప్రకాశించుచుండుటచేత ఈశ – ఈశాన – మహేశాది నామములతో పిలువఁబడు చున్నవాఁడు.

అతిభయంకరరూపధారణుఁడై పదార్థములను భస్మము చేయుటవలన సంహారకర్తయనఁబడు చున్నాడు. ఇతని కృత్య మధికముగ పశుపోషణమునకు హేతువుగా నున్నందున పశుపతి యయ్యెను. మేఘ మొకప్పుడు నల్లని రూపు దాల్చును, మరియొకప్పుడు ధవళ వర్ణమగును. వేరొక సమయమందు శ్యామవర్ణ మగుచుండును. ఈ హేతువుచేత నీలగ్రీవ – శితికంఠ యిత్యాది పేరులును గలిగినవి. ఆఖ్యాయికలందు రుద్ర శబ్దమే విశేషముగ వాడఁబడియున్నది.

"జరాబోధ తద్వివిడ్ఢి విశేవిశే యజ్ఞియాయ స్తోమం రుద్రాయ దృశీకమ్" (ని- దై - 4-8).

ఇందుకు యాస్కాచార్యులు భాష్యము వ్రాయుచు రుద్రశబ్దమును అగ్నికి విశేషణముగ వాడియున్నారు. సాయణాచార్యులు 'రుద్రాయ క్రూరాయఅగ్నయే' అని క్రూరమైన యగ్నికి రుద్రశబ్దము ప్రయోగించియున్నారు. ఋగ్వేదమందు "అగ్నిసుమ్నాయ దధిరే" యను మంత్రమందు అగ్నికి విశేషణముగ రుద్రశబ్దము వచ్చియున్నది. యజుర్వేదము పదునారవ యధ్యాయము 55-56-57-58 వ మంత్రములకు ప్రాథ

మికులగు కొందరు యాస్క-సాయణాదులు ద్యులోకాగ్ని వాచకముగా రుద్రుశబ్దముగ వాడుకొని భాష్యములు వ్రాసి యున్నారు. ఈ యలంకారముల కటువంటి భాష్యము లాధారములని విస్పష్టమగుచున్నది. ఆ కాలమునందే విద్యుద్దేవస్థానమందు రుద్రదేవుఁడు కల్పింపఁబడి యున్నాడని సిద్ధమగుచున్నది.

నిరుక్తము దైవత కాండమందు రుద్రశబ్దము యొక్క వ్యుత్పత్తి యిట్లు చెప్పఁబడియున్నది.

"రుద్రోరౌతీతిసతోరోరూయమాణో ద్రవతీతివారోదయతేర్వా । యదరుదత్ తద్రుద్రస్యరుద్రత్వామితి కాఠకం॥ యదరోదీత్ తద్రుద్రస్యరుద్రత్వమితి హారిద్రవికం" (4 5) మరియు "అరోదీదంతరిక్షేయ ద్విద్యుద్వృష్టిం దదన్నృణాం । చతుర్భిఋృషిభిస్తేన రుద్రఇత్యభిసంస్తుతః" యని బృహద్దేవతాద్యనేక ప్రమాణములవలన విద్యుత్తునకు రుద్రనామము గలదని సిద్ధమగుచున్నది.

వృషభశబ్దమునకు మేఘము- ఎద్దు అని రెండర్థములుండుటవలన నెద్దుమీఁద గూర్చుండునని కల్పింపఁబడినది. యాస్కాచార్యులు "ప్రనూమహిత్వం వృషభస్యవోచం" అను మంత్రమునకు వ్యాఖ్యానము వ్రాయుచు "వృషభస్యవర్షితురపాం" అని వృషభశబ్దమునకు మేఘమని విస్పష్టముగ చూపించియున్నవారు.

రుద్రుని జడయందు గంగయున్నదని పురాణ ప్రసిద్ధము. మేఘస్థ వజ్రాత్మక యగ్నికి రుద్రుఁడని యుపర్యుక్త

ప్రమాణములవలన సిద్ధమైనది. రుద్రనామ ధారుడగు విద్యు ద్దేవుడు జలముచే పూర్ణుడై యుండును. మేఘ జలాభ్యంతర మందే విద్యుద్దేవుడు అథవా రుద్రుడు నివసించియున్నాడు. అతనిపై జలధారలు పడుచుండును. ఆ మేఘధారలే గంగ యనఁ బడుచున్నది. ఎచట మేఘస్థ విద్యుద్దేవుడుండునో అచ్చట తప్పక గంగయుండును. గనుక మహాదేవుడుండు చోట గంగాదేవియు నుండును. అతనికిష్టమైనప్పుడు జడలను విప్పును. విప్పగానే గంగ భూమిపైపడి ప్రవహించును. జడ లను బంధించినచో గంగాదేవియు నిలిచిపోవును.

సగర చక్రవర్తికథను మీరు విన్నారు కదా? ఇది వరకే ఆకాశమునకు సగరమని యర్థమును వివరింపఁబడి యున్నది. ఆకాశ సంతతి మేఘములగును. అవియే సగరుని పుత్రులు. అగ్నికి కపిలమనిపేరు. అగ్నియవతారమగు కపి లుడు తన ఆగ్నేయ శక్తిని వర్షాంతమందు విస్తరింపఁ జేయఁగ మేఘములు కృశించి పోవుచున్నవి. ఆకాశము వ్యాకులము నొందుచున్నది. గ్రీష్మఋతువు వ్యతీతముకాగా వర్షారంభ మగుచున్నది. అదియే- భగీరథుని జన్మము- భగశబ్దమునకు సూర్యుడని యర్థము. రథమనఁగా రమణీయము అథవా అందమగు పదార్థము. పృథ్వికొరకు సూర్యుని రమణీయ విశేషము వర్షమైయున్నది. విష్ణువన సూర్యుడు. అతని చర ణమన కిరణము. కిరణముయొక్క ఉష్ణముచేత జలము బాష్పమై యంతరిక్షమందుచేరి జలధార లేర్పడుచున్నవి. అర్థాత్ రుద్రదేవుని జటాజూటమందు మేఘాకారముగ ప్రస్తు

తమై ప్రాణికోటికి సుఖమునిచ్చుచుండును. తుదకు సముద్రము చేరి దానిలో లీనమగుచుండును. ఇది సగర సంతానము యొక్క చితిని శుద్ధముచేయు కథగా వర్ణింపఁబడియున్నది. లోకములోని మానవునకు అరువదివేలు పుత్రులు గలుగుట సంభవమేనా? ఈవర్ణనము ఋతువులను బట్టి యాకాశమందు గలుగు పరివర్తనమును బోధించుచున్నది.

రుద్రుఁడు భస్మవిభూషితుఁ డెట్లు? మేఘాగ్నియొక్క ప్రతినిధి స్వరూపుఁడగు మహాదేవుఁడు సదా భస్మవిభూషితాంగుఁడగుట యెట్లన:—ఆగ్నేయ శక్తియొక్క కార్యము ప్రతివస్తువును దగ్ధముచేసి భస్మమగునట్లు చేయుటయై యున్నది. అగ్నికి ప్రతినిధిగ విరచితమైన మహాదేవుని చిహ్నము భస్మము గుట కేమి యాశ్చర్యము? ఈ కారణముచేతనే శంకరుఁడు భస్మధారకుఁడైనాఁడు. ఈ కల్పిత మహాదేవుఁడు మూర్తిగ స్థాపింపఁబడి శైవమత మొకటి బైలుదేరినది గనుక శైవసాంప్రదాయకులు భస్మమును ధరించుటకు ప్రారంభించి దానిని గురించి మహిమాగాథల నెన్నియో రచించిరి. ఆహా! లోకమెంతటి యజ్ఞానాంధకారమున మునిగిపోయినదో చూడుడు!

విష-అహి-శవ-భూత-ఇంద్ర-శంబరాది నామములు (101) నూటయొకటి జలమునకు నిఘంటు 1-12 లో గలవు. ఇందులో విషశబ్దము గరళాది యర్థములును అహి శబ్దమునకు సర్పము మొదలగు అర్థములును శవ శబ్దమునకు మృతకళేబరమనియు, ఇందు శబ్దమునకు చంద్రుఁడనియు శంబరుఁడన మై

త్యుఁడనియు నర్థములున్నందున మహాదేవునికియుపాసంలన్నియు సంబంధము చేయఁబడి యున్నవి.

మేఘము వ్యాఘ్ర చర్మమువలెను యేనుగు చర్మము వలె నుండుటచేత వ్యాఘ్రచర్మధారుఁడును గజ చర్మధరుఁడు నయ్యెను.

విష్ణువునకు బాహు విశేషమును బ్రహ్మకు ముఖవిశేష మునువలె మహాదేవునకు నేత్రవిశేషముఁ గలదు. ఇతనికి మూడు కన్నులు గలవనుట విశేషముగానున్నది. పృథివ్యగ్ని - మేఘాగ్ని సూర్యాగ్ని యను మూడునేత్రములు అగ్ని స్థానీయరుద్రునికిఁ గలిగియున్నవి. ఇందుకు ప్రమాణము యజుర్వేదమందు-

"నమోస్తు రుద్రేభ్యోయేదివి యేషాంవర్ష భిషవః।
నమోస్తురుద్రేభ్యోయేఽన్తరిక్షేయేషాంవాతఇషవః।
నమోస్తురుద్రేభ్యోయేపృథివ్యాంయేషామన్నమిషవః।

అని ద్యులోకాంతరిక్ష పృథివీస్థానముల మూఁడుచోట్లను రుద్ర అర్థాత్ ఆగ్నేయ శక్తియొక్క వ్యాపకత్వము చెప్పఁబడియున్నది. ఈతత్వార్థమే యజ్ఞస్థలమందు ఆహవనీయాగ్ని గార్హపత్యాగ్ని-దక్షిణాగ్ని యని మూడగ్నులు స్థాపింపఁబడు చున్నవి. ఇందువలన త్రినయనమనుటకు నగ్నియని యర్థమగు చున్నది. "త్రిషుస్థానేషు నయనం ప్రణయనం స్థాపనం యస్య సః త్రినయనః" యని సమాసము. త్రీన్ లోకాన్ నయతి నిర్వాహయతి । యద్వాత్రయాణాం లోకానాం నయనం జ్యోతిః ప్రదానేన నయనభూతం" అనియు గలదు. ఇంతియు గాక బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థాశ్రమముల మూఁటియం

దాను అగ్నిహోత్రము గలదు. సన్యాసమందు అగ్ని కార్యము త్యజింపబడుచుండుటచేత "త్రిషు ఆశ్రమేషు నీయతే ప్రాప్యతే సత్రిస్వయమః" గనుక నగ్ని త్రినయన మగుచున్నది. అగ్ని పక్షమందు నేత్రపాపనార్థమును తత్స్థానీయకల్పిత మహాదేవపక్షమందు దృష్టిఅర్థమును చేయబడినది.

మహాదేవ సంబంధమునందు త్రిపుండ్రము-త్రిదల బిల్వపత్రము- త్రిశూలము ఇత్యాది విషమసంఖ్యా ప్రయోగము గలదు. ఇందుకు కారణము మహాదేవుండు నగ్నత్వము-అర్థాత్ దిగంబరత్వము- శ్మశానవాసిత్వము- విషభక్షణత్వము- భూతప్రేత సహాయకత్వము మున్నగు హీనమగు విషమదశయైయున్నది.

రుద్రుండు పంచవక్త్రుండనుటకు అగ్నియే కారణము. చాందోగ్య ఉపనిషత్తు (5 ప్రపాఠక) నందు 1 ద్యులోక 2 పర్జన్య 3 పృథివీ 4 పురుష 5 స్త్రీ యని పంచాగ్నులను గురించి చెప్పంబడియున్నది.

అగ్ని రూపుండు నుపద్రవకారియు నగుటచే మహాదేవుని పూజయందు శిరోభాగమునందు సదా నీటిధార పడుచుండునట్లు శాంత్యర్థమై జలఘటమును కట్టుదురు. ఆహా! చూడుడు! క్రమక్రమముగా కథ యెంతవఱకు వృద్ధియైనది.? యదార్థ మెంతదూరము పోయినది?

లోకమందు కొన్నిచోట్ల యేకాదశ రుద్రపూజచేయుట గలదు. పది చిన్నవియగు పార్థివ లింగములుచేసి 5 వంతున రెండు వరుసలుగనుంచి వాని ముందొక గొప్ప లింగమునుంచి

పూజించెదరు. చిన్నవి పదియు ప్రాణములు. పెద్దది జీవాత్మ సూచకము. వీనికి రుద్రశబ్ద మెందుకు వచ్చినదో - యీక్రింది బృహదారణ్యకోపనిషద్వాక్యమువలన విస్పష్టమగుచున్నది.

"కతమే రుద్రాయితి దశేమే పురుషే ప్రాణాః ఆత్మై కాదశః తే యదాస్మాత్ శరీరాన్మర్త్యాదుత్క్రామంతి । అథ రోదయంతి తద్యద్ రోదయంతి తస్మాత్ రుద్రా ఇతి"

[3—9—4].

ఆత్మ ప్రాణములకు ప్రతినిధి గనుక రుద్రనామముచే పిలువఁబడుచు రుద్రస్థానీయ మహాదేవుని సహితముగ ప్రాణ పూజ యేర్పడి యున్నది.

రుద్రునకు పార్వతీ — కాళీ — అంబికా — దుర్గా — భవానీ - రుద్రాణి - మృడానీ - గౌరీ యాది పత్నులు గల రని చెప్పఁబడు చున్నది. ఇదివరకే పర్వతాద్రి గిరిగ్రావాది నామములు వైదికభాషయందు మేఘ నామములని నిరూపించి యున్నారము. "పర్వతే మేఘేభవః పార్వతి । పర్వతస్య మేఘస్యాపత్యం స్త్రీ పార్వతీ విద్యుద్వా । ఏవంగిరిజాదయః" అని సమాసము.

మేఘముయొక్క కన్య యెవరు? విద్యుత్ గనుక విద్యుత్తునకు పార్వతియని పేరు. గిరి అర్థాత్ మేఘమందుత్పత్తి యగు దానికి గిరిజ యని పేరు. ఇది వజ్రదేవునకు శక్తిగా నున్నది. గావున వజ్రస్థానీయ మహాదేవునకు పార్వతి పత్ని యని వ్యవహరింపఁబడి యున్నది. ఎట్లు మేఘమునుండి జల ధారలు పడుచున్నవో అట్లు హిమాలయమునుండి గంగా

యమునాది ధారలు వెడలుచున్నవి. మరియు హిమరూపమగు జలము సదా దానిపై యుండుటచేత భూమిస్థ యుమాలను కన్య పార్వతీదేవి యనఁబడు చున్నది.

"కాలీ కరాలీచ మనోజవాచసులోహితాయాచ సుధూమ్రవర్ణా। స్ఫులింగినీ విశ్వరూపీచ దేవ లేలాయమానా ఇతి సప్తజిహ్వా" అని ముండకోపనిషత్తునందు కాలీ–కరాలీ–మనోజవా - సులోహితా - సుధూమ్రవర్ణా స్ఫులింగినీ-విశ్వరూపీ యను నామములుగల యేడు జిహ్వలు అర్థాత్ నాలుకలు అగ్నికి గలవని చెప్పఁబడి యున్నది. ఇవి కల్పితములు స్త్రీలై అగ్నిస్థానియ మహాదేవునకు సతులుగా వర్ణింపఁ బడి యున్న యలంకారమై యున్నది. ఈకారణము చేతనే కాళీ మొదలగు విగ్రహములకు నాలుకలు గొప్పగానుండునట్లు నిర్మింపఁ బడుచున్నవి.

"గౌర్మిమాయ సలిలాని" యను ఋగ్వేద మంత్రమునకు భాష్యము వ్రాయుచు యాస్కాచార్యులు "గౌరీరోచతేర్జ్వలతి కర్మణః। మాధ్యమికావాక్ గౌరీ" మేఘమందు మహాగర్జనమగుచున్నదే దాని పేరు గౌరీ అథవా వాణీ మాత్రమునకు గౌరీ యని విశదపరచియున్నారు. ఇదే మంత్రమునకు సాయణాచార్యులు "గౌరీః గరణశీలా మాధ్యమికావాక్" అని వ్రాసియున్నారు. నిఘంటువునందును వాణీ నామము గౌరియని యున్నది. గౌరీ నామధారిణియగు మేఘవాణి అగ్నియొక్క శక్తిగానున్నది. గౌరవర్ణముగల స్త్రీకి గౌరీయనిపేరు. విద్యుత్ గౌరవర్ణముగ గోచరమగుచున్నది.

గనుక పార్వతియొక్క విశేషణమందు గౌరీ పదము వచ్చు చున్నది.

సువర్ణరజతాది సమగ్రధాతువులు ఆగ్నేయశక్తివలననే యగుచున్నవి. గనుక పురాణములందు మహాదేవునివలన నుత్పత్తియైనవని చెప్పఁబడియున్నది. ప్రాచీన కాలమునుండి నేటివరకును తీక్ష్ణమగు విద్యుత్ పతనమునుండి రక్షించుకొనుటకు లోహముతో చేయబడిన త్రిశూలములు తమ గృహాదులపై నునిచియుండుట సర్వజనవిదితము. ఈ కారణముచే మహాదేవుఁడు త్రిశూలధారి యయ్యెను.

ఈ ప్రకారముగ సూర్యవాయ్వగ్ని మూఁడును విష్ణు బ్రహ్మ రుద్రులైరి. వీరి యాధారమున త్రిమతములు కలిగెను. తత్సంబంధమగు పురాణములు సృష్టింపఁబడెను. గణనాతీతములగు కథలు గాథలు గీతములు రచింపఁబడెను. భారత దేశమంతయు నీ మిథ్యాప్రభావము వ్యాపించి భారతీయులను ముంచివేసినది. లోకమందలి పదార్థములన్నియు మూఁడు స్థానములందున్నవి. పృథివీ - అంతరిక్ష - ద్యులోకములు మూఁడును స్థానములైయున్నవి. మనముండునది పృథివీ స్థానము. ఎంతవరకు స్థూలవాయువు వ్యాపించియున్నదో అట్టిచోటు యంతరిక్షము. సూర్యచంద్ర నక్షత్రాదు లుండుచోటు ద్యులోకము. ఈ త్రిస్థానములందు గల ప్రత్యేక పదార్థమునకును దేవశబ్దము వేదమునందు గలదు. పదార్థ శబ్దమునకు దేవ శబ్దము పర్యాయపదమని యనేకులకు తెలియదు. మనము మేషబుద్ధులై- ఆలసులై- గవేషణాశక్తిరహితులై-గతానుగతి

కులై అపరిశ్రములై - భోగవిలాసులై - వేదవిద్యాశూన్యులై వైదికజన సంగవిరహితులై - అబ్రహ్మచారులై కాలమును జీవితమును వ్యర్థపరచుచున్నారము.

లౌకిక విద్యలయందెంతయో నిపుణత్వమును సంపాదించెదరు గాని వైదిక విద్యయందు నితాంతముగ ప్రవేశింపరు.

ప్రాథమిక వేదసమయమందు బ్రహ్మ- విష్ణు-రుద్ర-పార్వతీ- లక్ష్మి- సరస్వతీ-భైరవ-గరుడ-హంస- దుర్గా-కాళీ-యాదిదేవతల చర్చయుండలేదు. షోడశోపచారపూజ-మహారుద్రాది వర్ణనలు లేవు. నవగ్రహపూజ- అశ్వత్థ ప్రదక్షిణ-సర్పార్చన- మూర్తిపూజ-గంగాయమునా ప్రయాగాది తీర్థ మహిమలు లేవు- వేదమందిటువంటియనుజ్ఞలు లేవు. మత్స్య కచ్ఛపాది యవతారముల వర్ణనలు లేవు. వేయిమాటలేల మనదేశమందిప్పుడు ప్రచలితమైయుండు ధార్మిక సామాజిక వ్యవహారములలో నూటికి తొంబది -చొప్పున వేదవిరుద్ధమగు నాచారములున్నవనుట కేమియు సందియములేదు.

వేదమందేపదార్థము వర్ణింపఁబడుచున్నదో ఆపదార్థము దేవనామముచే పిలువఁబడియున్నది. ప్రతిపాద్య వస్తువు దేవత యనఁబడుచున్నది. శరీరికాని అశరీరికాని చేతనముగాని యచేతనముగాని నిరూపణీయమగు ప్రతివస్తువునకు దేవ శబ్దము వాడఁబడియున్నది.

మఱియొక విధముగలదదేమన: సూర్య-అగ్ని-పృథివి-జలము-వాయువు మున్నగువాని కనేక నామము లున్నవి. సూర్యునకు సవితా- అర్యమా- పూషా - ఇంద్ర - విష్ణు

మొదలగు పేరులు గలవు. సూర్యశబ్దముతో నొక సూక్త మందు సూర్యుని వర్ణించునప్పుడు సూర్యదేవతయనియు సవితా శబ్దముచే వర్ణించునప్పుడు సవితాదేవత యనియు, ఇంద్రశబ్దముతో వర్ణించునప్పుడు ఇంద్రదేవత యనియు, విష్ణుశబ్దమున వర్ణించునప్పుడు విష్ణుదేవత యనియు నీప్రకారముగ నొకవస్తువున కనేక నామములను బట్టి యనేక దేవత వర్ణనలు గలవు. ప్రతిపేరును భిన్నభిన్న గుణప్రదర్శకమై యుండును. ఉదాహరణముగ నొక కాలమునకు ఉషా-రాత్రి-దినము-సంధ్య-ప్రాతః యిత్యాది నామములున్నను ఉషా - రాత్రులకు గుణభేదములు గలవు. ఈ విధముగనే ప్రాతఃకాల సూర్యునకును మధ్యాహ్నపు సూర్యునకును భేదముండును మధ్యాహ్న సూర్యునకును సాయంకాలీన సూర్యునకును భేదముండును. గనుక వాయువు - మరుత్ నామము లొక యర్థము గలిగినను గుణభేదము తప్పక యుండును. వైదిక శబ్దార్థగత భేదము నెరుంగనివారు నానా విధములగు సందేహముల కాస్పదులగుదురు. అట్టి వారల వలననే వేదము యితిహాసమని చెప్పఁబడియున్నది అట్టివారే వేదమందు మానవుల చరిత్రలు గలవని యూహించిరి. అట్టి యనభిజ్ఞులే ముప్పది మూడు కోట్ల దేవతలను కల్పించిరి. అటువంటి యజ్ఞానులే శునః శేపాది కథలను కల్పించి వేదమందు నరమేధము అర్థాత్ నరబలి విధానము గలదని నిరూపింప సాగిరి. ఈ విషయములను విపులముగను విస్పష్టముగ నెఱుంగ గోరువారు వైదిక ఇతిహాసార్థ నిర్ణయమను గ్రంథమును పఠించవలయును.

వేద తత్త్వమెఱుంగని దోషమువలన మానవులు అవైదిక పద్ధతులను కల్పించుకొని అపూజ్యములగు జడపదార్థములను భగవంతునిమూర్తియని నమ్మి పూజింప నారంభించిరి. మహాత్ములగు శ్రీమద్దయానందసరస్వతీ స్వాములవారి గ్రంథముల నవలోకించిన తరువాత విద్వాంసులనేకులు ప్రాచీన ఆర్ష గ్రంథములను పఠించి తమకు గలిగియున్న భ్రమలను నివర్తి చేసికొనిరి. వారును సత్యమును వ్యాపింపజేయుటకై తను మన ధనములను ధారపోయుచున్నారు. వారికి మనమును సర్వదా ధన్యవాదము లర్పించుచు మనచేతనైనంత వరకు మనతోడి మానవులకు యదార్థమును విన్నవించుదము. మన తనుమనధనములను సాధ్యమయినంతవరకు దేశ సేవకై వినియోగించి భగవత్ప్రీతి పాత్రులగుదుముగాత! మన ప్రయత్నమునకు పరమేశ్వరుడు సహాయ మొనర్చుగాత.

ఓం శాంతిః శాంతిః శాంతిః



ఓమ్.

# జాతి విచారము.

## [ ప్రత్యక్ష ప్రమాణము ]

లోకములో ప్రత్యక్ష ప్రమాణమునకు మించినదేదియు లేదు. అందులో దృష్టికిని, యింద్రియములకును మనో బుధ్ధ్యాగులకు నేకరీతిగనుండు ప్రత్యక్ష విషయమందు వివాదమే యుండదు. గనుక నీ జాతి విషయమునందు మొదట ప్రత్యక్ష ప్రమాణమును చూపుట మిక్కిలి సమంజసము. మనము మనచుట్టునుండు వివిధ పదార్థములను జూచుచున్నారము. జలమందు మత్స్య, మకర, మండూకాదులును, స్థలమందు తృణ, లతా, గుల్మ, వృక్షాది స్థావరములును, పిపీలికాది కీటకములును, వ్యాఘ్రాది వన్యమృగములును, వృషభాది గ్రామీణములును, పృథివ్యాకాశముల రెంటియందును సంచరించెడు శుకపికాది పక్షులును గలిగి, భూమండలము శోభించుచున్నది. ఈ యన్నిటియొక్క రంగు, రూపు, యాకృతి స్వభావాదులు పరస్పరము బహు భిన్నములై యున్నవి. ఈ సమస్తమును మన ప్రాథమిక ఋషులు ప్రథమ యుత్పత్తిని యనుసరించి, ఉద్భిజ-అండజ-పిండజ-ఊష్మజములని నాలుగు భాగములుగ విభజించి యున్నారు.

## ( సామాన్య జాతి. )

ఇప్పుడు మనమొక స్థానమందన్ని పశువుల నొక్కచోటఁజేర్చి చూతము. అప్పుడు వ్యాఘ్ర, శృగాల, గోవు,

గోడ్రె, బఱ్ఱె, యేనుఁగు, లొట్టిపిట్ట మున్నగు వాని నన్నింటెనిఁ జూచుచున్నారము. మొదట మనకొక సమానత్వము వాని యందు ప్రతీతమగుచున్నది. అన్నింటికి నాల్గు కాళ్ళుండుటఁ జూచి యివి "చతుష్పదము"లనుచున్నారము. చతుష్పదత్వ మన్నిటియందును సమానము. మఱల రెండవసారి చూచి నచో పరస్పర భేదము ప్రతీతమగుచున్నది. యేనుఁగువలె లొట్టిపిట్టలేదు. ఒంటియవలె గుఱ్ఱములేదు. గుఱ్ఱమునకు సమానముగ గోవుండదు. ఈ ప్రకారముగ నన్నింటియందును భేదము స్పష్టమగుచున్నది. పునఃమూడవసారి చూచినచో గోవులందే - యొకటి మఱియొక దాని కంటె భిన్న భిన్నమై యుండుట తెలియుచున్నది. ఈ రీతిగ పక్షి, వృక్షజలచరాదు లన్నింటియందును సమానత్వ భిన్నత్వములు రెండును ప్రతీత మగుచుండును. అప్పుడు మనకు నన్నియు చతుష్పాత్తులనియును వాని యాకృతి స్వభావములం దొక్కొక్క సమూహము పరస్పరము విభిన్నమనియును స్పష్టమగు చున్నది. ఏవి యొక్కటే యాకృతి గలవియో వాని నన్నింటిని సమానమని చెప్పెదము. ఎట్లన - నెన్ని యేనుగులున్న నవి యన్నియు సమానస్వరూపములు గలిగి యున్నవి. ఎన్ని గోవులు గలవో యన్నియు సమానాకృతి గలిగి యున్నవి. గుఱ్ఱముల సమూహము గోడ్రెల సమూహముకంటె భిన్నమని ప్రత్యక్ష మగుచున్నది. దీనిని జూచి యొక బాలుఁడు సయితము యేనుగు కంటె నెనుము భిన్నమని చెప్పుచున్నాడు.

ఈ ప్రత్యక్ష ప్రమాణమువలన నొక్కొక్క సముదాయ మందు సమానత్వమునకుఁ జూపెడు స్వరూపగతధర్మము అథవా గుణమునకు జాతియని పేరు వచ్చినదని స్పష్టమైనది. ఏనుఁగు గుంపును జూచి యొక బాలుఁడు మనలను "ఇవి యెందుకిట్లు సమానముగ నున్నవి?" యని యడిగిన మనము వానికి ప్రత్యుత్తరముగ నివి యన్నియు నేక జాతియని బదులు చెప్పుదుము. దీనినే సామాన్యజాతియని చెప్పెదము.

మనము కడసారి మిక్కిలి ధ్యానముతో జూతుమేని యొక గోవు రెండవ గోవుకంటె భిన్నమని ప్రతీతమగుచున్నది. గొఱ్ఱెల కాపరి తన ప్రతి గొఱ్ఱెను గుర్తింపఁ గలిగియుండును. ఎందుకనఁగా ప్రతిదానియందును, యత్కించిత్ యవయవ భేదమున్నది. దీనికి వ్యక్తిగత భేదమనిపేరు. వేరు వేరు విలక్షణము జాతిభేదమునున్న యేకసమూహములోని వ్యక్తి గత విలక్షణము వ్యక్తిభేదమునున్ను తెల్పుచున్నవి.

మామిడి చెట్టును, నేరేడు చెట్టును జూచినతోడనే భిన్నభిన్నములగు రెండు జాతులు బోధపడుచున్నవి. ఒక బాలునకు యేనుగును మామిడి వృక్షమును జూపి యిది యేనుఁగని అది మామిడి చెట్టని చెప్పిన తరువాత వాఁడెక్కడ నెన్ని యేనుఁగులను జూచినను తక్షణమున నివి యన్నియు నేనుంగులని చెప్పగలడు. అలాగుననె యెన్ని మామిడిచెట్లను జూచినను ఛట్టన నివి మామిడి వృక్షములని చెప్పగలడు. అనగా నొకదానిని జూచినపిమ్మట నాసముదాయము బోధపడు చున్నది. ఈప్రత్యక్ష ప్రమాణము చేతనే గోజాతి, అశ్వజాతి,

గజజాతి, నేరేడుజాతి, నింబజాతి యని వేరు వేరు జాతులేర్పడి యున్నవి.

పశుపక్షి వృక్షాదులలో నెట్లు యనేక జాతులు ప్రత్యక్షముగ ప్రతీతి యగుచున్నవో అట్లు మనుష్యులలో ననేకజాతులు లేవనుట సర్వజనవేద్యము. ఒకానొక దేశమందు గల బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రుల నొక్కటిగఁ జేర్చి వారవలంబించిన కృత్రిమ వేషములను తీయించి వేసి నిలువఁ బెట్టుదము. అప్పుడేమి ప్రతీత మగుచున్నది. అందరి యందొక సమానత్వమే ప్రతీతమగుచున్నది? గాని యితఁడు బ్రాహ్మణుఁ డని, యితఁడు క్షత్రియుఁడని, యితఁడు వైశ్యుఁడని, యితఁడు శూద్రుఁడని ప్రతీతి కానేరదు. ఎందుకట్లు చూచినమాత్రమున ప్రతీతి కానేరదన నాకృతి యందరికి సమానముగ నున్నది. ఈ హేతువునుబట్టి మనుష్యు లేకజాతియని విదితమగుచున్నది. పశ్వాదులవలె భిన్నభిన్నజాతు లిందు లేవు.

మన సమ్ముఖమున నొక కృత్రిమ వేషరహితుఁడగు బ్రాహ్మణునిఁ దెచ్చి 'ఇతఁడు బ్రాహ్మణుఁడు' అని పదులు చెప్పిన తరువాత రెండవ బ్రాహ్మణుని మనమెచ్చటఁ జూచి నను విచారించకనే యాతనిని బ్రాహ్మణుఁడని చెప్పగలమా? ఎప్పటికిని చెప్పజాలము. పశ్వాదులలో నొక యేనుఁగును జూచిన తరువాత రెండవ యేనుఁగును చూచినప్పుడది యేమి జాతువని మన మడుగ నక్కర లేకుండ జూచిన యుత్తర క్షణముననే యేనుగని తెలిసికొనుచున్నారము. మనుష్యులలో నట్లు తెలిసికొనజాలము. ఈ ప్రత్యక్ష ప్రమాణముచేత

మనుష్యులలో భిన్న భిన్న జాతులులేవు. బ్రాహ్మణాది వర్ణ ములు జాతి సూచకములు కానేరవు. ఎందుకన మనము పలు మారొకచోట నలుగురు చేరినప్పుడు మీదేవర్ణమని ప్రతి వారిని యడిగి తెలిసికొనుచున్నారము. ఏనుఁగు, గుఱ్ఱము, గోవు, సింహాదులందెట్లు పరస్పరము జాతి గత భేదముగలదో అట్లు బ్రాహ్మణాది వర్ణములందు నితాంతముగ లేదు. గనుక మనుష్యజాతి యొక్కటె యని నిస్సందేహముగ సిద్ధాంత మైనది.

భిన్న జాతులలో పరస్పరము మార్పులు లేవు. ఎట్లన వేల కొలఁది విద్వాంసులుచేరి లక్షల కొలఁది యుపాయములు చేసినను యేనుఁగును గుఱ్ఱముగ మార్చలేరు. మనుష్యులలో బ్రాహ్మణుఁడు మ్లేచ్ఛుఁడగును. మాలవాఁడగును. ఈ విషయ మును యితిహాసము (చరిత్ర) ఘంటాఘోషముగ చాటు చున్నది. నాల్గవ వర్ణమువారు మొదటి వర్ణమువారగు చున్నారు ప్రమాణము లావిషయమునందుజూపుచున్నారము.

ఏనుఁగు జాతికిని గుఱ్ఱపు జాతికిని పరస్పరము ప్రేమ గలిగి సంతానము జనింపదు. బ్రాహ్మణ శూద్ర స్త్రీ పురు షులకు ప్రేమగలిగి సంతానము గలుగుచున్నది. కొందరశ్వ జాతికిని, గార్ధభ జాతికిని సంతానము గలిగి ఖచ్చరజాతి యుత్పత్తి యగుచుండలేదాయని చెప్పవత్తురేమో? కోతులు మనుష్యులైరనునది యనుభవమునకెంత యసంగతమో అట్లు గాక నిజమైనప్పుడు రెండు జాతులకుఁ గలిగినసంతతి మూడవ విధముగ నేర్పడినట్లు బ్రాహ్మణ క్షత్రియులకుఁ గలిగిన సం

తతి మూడవ విధముగ నేర్పడినది. గనుక నీ యుదాహరణము యుక్తమైనది కాదు. మరియు నీయంశము వలన మనుష్యులలో జాతి యేర్పడజాలదు.

ఈశ్వరుఁడు ప్రాయః సర్వదేశములందును అశ్వ, గజ, గోజాత్యాది ప్రాణులను సృష్టించి యున్నవాఁడు. నా రీతిగనే మానవ జాతియు సర్వత్ర సృష్టింపఁబడి యున్నది. పరంతు అశ్వగజాది జాతి భేదములు విద్యమానమై యున్నట్టుగ ఖండాంతరములందు మనుష్యులలో (మన దేశమందున్నట్లు) జాతి భేదము లేదు; గనుక నిది మానవ నిర్మితము. వృత్తిని బట్టియు గుణకర్మ స్వభావములను బట్టియు వచ్చునది వర్ణము. వర్ణము జాతికాదు.

బ్రాహ్మణాది నాలుగు వర్ణములయొక్క లక్షణములగు శమదమ శౌర్య ధైర్య కృషి గో రక్షణ పరి చర్యాది గుణములు ఆయా జాతులయందు నిర్భరములు గావు; ఇవి ఖండాంతర ద్వీపాంతర దేశాంతరములందుగల మానవులలో సంచారితములగు గుణములై యుండుట ప్రపంచమం దందరికి ననుభవమైయున్నది. గనుక వర్ణము జాతికాదు: మరియు మనుష్యులందు జాతిభేదములేదు.

వర్ణము జాతికాదనుట కన్యకారణము మరియొకటి కలదేమనః—కొన్ని చోట్ల బ్రాహ్మణాది వర్ణములకు గౌర, రక్త, పీత, కృష్ణ వర్ణములు (రంగులు) చెప్పఁబడి యున్నవి. ఈ వ్యవస్థ గుణసూచకముగాకున్నచో ప్రత్యక్ష విరుద్ధమగుచున్నది. ఏలనన బ్రాహ్మణులనేకులు కృష్ణవర్ణము గలిగియు

శూద్రిలనేకులు గౌరవర్ణము గలిగియున్నారు. నిజమునకు నిది గుణసూచకమై యున్నది. శుద్ధగుణమును శ్వేతమని, రౌద్రగుణమును రక్తమని యిత్యాదిగ వర్ణింపఁబడినది; గనుక వర్ణము జాతికానేరదు.

/ వర్ణమును జాతియు వేరువేరనుటకు నొక యుదాహరణ మిచ్చుట మేలు. కర్ణుఁడు విద్యాధ్యయనము కొరకు పరశురామునివద్దకు పోయెను. ఒకప్పుడొక భయంకర కీటకముచే వ్యథిత శరీరుఁడై బాధను భరించియుండుటఁ జూచి యిట్టి భయానక స్థితిని యోర్చుకొన్నవాఁడు గనుక నితఁడు క్షత్రియ కుమారుఁడని పరశురాముడు నిశ్చయించెను. కర్ణుని యాకారముఁ జూచినప్పుడు క్షత్రియుండని గుర్తెఱుఁగక యతని సాహసగుణమును జూచి క్షత్రియుఁడని తెలిసికొనెను. ఆకారణమును బట్టి గుర్తింపఁబడునది జాతియనియు గుణమును బట్టి గుర్తింపఁబడునది వర్ణమనియు నిప్పుడు విస్పష్టమయ్యెను./

(అ ధ్యా రో పి త జా తి.)

కొందరధ్యారోపితముగ నాలుగువర్ణములను నాలుగు జాతులని చెప్పియుండుదానిని బట్టుకొని అనునితులు మనుష్యులలో నాలుగు జాతిభేదములు గలవని నమ్మియున్నారు. ప్రాథమికు లెవరును మనుష్యులలో వాస్తవిక జాతిభేదము నమ్మియుండలేదు. ఒక పండితుఁడు వృక్షమందు చేతన పురుషత్వమారోపించి "హే వృక్షరాజమా! నామాట వినుము. నీవు నాకు ఫలములనిమ్ము! నీ సుందరత్వముఁజూచి నాకానందమైనది" యని యనేకవిధముల వృక్షములందు చేతనము

యొక్క అధ్యారోపమును చేసినచో నది కల్పితమని బాలురు సయితము గ్రహించుచున్నారు.

దేశమందనేక ప్రకారములగు వ్యాపారము లావశ్యకతానుసారము వ్యాపించుచున్నవి. అప్పుడొక్కొక్క కార్యమున కనేకులు కావలయును. వారు స్వర్ణకార లోహకార చిత్రకారాది నామములచే ప్రసిద్ధులగుదురు. కార్యానుసారముగ ననేక లోహకారులొక్క స్థానమందే పనిచేయవలసి వచ్చును. ఒక వస్త్ర యంత్రశాలయందనేక తంతువాయులు చేయుదురు. ఇట్లు సమాన బుద్ధియుత్పాదకులు చేయు కర్మణ్యధర్మమును జాతి యనుచున్నారు. "సమాన ప్రసవాత్మికాజాతిః" అని దర్శన సూత్రమును గలదు. ఇదివరకే చెప్పినట్లుగ నొక యేనుఁగును చూచుటవలన నన్ని యేనుగుల బోధయు గలుగుచున్నది. అలాగుననే కర్మణ్య మానవులందు సమానమత్వము ప్రత్యక్ష ప్రతీతముగు చున్నది. ఒక మనుష్యుఁడు లోహపు పనిచేయుచుండుటఁ జూచి 'వీఁడు లోహకారుఁడని, తెలిసిన పిమ్మట నెచ్చటెచ్చట లోహ సంబంధపు కార్యము జరుగుచుండునో యచ్చటి వారినిఁజూచి థట్టన మనము వారిని లోహకారులని చెప్పుచున్నారము. అందరియందును సమాన బుద్ధ్యుత్పాదక ధర్మమొక్కటియై యున్నందున లోహకారు లొకజాతియని అధ్యారోపితముగ చెప్పబడుచున్నారు. పరంతు లోహకారుఁడొకఁ డన్యత్రస్నాన జప పూజా పాఠములు జరుపుచుండగా జూచినప్పుడు వాడు లోహకారుఁడని సర్వథా చెప్పజాలము. అట్లు ప్రతీతి

కానేరదు. ఎందుకు? జాతి యనునది యిచ్చట యాకృతి గ్రహణాత్మకముగాదు అర్థాత్ ఆకృతిగతముకాదు. కార్యగత ముగానున్నది. కార్యము చేయుచుండగా లోహకారుఁడని ప్రతీతియగుచున్నది. అన్యత్రలోహకారుఁడని ప్రతీతికానేరదు. పశ్వాదులు సర్వత్రసమానముగ ప్రతీతియగుచున్నది. ఈ కారణముచేత మనుష్యులందు జాతిని అధ్యారోపితముగ కొందరు వాడియున్నారు. పాణిని ప్రభృతులు శబ్దసిద్ధిలో ప్రయోగించి యున్నవారు. ఇది రూఢియై దేశమందు వ్యాపించియున్నది. ప్రతి దేశజులందును అశనవసన యాచ రణ వ్యవహారాదులు భిన్నభిన్నములై దేశభేదమువలన రూప భేదము గలిగి భిన్న జాతీయత ప్రతీతమగుచున్నదికాని ఈశ్వర నియమమందిది వాస్తవమైన జాతికానేరదు. ఇంక వర్ణ నిర్ణయము చేయుదము.

బ్రహ్మ క్షత్ర వైశ్య శూద్ర యీ నాల్గును వర్ణము లని చెప్పఁబడుచున్నవి గాని జాతియని చెప్పబడి యుండలేదు. నాల్గు వేదములందునుజాతి శబ్దప్రయోగము లేదు. వేదాను సారము మనుష్యులు ఆర్యులు దస్యులని రెండుభాగములుగ విభక్తులై యున్నారు. "ఆర్యాన్యేచ దస్యవః" యని వైదిక ప్రమాణము గలదు. బ్రాహ్మణ గ్రంథములందు "దైవ్యోవై వర్ణో బ్రాహ్మణః" తై-బ్రా॥ "సశౌద్రం వర్ణమసృజత" శ-బ్రా॥ అని యున్నది గాని జాతి శబ్దములేదు. మహాభారతము వనపర్వమందు "తదాహి సమకర్మాణో వర్ణాధర్మానవా

ష్ణువర్ణ” అని వర్ణశబ్దమే వాడఁబడియున్నది గాని జాతి శబ్దము లేదు.

బ్రాహ్మణ కర్మ మొదలుకొని చర్మకార కర్మపర్యంతము వేదమందు వర్ణింపఁబడినది. పశుపోషణమును వ్యవసాయమందు సమస్తధాన్యముల నుత్పత్తిని గురించియు చెప్పఁబడియున్నది; గాని మనుష్యులలో భిన్నజాతి వర్ణనగాని యొక వర్ణమువాఁడు మరియొక వర్ణములో వివాహ మాడకూడదని గాని చేసికొనవచ్చుననిగాని ఆ విషయమై నిందగాని ప్రాయశ్చిత్తముగాని చెప్పియుండలేదు. వైదిక సమయమందు యీ విధమగు జాతిభేదము సర్వథా అణుమాత్ర ముండలేదు. ఈ యాధునిక జాతిభేద మెక్కటినుండి ప్రారంభమైనదో మొదట నిరూపించుట మేలు.

ఆవస్యకతానుసారము వివిధ వ్యవసాయము లభివృద్ధి నొందుటవలన క్రమ క్రమముగ మనుష్యులలో నానావృత్తు లుత్పన్నము లగుచుండును. సృష్ట్యాదియందే హోతా-అధ్వర్యు-ఉద్గాత- బ్రహ్మ- రథకార- శిల్పకార- సారథి- లోహకారాది వృత్తులు సృష్టింపఁబడి యుండలేదు. సమస్త వృత్తులును క్రమక్రమముగా వచ్చినవి. ఇప్పుడుండు జనసంఖ్య సృష్ట్యాదియందుండదు, నిస్సందేహముగ నిప్పటివలె సృష్ట్యాది యందు గ్రామములు, పల్లెలు, పట్టణములు, నగరములు, మందిరములు, భవనములు, ప్రాసాదములుండలేదు. సృష్టికి బహుకాలమునకు వెనుక వ్యవసాయ ప్రారంభ మైనది. వేదమునందన్ని వృత్తులు సూత్రరూపమున సంక్షేపముగ

వర్ణింపఁబడి యున్నవి. ఋషులట్టి వేదసూత్రముల యాధార మున నన్నింటిని కార్యరూపముగ నావశ్యకత ననుసరించి వృద్ధికిఁ దెచ్చియున్నవారు. శతపథాది బ్రాహ్మణ గ్రంథము లందీ యంశము విదితమగుచున్నది. మనుష్యోచితమగు సమస్త సామగ్రియు నీశ్వరేచ్ఛవలన ప్రస్తుతమైన తరువాతనే మనుష్య సృష్టి యారంభమైనది. శిశువు జన్మించక మునుపే తల్లిస్తనము లందు పాలు ప్రస్తుతమైయుండును. ఏనుగ- గోవు- కాకి- చిలుక- మత్స్య- కూర్మాది జాతులు సృష్టియొక్క ప్రారంభమం దేర్పడి యున్నవి. ఆది సృష్టియందు అగ్ని- వాయు- ఆదిత్య- అంగిరాయను నలుగురు ఋషుల హృదయములలో నాల్గు వేదములు ప్రకటమై వారి ద్వారా సమస్తము విస్తృతము చేయబడినదని వేదము చెప్పుచున్నది. అనగా- అమైథునమగు నీశ్వరక్రమము తరువాత సృష్టి క్రమారంభమైనది. అనేక సంవత్సరముల కాలము వ్యతీతమైన తరువాత లోహాకార- ధనుష్కార- కుంభకార- స్వర్ణకార- చర్మకార- తంతువాయాది కర్మలు వెలసినవి. అట్లు వైదిక సమయము కొంత గడచిన పిమ్మట యే వంశమం దెట్టి వ్యవసాయసిద్ధికి హేతువులు లభించినవో దానియందా వంశమువారి కధికారము లభించినది. ఏ వంశజు లే కార్యమున కధికారులో వారి వశమందా వ్యవసాయముండుట వలన నాకార్య ముత్తమముగ నుండునని తలంపఁబడెను. అట్లుండుట వలన నా కార్యమందు నైపుణ్యము నుత్సాహము వారియం దభివృద్ధి యగుచుండు నని దానిచే నష్టము సంభవించదని శ్రీరామ [illegible]

టయు నాకాలముయొక్క స్థితి కనుగుణ్యమై యుండెను. అట్లుండకున్న లాభదాయకమని తోచిన కార్యమును మరి యొకరు ప్రారంభించుటవలన మొదటివానికి నష్టము కలుగును. మరియు ననవస్థిత చిత్తముగలవా రొకదానియుం దించుక నష్టము కలిగినచో మరియొకదాని నారంభించెదరు. ఇట్లు పెక్కునష్టములకు హేతువులగునని యప్పటి వారు తమ స్థితికి దగినట్టి స్వవ్యవసాయములను విడిచి యన్య వ్యవసాయములు నవలంబించిన వారిని పతితులుగా పరిత్యజించుచు వచ్చిరి. దానికి జాతిబహిష్కరణ మను పేరు వాడబడెను వృత్తులను జాతియని పిలుచుట కప్పు డారంభమైనది, వృత్తులు వంశానుగతములైనను అనేకాంశములందు సంబంధములు గలిగియుండిరి. అందరును ఆర్యులనఁబడుచుండిరి. మానవార్య సభలు స్థాపింపఁబడినవి. ఈ సభలను గురించి మనుస్మృతి యందు విస్తారముగ వివరింపఁబడియున్నది.

సర్వాధికారముఁగల మహా సభాధిపతికి మనువనియు, చక్రవర్తికి సమ్రాట్ అనియు, మహారాజునకు ఇంద్రుఁడనియు, మంత్రికి బృహస్పతియనియు నామాంతరములుండినవి. ♦ దేశము సర్వసంపదలతో నిండియుండెను.

దాదాపుగ నారువేల సంవత్సరములకు పూర్వము వంశానుగత వృత్తులు జాతిగను అస్తవ్యస్తమగువర్ణ వ్యవస్థగను స్థాపితమై పరంపరాగతమగుచువచ్చెను. అయినప్పటికి

♦ పురాణములందు వైదిక శబ్దార్థములు చెడిపోయినవి.

గొప్పగొప్ప విద్వాంసులప్పుడప్పుడు యీ వ్యవస్థను ఖండించి తొలగించుటకు ప్రయత్నించియున్నారు. కాలక్రమమున వేద పఠనమును అస్వీకృతికి విద్యయు క్షీణించుచు రాగా లోకు లజ్ఞానులై వేదవిరోధమగునని గాని యుక్తికి వ్యతిరిక్తమగునని గాని వ్యాకరణ విరుద్ధమగునని గాని ఆర్షేయ పద్ధతికి వ్యతిరేక మగునని కాని తోచక "బ్రహ్మముఖమందు బ్రాహ్మణులును, బాహువులందు క్షత్రియులును, తొడలయందు వైశ్యులును పాదములందు శూద్రులును పుట్టిరనియు జన్మముచేత వర్ణము వచ్చినది కాని కర్మచేత కాదని" వేదవాక్యముల కర్థముచేయ ప్రారంభించిరి.

[ శ బ్ద ప్ర మా ణ ము. ]

ఇంతవరకు ప్రత్యక్ష ప్రమాణమువలన నిరూపించిన యంశము నిప్పుడు శబ్దప్రమాణమున సిద్ధాంతము చేయవల యును. శబ్దప్రమాణ మెప్పటికిని ప్రత్యక్ష ప్రమాణమునకు విరోధముగ నుండదు. అట్లుండనుకూడదు. ఉండిన నది ప్రమాణముగ పండితులు స్వీకరింపరు. ఎందుకన భూగోళ పటము అథవా చిత్రము ప్రత్యక్ష ప్రమాణము. దాని వివ రణగ్రంథము [భూగోళశాస్త్రము] శబ్దప్రమాణము. గోళము యొక్క ప్రకృతికి [పఠమునకు] విరోధముగ వివరణ గ్రంథ మున్నప్పుడు దాని నెవరంగీకరింతురు? గనుక ప్రత్యక్షమునకు శబ్దప్రమాణము విరోధించకూడదు.

ప్రత్యక్షముగ ప్రతి మానవునియందును న్యూనాధిక ముగ చాతుర్వర్ణ లక్షములున్నవి. శమదమాదిగుణములు

ప్రాధాన్యముగ గలిగి తపస్సు చేయుచున్న బ్రాహ్మణుఁ డొకప్పుడు దుష్టులు దుష్టమృగములు తనపై యాక్రమణము చేసిన సమయమందు ధైర్య శౌర్యబాహు బలాది క్షత్రియ గుణముల నుపయోగింపవచ్చును. తనజీవన వ్యతీతము కొరకు వ్యవసాయ వ్యాపారాది వైశ్యవ్యవహారములుసలుపవలయును. తన సన్నిధికి వచ్చిన అతిథి యభ్యాగతులను సత్కరించుటలో సేవా శుశ్రూషాది శూద్ర ధర్మమాచరింపవలయును. ఎవని యందేది ప్రాముఖ్యగుణమో దానిని యనుసరించి యావర్ణమున వానిని పిలువవలయును. ఇట్టి ప్రత్యక్ష ప్రమాణమునకు విరోధముగ మనుష్యులలో జాతిగలదనియు నది జన్మము తోడవచ్చుననియు వేదమెట్లు చెప్పును?. సత్యము మనకగత్యము గనుక మొదట నీ "బ్రాహ్మణోస్యముఖమాసీత్" మంత్రము యే యవసరమందు చెప్పఁబడినదో విచారింతము. ఈమంత్రము నకు పూర్వ మొక ప్రశ్నయున్నది. "ముఖం కిమస్యాసీత్ కిం బాహూ కి మూరూపాదా ఉచ్యేతే"యని నాలుగుప్రశ్నలతో గూడియున్నది. తరువాత దీని కుత్తరముగ "బ్రాహ్మణోస్య ముఖమాసీత్" యను మంత్రమున్నది.

ప్రశ్న 1. ముఖం కిమస్యాసీత్ =అతనికి ముఖమేది?

ఉత్తరము—బ్రాహ్మణోస్య ముఖమాసీత్ =అతని ముఖము బ్రాహ్మణులు.

ప్రశ్న 2. కింబాహూ? = బాహువేది?

ఉత్తరము—బాహూరాజన్యః కృతః=అతని రెండు బాహువులు క్షత్రియులు.

ప్రశ్న 3. కిమూరూ — తొడలేవి ?

ఉత్తరము—ఊరూతదస్యయద్వైశ్యః = తొడలు వైశ్యులు

ప్రశ్న 4. పాదాఉచ్యేతే = పాదములేవి ?

ఉత్తరము—పద్భ్యాంశూద్రో అజాయత = పాదములందు శూద్రులు పుట్టిరి.

ఎవరైన "వానికి ముఖమేది?" యని యడిగినప్పుడు అందుకు ప్రత్యుత్తరముగ వాని ముఖమందు బ్రాహ్మణు డుత్పన్నమయ్యెనని చెప్పినప్పుడది ప్రశ్నకు సరియైన యుత్తర మని చెప్పువారుగలరా? బ్రాహ్మణుఁడెచ్చట నుత్పన్న మయ్యెను? అను ప్రశ్న వేసినప్పుడు పూర్వోక్తముగు నుత్త రము సమాధానముగ నుండును.

వేదమందనేక యలంకారములున్నవి యిదియు నొక యలంకారము ఈ యలంకారిక వర్ణనమందు ముఖ్యముగ ముఖముచే పనులు చేయువారు బ్రాహ్మణులని బాహువుల యొక్క పనిచేయువారు రాజన్యులని, మధ్యశరీరముచే పనులు చేయువారు శూద్రులని చెప్పఁబడియున్నది.

కంఠమునకు పైభాగము ముఖము అనగా శిరస్సని తాత్పర్యము. దీనియందు రెండు నేత్రములు, రెండు చెవులు ఘ్రాణము జిహ్వయు గలిగి యేడింద్రియములకు స్థానమై యున్నది. ఇవియే సప్తర్షి యనఁబడుచున్నవి. ఋషులెట్లు సత్యాసత్య నిర్ణయపరులో తద్వతుగ నీ సప్తేంద్రియములు మంచిచెడ్డల నన్నింటిని నిర్ణయించి క్షత్రియాదుల కనుజ్ఞ

యిచ్చుచుండును. శ్రవణ మనన నిధిధ్యాస వివేక విజ్ఞానాదు లకు శిరస్సు ప్రధానము. కన్నులొక వ్యాఘ్రమును జూచి నప్పుడు మనస్సునకది భయంకరమగు జంతువని తెలిసి దానిని వధించుటకు నాయుధము పుచ్చుకొనుటకై బాహు వుల కాజ్ఞ యియ్యబడుచున్నది.

ఇదేవిధమున ప్రత్యేక విషయము మొదట శిరస్సు పరీక్షించి దానిని గ్రహించుటకును త్యజించుటకు నాజ్ఞ యిచ్చుచుండును. పఠన పాఠనములు ముఖముయొక్క పనిగా నుండును. సర్వశ్రేష్ఠమగు మస్తిష్కము శిరస్సునందే గలదు. గనుక బ్రాహ్మణులు ముఖమువంటి వారనుటకేమి సంది యము?

బాహువులు సంపూర్ణ శరీర సంరక్షణమును చేయు చున్నవి. శిరస్సు మొదలు పాదములవరకు నేవిధమగు నాపద గలిగినను వెంటనే దేహసంరక్షణముకొరకు చేతులు పరుగిడు చుండును. యుద్ధక్షేత్రమునందు బాహువులు లేకున్న నేకార్య మును నడువదు. గనుక బాహువులవలె మనుష్యజాతికి సేవఁ జేయుటచే బాహుబలము గలవారు క్షత్రియులని చెప్పఁబడి యున్నది.

ఇదే మంత్రమథర్వ వేదమున గలదు. అందు "మధ్యం తదస్యయద్వైశ్యః" యని యున్నది. గనుక 'ఊరూ' శబ్దము శరీరమధ్యభాగమున కన్వయించుచున్నది. ఉదరమేమి పని చేయునో సర్వులకు విదితమే. అన్నపానము లుదరమందు సంచితములై యచటినుండి సుందరమగు రసమై సర్వ శరీర

మునకు వ్యాపింపఁజేయుచున్నది. మరియు మలిన పదార్థము లను బైట త్రోయుచున్నది. ఈ ప్రకారము నానా పదార్థ ములుచేర్చి దేశదేశాంతరము లందంతట వ్యాపింపఁజేయు వారూరువులకు అర్థాత్ మధ్యభాగమునకు సమానులని చెప్పఁబడినది.

పాదములీ శరీరమును భరించి కోరిన చోటికి చేర్చు చున్నవి. ఈ యలంకారరూపమగు వేదాశయమును తెలియ నేరక వేదవిరోధముగ నీశ్వరునకు శరీరమును కల్పించి అందు బ్రాహ్మణాదులు పుట్టిరని చెప్పువారు వైదిక వృక్షమును పాడుచేయు చెద పురుగులగుదురు కాని సర్వథా వైదికులు గా నేరరు.

ఇచ్చట "పద్భ్యాం శూద్రోఽజాయత" యను వాక్య మును వారాధారముగా జూపెదరుగాని వేదవిరోధమగునను శంకను పాటింపరు. లోకమందొక యాశయము బహుజనాభి ప్రాయమునుబట్టి యంగీకారమగుచుండునుగాని యొకరిద్దరి యభిప్రాయమంగీకరింపఁబడదు. ఇచ్చట మూడు వాక్యము లేకరీతియుండుటచేత అంతిమవాక్యమును పైమాటితో తుల్య ముగ నన్వయించుట న్యాయమై యున్నది.

వేదమందిదే సూక్తములో "చంద్రమా మనసోజాతశ్చ క్షోసూర్యోఽజాయత। శ్రోత్రాద్వాయుశ్చ ప్రాణశ్చ ముఖా దగ్ని రజాయత"అని గలదు. మనస్సుచేత చంద్రుఁడు నేత్రము వలన సూర్యుఁడు ముఖమందగ్నియు పుట్టెనని అర్థముచేసిన యెడల వేదమందు పాదాన కారణమగు ప్రకృతిచే సృష్టిచేయఁ

బడెననుటకు విరోధమగు చున్నది. నిరాకారుఁడగు నీశ్వరుఁడు వికారుఁడని చెప్పినట్లుగ నగును. గనుక బ్రాహ్మణ గ్రంథము లందీ మంత్రమునకిట్లు వ్యాఖ్యానము చేయఁబడినది.

"భూరితివై ప్రజాపతిః బ్రహ్మజనయత భువఇతిక్షత్రం స్వరితి విశమేతావద్వాఇదం సర్వం యావద్బ్రహ్మ క్షత్రంవిట్ సర్వైవాధీయతే" ఇత్యాది శతపథ బ్రాహ్మణ ప్రమాణములు చూచునది.

మానసముయొక్క ప్రసన్నత కొరకు చంద్రుఁడును, నేత్రమందు జ్యోతినిచేర్చునిమిత్తము సూర్యుఁడును, శ్రవణ మందు శబ్దమును వ్యాపింపజేయుటకై వాయువును, ముఖ మందు బలమునుచేర్చుటకై నగ్నియు, సృష్టింపఁబడినదని వివరింపఁబడియున్నది; గాని మనస్సులో చంద్రుఁడు పుట్టెనని, కంటిలో సూర్యుఁడుద్భవించెనని, చెవియందు వాయుప్రాణ ములు జన్మించెనని, ముఖమందగ్నియుత్పన్నమయ్యెనని చెప్పి యుండలేదు.

ధర్మశాస్త్రములలో ముఖ్యమగు మనుస్మృతియందు "కిన్నరాన్ మత్స్యాన్ వివిధాంశ్చ విహంగమాన్ । పశూన్ మృగాన్ మనుష్యాంశ్చ" యని యున్నదిగాని బ్రహ్మముఖ ములో బ్రాహ్మణులు పుట్టిరి యనిలేదు. అట్లు చెప్పుట వేద విరోధమని స్మృతికర్తతలంచెను.

ముఖాదియంగములందు వర్ణములుత్పత్తియైనవనిఅర్థము చేయుటవలన నసంభవదోష మేర్పడుచున్నది. ఎట్లన:—బ్రహ్మ ముఖమందు పుట్టిన బ్రాహ్మణులు స్వభావతః శ్రేష్ఠులై సదా

కాలము వారన్ని విషయములందును విజ్ఞాన దక్షత గలిగి యుండవలయును. అట్లు లేక ననేకులు శూద్రులకంటె నికృష్టులై నీచులగుటకు కారణముండకూడదు. బ్రాహ్మణాది వర్ణములు వంశపరంపరా ప్రణాళి ప్రచలితమైనతరువాత రచింపఁబడిన స్మృతులందు సయితము వేదాధ్యయనాది యుత్తమ కర్మమువలన బ్రాహ్మణత్వ మబ్బునని చెప్పఁబడియున్నది.

[యు క్తి ప్ర మా ణ ము.]

బ్రహ్మ తన ప్రత్యేకాంగములందు నాలుగు వర్ణములుత్పన్నముచేసియుండినచో బ్రహ్మయొక్క మనోరథ మేమి సిద్ధించెను ? నాలుగు వర్ణములలోను పశ్వాది జాతులకువలె నేమియు విశేష చిహ్నములు నిర్మాణముచేయ లేదు. పశ్వాదులలో భిన్న భిన్న సూచకములు స్థాపితములై యున్నవి. గోవునకు తలపై కొమ్ములున్నవి. గుఱ్ఱమునకులేవు. వాని యాకృతులలో భిన్నములున్నవి. వానిని బట్టి జాతిగుర్తింపఁబడుచున్నది. వివాదములతో పనియుండదు. ఈ విధముగనే మానవులలోని వర్ణముజాతియైనచో బ్రహ్మ క్షత్ర వైశ్య శూద్రాదులలో సయితము విశేష చిహ్నములుండ వలయును అట్లు లేదు. ముఖాది వేరువేరు యంగములందు బ్రాహ్మణాదులు పుట్టిరన్న నుపాదాన కారణవాదము ననుసరించి దేనియందుత్పత్తియై యుండెదరో దానియాకృతి కలిగియుండవలయును. మఱియు ముఖమందు మలినపదార్థము లుత్పత్తియగుచున్నవిగాన బ్రాహ్మణులు స్వభావతః శ్రేష్ఠులు కాకపోయిరి. ఈశ్వరాంగములన్నియు పవిత్రములేయగునన్న నందరు సమా

నులైరి. అంగములలో నుత్తమాది భేదములున్నవనినచో లోకులు పాదములను పూజించి వానికే నమస్కరించి గౌర వింతురు. గనుక శూద్రులందరికంటె నధికులైరి. గనుక వృథగా శ్రేష్ఠమని గర్వించువారు గర్వించి చెడిపోవు చున్నారు.

[ ఖండన మండనములు. ]

మే మింతవరకు మాసిద్ధాంతములను అకాట్యమగు ప్రమాణములతో నిరూపించినారము. సికిందరాబాదు నివాసు లగు శివపురపు వీరభద్రపాకయాజిగారును, చివుకుల అప్పయ్య శాస్త్రిగారును, ఈశ్వరుఁడు నిరవయవుఁడైనచో బ్రాహ్మణాది వర్ణములకు ముఖజ బాహుజాది శబ్దములుండుట యెట్లు సంభ వించెనని శంకించుచు నిఘంటులను చూపుచున్నారు. హిందూస్కూల్ శబ్దములు ఆర్ష గ్రంథములందెచ్చటను లేవు. ముసల్మానుల యాగమనమునకనంతరము హిందూ శబ్దమును, ఆంగ్లేయుల యాగమనాంతరము స్కూల్ శబ్ద మును మనగ్రంథములందు చేర్చబడి యున్నవి. ఇదేవిధముగ వేదవేదాంగాది వైదిక గ్రంథములందెచ్చటను ముఖజ బాహుజాది శబ్దములులేవు. ఎందుకన "బ్రాహ్మణోస్య ముఖ మాసీత్" మంత్రమునకు ముఖాదులందు బ్రాహ్మణాదులు పుట్టిరని వైదికసమయమందర్థముచేసి యుండలేదు. అదివేద విరోధము. మఱియు నీశ్వర లక్షణములకును సృష్టివిద్యకును విరుద్ధము. ఈ యసంగతార్థము స్వార్థుల వలన కల్పింపఁబడిన తరువాత నీపర్యాయ శబ్దములు వాడుకలో వచ్చియున్నవి.

రాజ్యపురుషునకు రాజు తల, కన్ను మంత్రి, స్నేహితుఁడు శ్రోత్రము, కోశము ముఖము, రాష్ట్రము పాదములని వర్ణింపఁబడియుండగా పామరుఁడగువాడు తలలో రాజును, కంటిలో మంత్రియు, చెవిలో స్నేహితుఁడును, ముఖములో కోశమును పాదములందు రాష్ట్రము జన్మించెనను అర్థము చేసినచో వివేకముగలవారంగీకరింతురా?

( వర్ణ పరివర్తనము. )

పుట్టుకతో వర్ణము వచ్చినయెడల చచ్చువరకు పరివర్తనము కాకూడదు. ఇప్పు డెందరో మతాంతరులైనందున వర్ణబాహ్యులై యున్నవారు. పూర్వ మైతరేయ బ్రాహ్మణ గ్రంథకర్తయగు ఐతరేయుఁడు దాసీపుత్రుఁడు. ఇతని తల్లిపేరు మహీ. ఈమె దాసిగా నున్నందున 'ఇతరా' యని పిలుచు చుండిరి. 'ఇతరస్త్వన్య నీచయోః' యని కోశము. ఇతరా పుత్రుఁడు గనుక ఐతరేయుఁ డనబడెను. కవష—ఐలూష లనువారు నీచ వర్ణమువారుఁ వారాచార్యులై యజ్ఞము చేసిరి. కరూషయను శూద్రుఁడు క్షత్రియుఁడైనట్లు ఆర్షగ్రంథములలో గలదు. వైశ్యవృత్తియందుండిన నాభాగుఁడు క్షత్రియు డయ్యెను. ప్రతివానియందును నాలుగు వర్ణములుండి వానిలో ప్రాముఖ్యత వహించిన గుణము ననుసరించి వర్ణము వచ్చుననుట కింతకంటె పుష్టప్రమాణము లేమి కావలయును? ఇప్పుడు మనము శూద్రులని భావించెడు వృత్తులవారిని వేద మెట్లు యాదరించి నమస్కరించునో చూడుడు.

"నమస్తక్షభ్యోరథకారేభ్యశ్చవోనమో,
నమఃకులాలేభ్యఃకర్మారేభ్యశ్చవోనమో,
నమోనిషాదేభ్యఃపుంజిష్ఠేభ్యశ్చవోనమో"

యని వేదమందు శూద్రులకు సత్కారము చూపఁబడి యున్నది. వైదిక సిద్ధాంత ప్రకారము శూద్రుఁడన బహు పరిశ్రమము గలవాడని యర్థము. "తపసే శూద్రమ్" అని యజుర్వేదము. తపమన మిక్కిలి కఠినకార్యము. ఈ యంశము, ఛాందోగ్యోపనిషత్తునందుగల జానశ్రుతియను రాజును రైక్వమహాముని శూద్రుఁడాయని సంబోధించిన విషయమువలన సిద్ధమగుచున్నది. మనుష్యశరీరమందు శిరస్సు బ్రాహ్మణుఁడు; చేతులు క్షత్రియుఁడు; మధ్యభాగము వైశ్యుఁడు; పాదములు శూద్రుఁడను నిజమైన యర్థ మిప్పుడే తేటపడుచున్నది. ప్రతివాడును నాలుగు వర్ణముల పనులును దినదిన ప్రతిదినమును చేయుచున్నాడు చాతుర్వర్ణయోగమే మానవత్వము. జనక మహారాజు బ్రాహ్మణపదవియందు పూజ్యుఁడై యుండెను. అతని ప్రభుత్వము క్షత్రియత్వమును, ఆతని వైభవము వైశ్యత్వమును, ఆతని పదార్థాన్వేషణ బుద్ధి శూద్రత్వమును ప్రతిపాదించుచుండెను.

ఇప్పుడు ప్రతి గృహమును చాతుర్వర్ణ యుక్తమై యున్నది. సికందరాబాదు మహబూబు కాలేజి తెనుగు పండితులగు శివపురపు వీరభద్రపాకయాజిగారును, చివుకుల అప్పయ్యశాస్త్రిగారును మా వైదికాంధ్ర గ్రంథ మాలిక లోని ప్రశ్నోత్తరపమునుచూచి యోచించకను వివేచనలేకను

అర్ణవాపోశనము చేయుటకగ స్వ వేషములను ధరించి "గుణకర్మ స్వభావానుసారము వర్ణము వచ్చుననియు జాతి వేరు వర్ణము వేరనియు చెప్పువారు కలిరాజ సేవకులని వ్రాసిరి. ప్రత్యక్షాది ప్రమాణములకు విరుద్ధముగ మిథ్యావాదము చేయుచున్నందున తామే కలిరాజ సేవకులుగ నున్నవారు. మేము మనుష్యేతరజాతియని నిరూపించినారము. వీరభద్రపాకయాజిగారును, అప్పయ్యశాస్త్రిలిందలకు వ్యతిరేక వాదులు గనుక తాము మనుష్యేతరజాతిలో చేరినవారని తమవాదమువలననే సిద్ధమైనది. సంకరమును వీరియందే సార్థకమైనది.

( పరిశ్నార్ణ వాపోశన నిరసనము. )

శి. వీ. పాకయాజిగారును, చి. అ. శాస్త్రిలును మమ్మార్యులని నిశ్చయించిరి. ఆర్యులగు మమ్ముల పరిహసించుచు మాకు విరోధములగు నవైదిక సిద్ధాంతములను స్థాపింప జూచిరి గనుక "ఆర్యాన్యేచదస్యవః" యను వేదప్రమాణము చొప్పున తాముదస్యులని సిద్ధమైనది.

మా ప్రశ్నలకు ప్రత్యుత్తరములు వ్రాయలేదు. ఉదాహరణముగ మా మొదటి ప్రశ్న "వర్ణము జన్మము తోడనా? గుణకర్మ స్వభావముతోడనా? వీర్యప్రధానమా? క్షేత్రప్రధానమా? అధవా రెండునా? వీర్యప్రధానమైతే, ధృతరాష్ట్రాదులు క్షత్రియులెట్లు? క్షేత్రప్రధానమైన వ్యాసాదులు బ్రాహ్మణులెట్లు? రెండును ప్రధానమైన, యొకనితల్లి శూద్ర స్త్రీ,

తండ్రి బ్రాహ్మణుఁడు, వాని వర్ణమేది?" ఇందుకు త్తరములు లేవు. గ్రంథమంతయు పరిహాస వచనములతో నిండియున్నది. గనుక నది విషపానమైయున్నది.

తాము సనాతన ధర్మరక్షకులని వ్రాసికొనిరి. 1903 సంవత్సరమునందు నాసిక్ నగరమున సనాతన ధర్మ మహా పరిషత్తు నందు పతితపరావర్తనమంగీకరింపఁబడి అది మొదలు కొని సభవారు పతితులను తమలో చేర్చుకొనుచున్నారు. దీనికి విరుద్ధముగ శి. పీ. పాగారును, చి. అ. శాస్త్రిలును వ్రాసిరి గాన వీరు సనాతన ధర్మరక్షకులు గానేరక తద్భక్షకులగు ససనాతన ధర్మపరులగు రాక్షసులైరి. లోకమంతయు గుణము ప్రధానమని యనుచున్నారు. వేదాది శాస్త్రము లాలాగే చెప్పుచున్నవి. వీరిందుకు విపరీత చేతస్కులైరి. గావున "సాక్షరాహి విపరీతతాంగతాః కేవలం జగతితేపి రాక్షసాః"యను నది వీరియందు సార్థకమైనది. "చాతుర్వర్ణ్యం మయాసృష్టం, గుణకర్మ విభాగశః" అను గీతా వాక్యములో 'సృష్టం' అను శబ్దమును గట్టిగ పట్టుకొని యీ యపరాగ స్త్యులు విషపానముచే స్మృతితప్పి "గుణకర్మవిభాగశః" యను దానిని త్యజించి వెఱ్ఱికేకలు వేయ ప్రారంభించిరి.

పాకయాజిగారును శాస్త్రిగారును వారి తాత ముత్తాతలును వేనిని నమ్మియున్న వాంలో అట్టి పురాణములనుండి చూపిన ప్రమాణములనుబట్టి మేము పురాణముల నమ్మచున్నామని భ్రమించిరి. అవి తమకొరకుగాని మాకు గావని గ్రహింపలేక విలపించిరి.

ఈశ్వరుఁడు మనకు దుర్లభమగు శరీరమును, ప్రసాదించి తన యనుగ్రహమును జూపియున్నాడు. దీనిలో నుత్తమము, ప్రశంసనీయము, అనర్ఘము, అద్భుతము, ఉజ్వలము, విశుద్ధము, వివేకరూపమగు నొకమహాదీపము వెల్గుచున్నది. దీనిచే మన మధికముగఁజూచి యధికముగఁ దెలిసికొని యధికముగఁ జేయగలము. అందుకొరకు గురువు గావలయును. అట్టి గురువు వేదమని యార్యుల మంతవ్యము. ఇదికపటమని కృత్రిమమని వ్రాసిన హస్తములకు ధిక్కారము సమర్పించెదము. ఇదియధిక (యాపోశన) పానముచే గలిగిన యధిక ప్రసంగము ననధికార చేష్టయగుచున్నది.

"వసు, రుద్రా, దిత్య బ్రహ్మచర్యములను కల్పించినామని వ్రాసిరి." వేదమందు పర్యుక్త బ్రహ్మచర్యములను జూపినచో పాకయాజి శాస్త్రిలిరువురును తమ నాలుకలు గోయించుకొని హస్తముల కత్తరించుకొనియెదరా? * చిత్రములను జూచి చర్మపరీక్ష చేయువారికి వేదాధికార మెట్లు వచ్చును? వీరు పౌరాణికులు. హిందూమత గ్రంథములెల్ల, జన్మమువలననే వర్ణము కలిగెనని వేనోళ్ల ఘోషించుచున్నవని వ్రాసిరి. ఆర్షగ్రంథములందెచ్చటను హిందూ శబ్దములేదు. ఇది సంస్కృత శబ్దముకాదు. ఇది యేదో క్రొత్తమతము. దీని గురించి గ్రంథము లేమిటో సిద్ధాంతము లేమిటో వినగోరెదము. మాకు తెలిసినంతవరకు హిందువనగా నాస్తికుఁడు, గులామని యర్థ

---

*యజు. ౧౧॥౫౮॥ఛాందో॥ఖండ॥౬-౭౮-౯-౧౦॥లో ఈవిషయము గలదు.

ము. ఈనాస్తికమతమునకు సనాతనధర్మమని పేరుపెట్టిన లోక వంచకుల నేమనవచ్చును? గనుకనే మేము చూపిన ప్రమాణ గ్రంథములను తమ గ్రంథములుగావని యనుకొనిరి.

సృష్టిరూపమన నీశ్వర రూపమట. ఈశ్వరునకు, రూపము గలదట. శ్రీయాది శంకరులు బ్రహ్మ సూత్ర [వేదాంత] భాష్యమందు "సృష్ట్యుత్తర భావిత్వాచ్ఛరీ రస్య ప్రాక్ సృష్టేస్తదనుపపత్తేః" అనఁగా భూగోళాది సృష్టికి యనంతరము శరీరముయొక్క సృష్టియగుచున్నది. గాన నీశ్వరుఁడు శరీర రహితుఁడని నిరూపించియుండగా వారి శిష్యులగు వీరు శంకర సిద్ధాంతమును సంకరముచేసి యీశ్వరునకు శరీరము కలదనుచున్నారు. గనుక గురుద్రోహులును మిథ్యావాదులని సిద్ధమైనది.

వీరికి జుట్టుబొట్టు కట్టులు ప్రాముఖ్యములు. వీరుబ్రహ్మ ముఖమందు బుట్టలేదు. గనుక బ్రాహ్మణులుకారు. గుణ కర్మములు వర్ణహేతువులుకాదు గనుక వీరికేవిధము నను బ్రాహ్మణత్వములేదు. ఇందువలన వీరు జుట్టుబొట్టులతో బ్రహ్మత్వముఁ బొందగోరిరి. ఉభయ భ్రష్టత్వము వీరికి సిద్ధించెను. వీరు సాధుజంతువులను జంపెడు శాక్తేయులు.

వీరద్వైతులైనచో వారి మతప్రకారమందరును బ్రహ్మలే యగుదురు. అయినను శూద్రాదులకు వేదాధికారము లేదని వాదించుచున్నారు. [7-9-17] ఆ॥ ప్రకాశిక కాకున్నచో నొక బ్రహ్మవలన నాలుగు వర్ణములు కలిగినట్లే యొకని వీర్యమునకు నాలుగు వర్ణముల వారును గుణకర్మ

నుసారముగ నేర్పుదురని యొప్పుకొనవలెను. అదియును వీరి కిష్టములేదు. గనుక వీరివాదమునకు తర్కము. పూర్వాన్యాసమందు ముఖజబాహుజాది శబ్దములెప్పుడు రూఢిలో వచ్చినది నిరూపించినారము గాన - వారిని మేము మూర్ఖులారా! యని సంబోధించినట్లు తామే వ్రాసికొనినది సార్థకమే యని మే మొప్పుకొనుచు న్నారము. నవగ్రహ సమీక్షలో నిది పాఠకులకు దృఢపడును. స్త్రీ శూద్రోపనయన విధియను గ్రంథమును వ్రాయవలెనని మాకుపదేశించిరి. ఎవరి గుణకర్మ స్వభావములు పనయనార్హములగునో వారికిచేయుచునే యున్నారము. తమలో నిట్టి విధిలేదు. గనుక సంకరులై యున్నారు. ఇంకనైనను పాకయాజి శాస్త్రిలుభయులును సత్యమును గ్రహించి యాచరించి తమలోని వర్ణసంకరను బోగొట్టుట మంచిదని సూచించుచున్నారము.

మేమిదివరకే ఖండించి మిథ్యయని సిద్ధాంతము చేసిన ఫలిత జ్యోతిష గ్రథప్రమాణములు జూపుచు వీరభద్ర పాకయాజిగారును శాస్త్రిగారును నవగ్రహములు బ్రాహ్మణాది వర్ణకారకములనియు పుట్టుకతో వర్ణము వచ్చుననియు వ్రాసిరి. వీరికి పట్టియుండు గ్రహపీడను నవనవగ్రహ సమీక్ష చేసి తొలగింతము. ఇందువలన వీరి యజ్ఞానమును వీరు సామాన్య జనులను మోసపుచ్చు విధమునులోకమునకు విదితమగును.

పాకయాజిగారును శాస్త్రిగారును ఫలితగ్రంథములయొక్క మిథ్యత్వమును పూర్వాపర విరోధమును తెలియని

యజ్ఞానముచేత గ్రహములకు వర్ణములతో సంబంధము చేసిరి. కాలామృత గ్రంథప్రమాణముచేత- గురు శుక్రులు బ్రాహ్మణులు; సూర్యాంగారకులు; క్షత్రియులు; చంద్ర బుధులు వైశ్యులు; శని శూద్రగ్రహమనియు, నీ గ్రహములు జాతి చతుష్టయమునకుఁ బ్రత్యేక సృష్టికి కారకములని వ్రాసిరి. భువన దీపకలో "విప్రౌ శుక్ర గురు క్షత్రౌ కుజార్కౌ శూద్ర ఇందుజః । ఇందుర్వైశ్యః స్మృతౌమ్లేచ్ఛౌ సైంహికేయశనైశ్చరౌ" అని బుధుఁడు శూద్రుఁడనియు రాహుశనైశ్చరులు మ్లేచ్ఛులని గలదు. ఇందేదినిజము ? భాగవతరీత్యా చంద్రుఁడు అత్రిమునికి అనుసూయయందు కలిగినవాఁడు. "అనసూయాతుసుషువే క్రమాత్పుత్రత్రయంద్విజాః ! దత్తాత్రేయం చంద్రమసంతథా దుర్వాససంమునిం" ఇత్యాది సౌరపురాణోక్త ప్రకారము సంఖితము చంద్రుడత్రిమునికుమారుఁడే. చూడుఁడు ! బ్రాహ్మణులకు జన్మించిన చంద్రుఁడు వైశ్యుఁడయ్యెను. వైశ్యుఁడగు చంద్రుని పుత్రుఁడు శూద్రుఁడయ్యెను. సూర్యుఁడు క్షత్రియుఁడు అతని పుత్రుఁడు శనైశ్చరుఁడు శూద్రుఁడు అథవా మ్లేచ్ఛుఁడు. వర్ణ కారకములగు గ్రహములలోనే పరివర్తనము గలదు. శి. పీ. పాకీగారి యొక్కయు, చి. అ. శా. గారియొక్కయు వాదమేగర్తమునఁ బడవలయును ? ప్రతిమానవమాత్రుఁడును నాలుగు వర్ణములతో గూడియున్నాడనియు నందు ప్రాముఖ్యగుణమునుబట్టి వర్ణమేర్పడుననెడు మామంతవ్యమును ఖండింపఁబోయి వీరు తెచ్చుకొన్న ముప్పును చూడుడు. "భృగోఃసకాశాదభవచ్ఛుక్రోదైత్యగురుర్మహాన్"

అనఁగా శుక్రుడు భృగు ఋషి పుత్రుఁడు. "తాలశ్చ శంబర శ్చైవ కపిలః శంకర స్తథా। స్వర్భాను వృషపర్వాచ బాణ స్యైతేసుతాఃద్విజాః" అనగా సింహికా గర్భమందు బాణాసురునకుఁ గలిగినవాడు రాహువని సౌరపురాణమునఁగలగు "భారద్వాజకులోద్భవః క్షితిసుతః" ఇత్యాదిపురాణ ప్రమాణములవలన భారద్వాజ పుత్రుఁడంగారకుఁడు. అత్రిఋషి అనుసూయను వివాహమాడి చంద్రునిఁ గనక యుండినప్పుడును, చంద్రుఁడు బుధునిఁగనక యుండినప్పుడున్ను, సూర్యుఁడు శనైశ్చరుని బడయకుండి నప్పుడున్ను గ్రహములెన్ని ? వీరు జన్మించక పూర్వము జన్మకుండలులలో నెన్ని గ్రహములు వ్రాయఁబడుచుండెను? ఇది సనాతనమని వ్రాసినవారికి సిగ్గుగలదా? నవగ్రహ పూజ చేయు పాకయాజి శాస్త్రిగారు మ్లేచ్ఛపూజలు చెయువారనిన లజ్జయుండవలదా ? ఈ శూద్రోపాసకులు మనుష్యునకుగల వర్ణములు నాలుగును వేరు వేరుగా నుండక ప్రతివ్యక్తియందును యోగమై యున్నవని తెలియజాలక వర్ణముపనయనకాలమందు వచ్చునా ? లేక స్నాతక సమయమందు వచ్చునాయని కుళ్ళుంకల పాలైరి. గనుక తాము వ్రాసికొనినట్లు వారికిఁ జీవాట్లతో హితభోధ చేయక తప్పదు ఓ మ్లేచ్ఛ పూజకులారా ! మానవునియందుగల నాలుగు వర్ణములలో నేది ప్రాముఖ్యమని యెప్పుడు సాధ్యమగునో అప్పుడు తెలియవచ్చునని గ్రహించుడు. "మూర్ఖస్తు నవమో గ్రహః" యనునది మీయందు సార

కమైనది. మూర్ఖులు మిథ్యాగ్రంథములను ప్రమాణముగ నుద హరింతురు.

"రాహోశ్ఛాయాస్మృతః కేతు" యని రాహువుయొ క్క ఛాయయే కేతువని యున్నది. ఇట్టి కల్పిత గ్రహమునకు సంబంధముగ "కేతుం కృణ్వన్న కేతవే" యను మంత్రమును పఠించుటకలదు. నిరుక్తమందు కేతు శబ్దమునకు జ్ఞానము జ్యోతి యని యర్థముగలదు. ఈ మంత్రార్థమును భాష్యములోజూచి నిచో గ్రహమున కేమియు సంబంధములేదని విశదమగుచు న్నది. వర్ణవిషయమునందు గ్రహసంబంధమేమో తమకు యట్టి త్రవ్వి తలకెత్తునను భ్రాంతినిజెంది బిడ్డనెత్తుకొన్న సంతోషము లోబడి గుడ్డతొలిగినది చూచుకొనరైరి.

సోదరులారా! మీరు సనాతనమని తలంచిన విషయ ములెన్ని యసనాతనములో, మీరు సత్యమని భ్రమించిన వెన్ని సంగతులు మిథ్యలో, మీరు నిజమని భావించిన యంశ ములెన్ని మృషలో, మీరు సిద్ధమని వ్రాసిన వ్రాతలెన్ని యబద్ధములో, దురభిమానము విడిచి వివేచనచేయుడు. ఈక ల్పితకు పంథములో నీయజ్ఞానాంధ కారములో నీ కృత్రిమ మగు గర్తములో మీరు పడుట జాలక తా చెడ్డకోతి వన మెల్లజెడిచె నన్నట్లు మీ చుట్టునుండు వారినెల్ల జెడద్రోయ దలంచితిరా ? ఏల వంచకశిరోమణులను పేరుగాంచెదరు? సత్యమును గ్రహించుడు. మీ యందు బ్రాహ్మణవర్ణ గుణము ప్రధానమైయుండెనేని అట్లు చేయుదురు.

వీరు "రజస్వలా వివాహఖండన" మను గ్రంథమును
వ్రాసిరి. వీరికి హిందీభాష తెలియును. హిందీ భాషలో
"వైదిక వివాహాదర్శ" మను గ్రంథము బరోడావిద్యా
యిలాకా ఇన్‌స్పెక్టరుగారగు ఆత్మారాం అనువారు వ్రాసి
యున్నారు. దానిని పఠించినచో వీరుత్తరదేశపు సంగతిని గప్పి
పుచ్చి ఆంధ్రలోకమును వంచించుటకై ప్రయత్నించినట్లున్నది
"నవనార్యోనగచ్ఛేయుః నగచ్ఛేద్ద్వాభిస్త్రియుగ్మకం। పితాపు
త్రైర్నగంతవ్యం నగచ్ఛేద్ బ్రాహ్మణత్రయం" అని బోధిం
చుచు నాంధ్రులలో గలసమ్మేళన శక్తిని యైకమత్యమును
చెరుప బూనియున్నారు ఐనను మా వైదికాంధ్రగ్రంథ మాలిక
రూపమగు ప్రచండవాయు సంచార మీయాంధ్రదేశమున
సంచరించి యీయసనాతన యవైదిక యధర్మహర్మ్యము
యొక్క మూలములను ఛిన్నభిన్నము చేయుచున్నందున నది
ధడాధడఁ గూలి కడిపోవుచున్నది. గనుక వీరి ప్రయత్నమం
తయు వ్యర్థమైనది. వీరు ప్రతిజ్ఞాప్రవీణులై ప్రచండబహాదురులై
తమ గ్రంథములకు నుద్దండమగు పేరుఁబెట్టి యస్వాభావిక
మగు నగస్త్య జన్మములెన్నియెత్తినను సంభవాంశముల నాపో
శనముఁ జేయఁజాలరు. ఇది వృథయగు నున్మత్తప్రయత్నమని
శివపురపు వీరభద్ర పాకయాజిగారును చివుకుల అప్పయశాస్త్రి
గారును గ్రహింతురని నమ్మినారము.

శ్రీదయానంద సరస్వతీ స్వామిగారి ఛాయాపటమునుఁ
గాంచినవారికి విరాటుని కొలువుకూటములోనికి వచ్చినమల్లుని
యాకార వర్ణనము జ్ఞప్తికి వచ్చును." అని వ్రాసిరి. ఈవాక్య

మువలన పాకయాజి శాస్త్రులిరువురును గుణభ్రష్టులనియు చర్మపరిక్షకులనియు సిద్ధాంతమైనది. నిజముగా వీరు చెట్టుక్రింద విశ్రమించిన సింహమును చెట్టెక్కి వెక్కిరించిన మల్లులని తెల్ల మైనది.

వీరేదియో తమ స్వజాత్యాశ్రమ ధర్మరక్షణ భార మును వహించిరట. మానవజాతియొక్కటియని మేము నిరూ పించి యున్నారము. వీరు దాని నంగీకరింపక తమకు మానవే తర జాతియొకటి స్వంతముగ కలదని మానవ జాతినుండి స్వయం బహిష్కృతులైరి గనుకనే వీరు ప్రమాణ బద్ధమగు యుక్తియుక్తమగు సిద్ధాంతముల నొప్పుకొనక యున్నారు.

వీరు తమ గ్రంథములో [ర. వి. ఖం.] "మాదర్ చోద్-బేటీచోద్-బుడ్డీచోద్" మున్నగు మహాఘృణితములు మిక్కిలి యశ్లీలములగు బూతులు వ్రాసికొని అందరిది తమ వలెనే బూతుల పాండిత్యమని యున్మత్తప్రలాపములు ప్రేలు చున్నవారు.

(అస్తు.)

1. మేమీ వ్యాసమందు ప్రత్యక్షాది ప్రమాణములతో జాతి వేరు వర్ణము వేరనియును, ప్రతి మానవుడును చాతు ర్వర్ణ యుక్తుడై యున్నాడనియు, వర్ణములకు గుణకర్మ స్వభావ ప్రాముఖ్యములు హేతువులనియు సిద్ధాంతము చేసితిమి.

2. పాకయాజి శాస్త్రులుభయులును దస్యులనియు సనాతన ధర్మరక్షకులనియు చర్మపరీక్షకులనియు విశదపరచితిమి. వీరు జంతుహింసను జేయువారు.

3. వీరు వేద మెఱుంగని వేషధారులని లోకవంచకులని ప్రతిజ్ఞచే రూఢి పరచితిమి.

4. వీరి మతము నాస్తికమగు- గులాము మతమని చూపితిమి. వీరు శాక్తేయులు.

5. వీరిది-చాతుర్వర్ణ బాహ్యమునగు మరియు మనుష్యేతర మునగువింత జాతియని, మ్లేచ్ఛ పూజకులని, శూద్రోపాసకులని, సిద్ధము చేసితిమి.

6. వీరి బూతుల పాండిత్యమును వెల్లడి చేసితిమి.

7. వీరు స్వయంప్రతిజ్ఞాభంగకులై స్వనియమ భంజకులైరని విస్పష్టము చేసితిమి.

8. వీరు విపరీత చేతస్కులగు రాక్షసులని తీర్మానించితిమి. ఇదంతయు నాంధ్రప్రకాశికలో చూచియు వీరి శిష్యులు యన్. నాగవీరయ్య తమ గురువుల కక్షముగ నాంధ్ర ప్రకాశికలో (13-9-1917) మేము సరియైన ప్రత్యుత్తర మొకటేఁగూడ వ్రాయకుండుటంజేసి ప్రత్యుత్తరముగ తమ గురువు లేమియు వ్రాయరైరి యని ప్రచురించిరి. పాపము! యీ విద్యార్థికి మా వ్యాసముఁబఠించు సమయమందే కన్నులుఁగానరాక యంధత్వము ప్రాప్తించినందుకు వింతయగుచున్నది. అథవా వీరిగురువులగు వీరభద్రపాకయాజి గారికిని

అక్షయ్యశాస్త్రిలకును యిట్లేసంభవించియుండెను గాబోలు? ఇప్పుడైనను కండ్లకు కలికము వేసికొని యీ వ్యాసమును పఠించి తమదురాభిమానమును హఠమును మహాత్ములను వెక్కిరించు నైచ్యగుణమును త్యజించి స్వాత్మనిరీక్షణముం జేసికొని బాగుపడుదురని నమ్మినారము.

---

# శ్రాద్ధనిర్ణయము.

మొదట పిత్ృయాన దేవయానము లనగా నేమో విచారింతము. శతపథాది బ్రాహ్మణ గ్రంథములందును మన్వాదిస్మృతులయందును యుపనిషత్తులందును దేవయానముత్తరాయణము. పిత్ృయానము దక్షిణాయనము. దేవతలకు శుక్లపక్షమని, పితరులకు కృష్ణపక్షమని. దేవతలకు పగలని, పితరులకు రాత్రియని, దేవతలకు ప్రాతఃకాలమని, పితరులకు సాయంకాలమని, దేవతలకు పూర్ణమాసియని, పితరులకు అమావాస్యయని. దేవమార్గము జ్వాలయని, పిత్ృమార్గము ధూమమని. దేవతలకు పూర్వాహ్ణ సమయమని పితరులకు నపరాహ్ణమని దేవయాన పిత్ృయానములు చెప్పబడియున్నవి. ఇది పరస్పర విరోధ మున్నది. ఎట్లన-దేవయాన మగు నుత్తరాయనమందు పిత్ృయాన మగు కృష్ణపక్షమును రాత్రియును అమావాస్యయును గలవు. ఈలాగుననే పిత్ృయాన మగు దక్షిణాయనములో దేవయాన మగు శుక్లపక్షమును పూర్ణిమయును పగలునుగలవు. బ్రాహ్మణ గ్రంధములు అలంకార యుక్తములైయున్నవనియు, నవియే పురాణములని విద్వాంసులమతము. ఈ రహస్యములను తెలియకనే, మన భారతీయులు వివేచనలేక మిథ్యలను కల్పించినారు. ఇప్పుడువసంతో గ్రీష్మో వర్షాః తేదేవాఋతవ ♦ ♦ ♦ అహ రేవదేవాః రాత్రిఃపితరః పూర్వాహ్ణోదేవాః అపరాహ్ణః పితరః ఇత్యాదిశతపథ బ్రాహ్మ

ణవాక్యముల సంగతములని తోఁచుచున్నది. వసంతఋతువు నందు రాత్రులుగలవు గనుక రాత్రిపితరః యనుట విపరీతమ గుచున్నది. ఇది పూర్వాపర విరోధముని స్పష్టమగుచున్నది. అయి తే బ్రాహ్మణగ్రంథములలో మిగులగూఢాశయములున్నవి. అజ్ఞాను లీయాశయ మెఱుంగజాలక తప్పుద్రోవలఁ బడుచున్న వారు. చూడుడు. పితరుల సమయము క్రమక్రమమున క్షీణించు భాగమైయున్నది. దేవతలసమయము క్రమక్రమాభి వృద్ధిభాగ ముగనున్నది. అనగా పితరులసమయము అవనతిఅర్థాత్ నిరా శాసూచకమైయున్నది, దేవతలసమయము మున్నతిసూచకమైయు న్నది. దేవతలసమయమునకు విపరీతమైనది పితర సమయము దీనియందలి ముఖ్యాశయమేమన॥—— వృద్ధినొందుచుండువారు దేవతలని క్షీణించుచుండువారు పితరులని సారాంశమగుచున్నది. ఉన్నతియవనతులు రెండును రెండువిధములు. ఒకటి శారీరక సంబంధమైనది. రెండవది జ్ఞానసంబంధమైనది. జన్మము మొదలు యవ్వనావస్థ పర్యంతము శరీరవృద్ధియు, తత్పశ్చాత్ యౌవనము మొదలు మరణ పర్యంతము క్షీణమును, సంభ వించును. ఇదే విధమున సత్యవిద్య సత్యాచరణములను పాలించుటయందును వృద్ధిక్షయము లుండును. అది జ్ఞానసం బంధమైనది. ఇచ్చట ప్రాకృతిక యుపమానముతో జీవాత్మ యొక్కగతి చూపింపఁబడియున్నది. సూర్యుండు జ్యేష్ఠ మాసమువరకు మహా తేజముగలవాఁడై అక్కడినుండి మార్గ శిర పుష్యమాసములు వచ్చునప్పటికి మందతేజుఁ డగుచు న్నాడు. అర్థాత్ సూర్యుఁడుత్తరాయనమందు పరమప్రచండ

కిరణములతో వృద్ధినొందుచు దక్షిణాయనమందు క్రమముగా తేజోహ్రాసము గల వాడగుచున్నాడు. ఇట్లె జీవుడు బాల్యా వస్థనుంచి యౌవన పర్యంతము నానారీతులచే వృద్ధియగు చున్నాడు. తరువాత దక్షిణాయనమందలి సూర్యునివలె యౌవనావస్థనుండి సర్వము క్షీణించుచు నొక నాడ స్తమించు చున్నాడు. ఈశ్వర నియమానుసారముగ సూర్యుడుసయిత మొక కాలమందు తేజహీనుడై పడిపోవుచున్నాడు. ఈలాగు ననే శుక్ల కృష్ణ పక్షములను, పగలు రాత్రులను దేవ పిత రులకు నుపవాసముగ చెప్పబడియున్నవి. ఇది వైదిక ధర్మోప దేశము. ఓ పితృజనులారా! సూర్య చంద్రులకువలె మీకును రెండుదశలున్నవి. ప్రథమదశ దాటిపోయినది. ఇప్పుడింద్రియ ములు శిథిలమగుచున్నవి. ఇఁక నమావాస్య తిథియందలి చంద్రునివలె నొక దినమం దవశ్యము మీరును అస్తమింపక తప్పదు. మీరు యౌవన దశవరకు దేవతలై వృద్ధికివచ్చితిరి. ఇప్పుడు పితృదశ సంప్రాప్తమై యున్నది. ఓ వృద్ధపితృలారా! మీరు బ్రహ్మధ్యానమందు చిత్తమును నిలుపవలయు ను. రాత్రివచ్చుచున్నది, వెంటనే అంధకారమావరించు చున్నది. నక్షత్రములు మినుకు మినుకుమని కించిత్ప్రకాశ మునిచ్చును, వృద్ధులారా! యద్యపి పగటితో సమానముగా నిప్పుడు మీ ప్రతాపములు లేవు. మీరుసర్వాంశములందును అసమర్థులైతిరి. తథాపి రాత్రివలె మీజీవనాకాశరూప మగు హృదయములందు కొంచెము ప్రకాశ శేషమున్నది. అందుబుద్ధి రూప ములగునక్షత్రములు విద్యమానమైయు

న్నవి. కృష్ణపక్షచంద్రుడు నక్షత్రముల సహాయముతో రాత్రిని శోభింపఁజేయుచు ప్రాణులకు సుఖమును ప్రసాదించు విధముననింద్రియ రూప నక్షత్రముల సహాయముతో ఆత్మచంద్రుఁడు తనరూప నిశియందు వికసితుఁడై యథాశక్తి తోఁడి జీవులకు సుఖ ప్రదానముచేయు చుండవలెను. దినరూపమగు యౌవనము అర్థాత్ దేవయానము గతించినది. ఇపుడు జరారూపమగు రాత్రి ప్రవేశించినది. తేజము శూన్యమైనది. ఈరవంత యుష్ణమున్నంతలో కర్మణ్యుఁడవుకమ్ము! శీతలమావరించియున్నది. పితృలారా! లెండు లెండు!! చూడుడమావాస్య రాబోవుచున్నది. అప్పుడు సాయంకాలమునుండి ప్రాతఃకాలమువరకు నంధకారముగనే యుండును. చంద్రుడస్తమించును. మీ ఆత్మ చంద్రుడును అవశ్యముగ నస్తమించును. ఈశ్వరోపాసనము నల్పుడు కల్యాణము చేకూరును పాఠకులారా! కొంచెము ధ్యానించిన నిదియూపమిక (ఊపమాలంకారము ద్వారా) సదుపదేశమనియు, నిది జీవిత పితురులయందు ఘటించునుగాని, మృత పితరులకుఁ గాదనియు, విదితమగుచున్నది. తప్పక నీయుపమా ప్రదర్శిత సదుపదేశము నితాంతముగా జీవిత పితురుల కొరకు గాని, మృతపితురులకుఁ గానేరదు. మానవ జీవనోద్దేశమున కెటువంటి మనోహరమగు ప్రాకృతిక యుపమాలంకారముతో మార్గము బోధింపఁబడినదో చూడుడు. మృతపితురులీ యుపమానయుక్త శిక్షణమున తమజీవన సుధారణమును చేసికొనగలరా? మృతపితరు లెచ్చటనయిన తాము సూర్యచంద్రుల



వలె నిస్తేజనిర్బల నిర్బుద్ధి నిరారోగ్యములచే క్షీణించుచు, రాత్రితో తుల్యముగను అమావాస్యవలెను, తాము అంధకారవృతమున బడుదుమని తలంచుట సంభవమా? ఇట్టి ఆధ్యాత్మిక భావమును చచ్చినవారు గ్రహింపగలరా? గనుక పితృయజ్ఞము జీవిత పితరులకేగాని, మృతులకు కానేరదు. ఇది దక్షిణాయన ఉత్తరాయన సమయములచేత సయితము సిద్ధమగుచున్నది. మరియు దేవయాన పితృ యానములలోని పరస్పర విరోదాంశము సయిత మీయుపమానార్థకమువలన తేటతెల్లముగ నివారణమగుచున్నది.

## పితృగణము-రాత్రి.

పితృశబ్దముయొక్క అర్థము పాలకులు. అథవారక్షకులని యగుచున్నది. రాత్రులందు రక్షణ మత్యంతావశ్యకమగు చున్నది. రాత్రి రక్షణమునకు ప్రభుత్వము వారనేక విధములగు సాధనములకై మితిలేని ద్రవ్యమును వ్యయపరచు చున్నారు. అట్లేయ కాలమందీలాగే యుండినది. రాత్రులందు చోరత్వాది దుష్టకార్యములు చేయువారికి రాత్రిచరులుఅథవా నరనిశాచరులని పేరు. పూర్వకాలమందట్టి దుష్టులు రాత్రులందు గృహస్థులను నానావిధముల బాధించుచుండిరి. వారి యుపద్రవములనుండి రక్షణము చేసి ప్రజలను సుఖస్థితియందుంచువారును రాత్రిపూట ప్రజలనురక్షించువారు జీవితపితరులగుదురుగాని మృతపితరులుకారు. ఇట్లు పితృలు చేయురక్షణకర్మకు "స్వధా" యనిపేరు. వారు



రాత్రి కాలమునందు రక్షణముకొఱకు యత్నము చేయుచుండు నప్పుడు వారిధ్వజాదుల పైస్వధా శబ్దము చిహ్నముగా వ్రాయ బడుచుండు పద్ధతికలదు. అమావాస్యయందు పితృయజ్ఞమవ స్యము చేయవలసిన విధియును, జీవితపితరులయొక్క సేవాది వ్రతము తెలియజేయుచున్నది. అమావాస్యయందంధకార మధికమగుచున్నది. అప్పుడుచోరాదిదుష్టులకు మంచి యను కూలసమయముగనుక రక్షకపితరులు మిక్కిలిజాగ్రతతో గృహస్థులను రక్షించవలెను. ఈతిథియందు పితృగణము యొక్క యావశ్యకతను గృహస్థులధికముగ నపేక్షింతురు గావున నమావాస్యతిథియందు [రక్షకగణము] లకు పుష్టికా రకములగు భోజనము పెట్టి గౌరవించుచుండిరి. గనుక పితృ యజ్ఞము జీవితపితృల కన్వయించునుగాని, మృతులకుగానేరదు. సంధ్య మొదలు రాత్రియంతయు పితృలు గృహస్థులను రక్షిం తురు. సంధ్యాకాలమునకు ప్రదోషాయని పేరు. అర్థాత్ రాత్రిలో ననేకదోషములు సంభవించును. సంధ్యాసమయము వచ్చినతోడనే చోరులు జారులు ప్రసన్నహృదయులగుచు తమకు కర్మలకును భోగవిలాసము కిదిమంచిముహూర్తమని సంతోషింతురు. దుష్టమృగములు తమనివాసమునుండి ప్రాణిపీ డనముకొఱకు బయలుదేరును. ఈవిపత్తులనుంచి రక్షించుటకు పితృలు అర్థాత్ రక్షకగణము తమతమ నియుక్తస్థానములుచేరి ఆయుధ ధారులై సంధ్యసమయమందు సిద్ధమగుదురు. గనుక సంధ్యాకాలమునకు పితృ ప్రసూయను పేరు వచ్చినది "సాయం సంధ్యాపితృప్రసూ" అని యమరము. ఈశబ్దములవలన సంయు

తము శ్రార్ధకర్మజీవిత పితృలందు వర్తించునని సిద్ధమగుచు న్నది.

[పితృగణము-దక్షిణాయనము]

పూర్వకాలమున మనుష్యసమూహమందు క్షేత్రికార్యమతి ప్రాముఖ్యమైనదిగా నుండినది, దక్షిణాయనము వర్షమునకు ప్రారంభసమయము గనుక గృహస్థులందఱును అసమర్థులగు స్త్రీబాలక గణములను గృహములలో విడచి క్షేత్రకార్యములందు తత్పరులై యుండెడివారు, శరదృతువు ఆశ్వయుజమునుండి ప్రారంభమగును. అప్పుడు వృద్ధులకు వ్యాధిబాధ లధికము గావున వృద్ధ పితరుల సంరక్షణ మత్యంతావశ్యకము. ఈకారణములచే రక్షక పితృగణముయొక్క యావశ్యక మధికముగ తమ కార్యము చేయవలసియుండెను, గనుక పితృ శ్రార్ధ మాకాలమున విశేషరూపమున వర్ణింపఁబడియున్నది. సూర్యుడు దక్షిణదిశకు వచ్చినప్పుడెట్లు క్షీణతేజు డగునో అట్లు వృద్ధులయొక్కయు, వానప్రస్థులయొక్కయు దశలు మిగుల న్యూనమగును. అప్పుడే సాధారణముగ యుద్ధ యాత్రలు జరుగుచుండెను. దేశ రక్షణమందు రక్షక పితృగణ మత్యంతశ్రద్ధగలవారై యుండవలయును. రక్షక పితృలలో నెవరు పదార్థ రసాయనవిద్య భౌతిక, నక్షత్ర, శారీరక విద్యలను చక్కగ నెఱింగియుందురో వారికి సోమసద పితరులనిపేరు. విద్యుత్ బాష్పాదుల ప్రయోగములందు నిపుణులై యుండువారు అగ్ని

ష్వాత్త పితరులనఁబడుదురు. జ్ఞానోపదేశకులై ధర్మోద్ధారకులగు వారు బర్హిషదపితరులనఁబడుదురు ఆయుర్వేదపారంగతులైన వారు సోమసద అథవాసోమపాపితరు లనఁ బడుదురు. కేవల సాత్వికాహారులు సాధులు సత్వగుణప్రధానులైనవారుహవిర్భుజ ఆజ్యపాలీను లనఁబడుదురు. నిష్పక్షపాత నిర్భయగుణయుక్తులై దుష్టజనశిక్షణమునుశిష్టజనసంరక్షణమును జేయువారు యమనామకపితరులనబడుదురు వీరికి పిత,పితామహ,దేవ, యమ చతుర్ముఖాది నామములు వైదికసంధమగుబిరుదునామములు. ఈపితరులందరును యాగాది కర్మలందు గౌరవింపఁబడుట కర్హులు. పితృసంబంధమగు కర్మలలో స్వధాశబ్దమును దేవసంబంధమగు కర్మలలో స్వాహాశబ్దమును వాడఁబడుచుండెను. కొన్నిచోట్ల పితృభార్య స్వధాయనియు నగ్నిభార్య స్వాహాయనియుగలదు. పితరులనేకులుగాని, యొకరుకాదు. గనుక పితృగణమని చెప్పబడుచున్నది. అనేకుల కొక్క-భార్యయెట్లు సంగతమగుచున్నది? గనుక నిందలి భావమువేఱు. ఎట్లు విద్వాంసులకు ఆచార్య ఉపాధ్యాయ, పాఠక, గురు, బోధకాదిపదవులును, పరాక్రమవంతులగు వీరులకు మహావీర, యోద్ధా, బహాదుర, దేవేంద్ర, నరేంద్రాది పదవులును గలవో, యాలాగుననే పితరులకు సామాన్యపదవిస్వధా యగుచున్నది. విశేషపదవులు అగ్నిష్వాత్త బర్హిషదాదులైయున్నవి. ఏశక్తిచేత స్వీయపరివార, ధన, ధర్మ, కర్మ, దేశ, దేశాంతరముల యొక్క- ధారణ పోషణ రక్షణాదులు జరుగునో దానికి 'స్వధా' యనిపేరు. ప్రకృతిని నయితము స్వధాయనుటకలదు. ఏదిస్వభావమును

విడువక ధరించియుండునో దానికి స్వధాయనిపేరు. స్వధాశబ్ద మన్న జలాదులందును వర్తించెను. కొందరు నికృష్టులు తమ మాతాపితృలు వృద్ధులై సంపాదనమందసమర్థులైశారీరిక దశలు శిశువునకుఁ దుల్యములై బలహీనులై తమ సహాయ మపేక్షించు సమయమందు వారికి అన్నపానాదుల విష యములోను, సేవాశుశ్రూషయందును, నిర్లక్ష్యముగ నుండుట కలదు. గనుక వేదవాణి "ఓమానవులారా! మీవృద్ధతమ, పితరులకు నాహార పానీయాదులచేతను, శీత వాతాది బాధలనుండియు, రక్షించుచు, శ్రద్ధతో నుపచారము చేయుడు అని బోధించుచున్నది. గనుక శ్రాదము జీవితపితరు లకుఁగాని మృతపితరులకుఁ గానేరదు. "నమో దేవేభ్యః స్వధాపితృభ్యః" అని గలదు. నవయావనులకు నమశ్శబ్దమును పితలకు స్వధాశబ్దము వాడఁబడి యున్నది. సర్వవిధముల నున్నతిఁ బొందుచుండు నవయువకులు దేవగణమనియు, న్యూనత బొందుచుండువారు పితృగణమనియు నిదిపఱకే చెప్పఁ బడియున్నది. స్వధాయొక మూర్తిమతియగు స్త్రీకాదు. వైదికకోశమందు, అన్న జలబుతు, ప్రకృతి, స్వభావ, ధర్మ గుణ, మార్గాధారణ, పోషణకర్త ఇత్యాదులకు స్వధా యని పేరు. పురాణములందుగల కథలన్నియు వేద విరుద్ధము లగు కల్పితగాథలై యున్నవి.

## యముఁడెవరు ?

ఈ పితృ శ్రాద్ధవిషయమందు యమశబ్దము వచ్చు చున్నది. పితరుల యధిపతికి యముడనిపేరు. విద్వాంసు లనే

కులు యముఁడు సూర్యపుత్రుఁడని చెప్పుచున్నారు. సూర్యుఁడు మనుష్యునివలె చేతనుఁడుకాడు. జడమునుండి చేతనుఁడగు పుత్రుఁ డుత్పత్తియగుట కేవల మసంభవము. సూర్యుఁడొక తేజోమయమగు గోళము. భూమిపై యున్న మును ప్రకాశమును కలుగఁజేయుటకై యీశ్వరుని వలన స్థాపింపఁ బడిన జడపదార్థము. జడమునకు కలిగినది జడముగానే యుండ వలెను. గనుక నిస్సందేహముగ సూర్యునివలన గలిగినఁ పుత్రుఁడు దినము అథవా కాలమని చెప్పవలయును. "కాలో దండధరః శ్రాద్ధదేవో వైవస్వతోఽంతకః" అని కోశము గలదు. గాన యమశబ్దమునకు దినమని యమీశబ్దమునకు రాత్రియని అర్థము. సూర్యునకు పగలు పుత్రుడని రాత్రి పుత్రికయని వైదికసిద్ధాంతము. వేదాశయ మెరుఁగని వా రనేక కథలను కల్పించి యున్నవారు. త్వష్టాయనునతనికి సరణ్యూయనుపుత్రి కయు త్రిశిరాయను పుత్రుఁడు కలిగెననియు, సరణ్యూ వివ స్వానునకు యమ యమీయను సంతతికలిగెననియు నిత్యాదిగా కథలుగలవు. బ్రాహ్మముహూర్త దృశ్యమునకు త్వష్టాయని పేరు. ఈబ్రాహ్మముహూర్తమందు కించిత్ప్రకాశ యుక్తమగు పరిభాషత్పన్న మగుచున్నది. ఉషాయననుమః కాలమునఁబ డును. ఇత్యాదిప్రాకృతిక దృశ్యములు కథారూపముగ వర్ణిం పఁబడియున్నది, ఉషా-సరణ్యూ సరమా-ఊర్వశీత్యాది నామ ములు పర్యాయశబ్దములు సూర్యోదయమైన తోడనే మనము ధర్మకార్యములు ప్రారంభించు చున్నారము. గావున సూర్యు నకు ధర్మరాజనిపేరు ప్రకాశములేకుండ జీవుడు కార్యానుష్ఠాన

మునకు యోగ్యుడు కాజాలడు. అఖండమగు నీకాలము సూర్యు నివలనగలుగుచున్నది. ఈకాలమునకే యముఁడని, ధర్మరాజని, మృత్యువని, పి తృ ప తి య ని పే రు. వృద్ధులగు పితరుల సంగతిలో ప్రతిక్షణమును యముఁడు అథాత్ మృత్యువు సంబంధించియే యుండును. కొందరీదినము! చనిపోవు చున్నారు. కొందరు రేపటిదినము మృత్యువుపాలగుదురు. మఱికొందరు మఱునాడు మరణించెదరు. ప్రతిసమయమందును వృద్ధస్త్రీపురుషులు చచ్చుచునేయుందురు. యముడు తన యధి కారములు పూర్ణముగ పితరులపై జూపుచున్నాడు. ఈకార ణముచేత యముడు పితృపతి యనఁబడుచున్నాడు. పితృశబ్దము తోటి యమశబ్దము ప్రయోగార్హమై యున్నది. ఈ దృశ్యము వానప్రస్థాశ్రమములో నుండు మాతాపితా పితామహీ పితా మహ ప్రపితామహీ ప్రపితామహులందు మిక్కిలి యగుపడు చుండును. ఉపర్యుక్త మూడువిధములగు పితరులయందు యముని ప్రతాపము పూర్తిగ ప్రతీతమగు చుండును. అతని రాజ్యమీ మూడువిధములగు వృదపితరులతో జరుపఁబడు చున్నది. గనుక యముఁడు పితృపతియని వర్ణింపఁబడియున్నది. యముఁడనగా సూర్యునికిని యర్థమగుచున్నది. పితృశబ్దము ఋతువులకు వాడఁబడుచున్నది గనుక వైదిక సంకేతమందు సూర్యుడు పితృపతియగు చున్నాడు. రక్షకులకు పితరులని పేరు. వీరికి యధిపతియగు న్యాయాధీశుఁడు కూడ పితృపతి యగుచున్నాడు. పితరశబ్దము సూర్యకిరణములకు వాడఁబడి యున్నది. గనుక పితృపతి యనగా సూర్యుడని యర్థమగు

చున్నది. ఈ యన్నింటికి వేదమందు "యమః పితౄణామధిపతిః యమః పృథివ్యా అధిపతిః" ఇత్యాది ప్రయోగములు గలవు.

## యమదూతలు.

యముఁడనగా మహాకాలవాచకమని యింతవరకు వ్రాసిన యంశములవలన సిద్ధమైనది. క్షణము, నిమేషము, ప్రహరము, దినము, రాత్రి, పక్షము, మాసము మొదలగునవి యన్నియు కాలమునకు నవయవములై యున్నవి. అఖండమగు మహాకాలమున క్షణపలాదులు దూతలుగా గణింపఁబడియున్నవి. మహాకాలయముడు తన యధీనములోనిక్షణ! ప్రహరాది దూతలనుబంపి ప్రాణములను హరించుచున్నాడు. ఈ యలంకారము నెరుఁగనివారు యముఁడను వానిని యమలోకమును యమదూతలను కల్పించి నానా విధములగు గాథలను పురాణములను రచించియున్నవారు. పగలు రాత్రి యీ రెంటిని యమరాజుయొక్క కుక్కలని చెప్పబడియున్నది. ఈ పగలును రాత్రియు రెండును కుక్కల వలెనే ప్రాణులకు పరమభక్తిగల రక్షకములై యున్నవి. వీనిని సమ్యక్ రీతిని పోషించవలయును. అన్యథాయివి రెండు నున్మత్తములై జీవులను కఱచుచున్నవి. ఈదినరాత్రి రూపములగు సారమేయములు కఱచిన తరువాత యారోగమునుండి ముక్తుఁడగుట యతిదుస్తరమగును. ఈ దివారాత్రి రూప శునకములు సదాచార సత్కర్మపరులను రక్షించును. దురా

చార దుష్టకర్మ పరులను భక్షించును. అహోరాత్రాత్మక శునకములవర్ణనము అలంకార రూపమున వేదమునందు "అతి ద్రవసారమే యాశ్వానౌ"యను ఋక్కునందు విస్పష్టముగ చెప్పబడియున్న యది.

## చిత్రగుప్తుఁడు

ఎప్పుడు యమదేవత యొక్క చైతన్యదేవత కాదని సిద్ధమైనదో అప్పుడు యమునిలేఖకుఁడగు చిత్రగుప్తుఁడును చేతన దేవతకాదని సిద్ధమైనది. అంతఃకరణమునకు చిత్తమనిపేరు. మనము చూచెడునట్టియు వినునట్టియు వినుపించునట్టియు మంచిచెడుగులన్నింటియొక్క ఛాయ తప్పక మన యంతఃకరణ రూపమగు ఫలకముపై చిత్రింపఁబడుచుండును. ఎట్లు ఫోనో గ్రాఫ్ యను యంత్రము మనశబ్దములను ఫలకముపై చిత్రించునో అట్లు మనయంతఃకరణ ఫలకము సమస్తకర్మలయొక్క చిత్రమును ధరించుచున్నది. దానినే మనము కర్మరేఖయనెదము. అదిబాహ్యమునకు తెలియక గుప్తముగ నుండుటచే చిత్రగుప్తమనఁబడును.

అహోరాత్రాత్మక కాల యముడందరిని చంపువాడని తెలియును. కాలయమునివలననే మన యాయువు కొలత వేయబడుచున్నది. కాలమే మృత్యువునకు కారణము. అందుచేత కాలమునకు మృత్యువని పేరు వచ్చినది. ముఖ్యముగ వృద్ధుల హస్తములను సర్వదా మృత్యువుతన చేతులతో పట్టుకొని యుండును. వారితో మృత్యువు సదా

క్రీడించుచుండును. వృద్ధుల శరీరమందు మృత్యుదేవత విరాజ మానమై యుండును. వారికి ప్రత్యక్షమై యుండును. వారిప్పుడు కన్నులతో చూడజాలరు; చెవులతో వినజాలరు. ఇంద్రియములన్ని క్రియలనుండి నివృత్తమై యున్నవి. వారి యెదుట యమరాజు విరాజమానమైయున్నాడు. ఈకారణము చేత కాలరూపుడగు యముడు పితృపతియనఁబడుచున్నాడు. పితృశబ్ధమునకు పితరులు - పాలకులు - సూర్యకిరణములు అని మూడర్థములు గలవు. సూర్యకిరణములు వినా అహోరాత్రాత్మక కాలమెట్లుఘటించును? గనుక పితృశబ్దమునకు యమ శబ్దమధిక సంబంధము గలిగి యున్నది. యమశబ్దమునకు నీశ్వరుఁడని వాయువని మఱి రెండర్థములు గలవు. యమసూక్తము నందు ఈశ్వరుఁడని భాష్యకారులు వ్రాసిరి. ఉపర్యుక్తమగు నంశములవలన యముఁడును పురుషదేవతగాని, యమలోకము గాని, యమదూతలుగాని లేవనియు గరుడపురాణాదులు గాధలనియు కల్పితమనియు, తెల్లమగుచున్నది.

ఇంతవరకు పితరు లెవరను యంశము నిరూపణము చేయఁబడెను. ఈ యంశమును యోచించి చూచినచో శ్రాద్ధము మృతపురుషుల కెంతమాత్రము సంబంధము లేదనియు వృద్ధులగు జీవిత పితరులకు శ్రద్ధతో నుపచారము సల్పుటయే శ్రాద్ధమనియు విస్పష్టమగుచున్నది.

### పితరులు — ప్రాచీనావీతి.

ఈ విధి సయితము జీవిత పితృశ్రాద్ధమును సిద్ధపరచు చున్నది. "ఉద్ధృతే దక్షిణేపాణావుపవీ త్యుచ్యతే ద్విజః సవ్యే

ప్రాచీన ఆవీతీ నివీతి కంఠసజ్జనే" (మ 2_63) అర్థాత్ పూర్వకాలమునందు యజ్ఞోపవీతము మూడువిధముల ధరింపఁ బడుచుండెను. ఒకటి దక్షిణపార్శ్వమున, రెండు వామపార్శ్వమున, మూడు కంఠమందు ధరించుట కలదు. ఈ యాచారము సాధారణమయిన నియమము. బ్రహ్మచర్య గృహాశ్రమములందు పవీతము దక్షిణముగ ధరింపఁ బడుచుండెను. దీనికి "ఉపవీతి" యనిపేరు. వానప్రస్థమందు యిది వామభాగమున ధరింపఁబడు చుండెను. ఇది 'ప్రాచీనావీతి' యనఁబడుచుండెను. "అథై నంపితరః ప్రాచీనావీతినః సవ్యం జాన్వాచ్య ఉపాసీదన్" [శతపథ] అని పితరవిశేషణమందు ప్రాచీనావీన్ శబ్దము వాడఁ బడు చుండెను. యజ్ఞోపవీతము కర్మసూచకమని యందరెఱింగిన విషయమేకదా? ఎంతవఱకు దక్షిణాంగముతో తుల్యముగ బల వీర్యాదిసాధనములు పుష్టములై యుండునో, అంతవరకు గృహమందు ఉపవీతియైయుండి, యెప్పుడు వామాంగముతో సమానముగ బలవీర్యాదులు శిథిలములగుచుండునో, అప్పుడు వానప్రస్థుఁడై ప్రాచీనావీతి యగుచుండెను. అర్థాత్ మానవుని కార్యములన్నియు వామాంగమువలె శిథిలప్రాయములైనందుకు సూచకముగ ప్రాచీనావీతి పద్ధతి యవలంబనీయమై యుండినది. ఈ సంకేతము కేవలము జీవితులయందు ఘటించును గాని, మృతులైనవారియందు ఘటింపదు. మృతక శ్రాద్ధము ప్రచలితమైన తరువాత ననేక కల్పిత తంత్రశ్లోకములును క్రియలును కల్పితములై ప్రమాణ పీఠము నెక్కి సత్యమును జయింపజూచుచున్నవి. యువావస్థ

వరకు యజ్ఞోపవీతము దక్షిణభాగమందుండుటకు మానవుఁడీ యవస్థవరకు నధికకర్మ పరాయణుఁడని పౌరుషయుక్తుఁడని సూచించుట యగుచున్నది. తద్వాతు మనుష్యుఁడు సయితము యౌవనావస్థ పర్యంతము బలిష్ఠుఁడై సత్కర్మపరాయణుఁడై యుండును. ఎప్పుడు యౌవనము గళితమగునో అప్పుడు వామాంగమువలె శిథిలమగు స్వల్పకర్మ పరాయణత్వము ప్రాప్తించుచున్నది. గనుక తృతీయాశ్రమములోనుండు పితృలు తమస్థితి కనుగుణ్యముగ ప్రాచీనావీతు లగుచున్నారు. ఈ చిహ్నము నితాంతముగ జీవిత పితరుల కన్వయించుచున్నది. గాని మృతపితరుల కెంతమాత్రి మన్వయించదు.

॥ పితృలు — చంద్రలోకము ॥

అ వైదికులు, నవివేకులు, సనాతన ధర్మ రక్షక నామధారులు కొందరు చంద్రిగోళమును పితృలోక మని నమ్మచున్నారు. అది కేవల మసంగతము. పితరులు చంద్రలోక నివాసులైనప్పుడు వారు చంద్రప్రియులై యుండవలయును. దాని ననుసరించి పితృయానము శుక్లపక్ష పూర్ణిమ తిథులై యుండవలెను. అట్లుగాక, కృష్ణపక్ష యమావాస్యలు పితృయానమందున్నవి. చంద్రలోకమందు గల పితరులు అమృత పానము చేయువలెను. అట్టి వారికి పృథివియందు యిడబడు పిండములతో ననావశ్యకము.

చందామృతము దేవతలకొరకుగాని, పితృవులకుఁ గాదని యనెదరేమో? అట్లయిన పితరు లచ్చట నివసించుట

వృథాయగును. కృష్ణపక్షములో నమృతముఁ ద్రావుచుండి యమావాస్యయందు నమృతము లభింపనందున పితృలకమావాస్యనాడు శ్రాద్ధ మవశ్యము చేయవలెనన్నచో, చేసినవారు తప్పక అమరులగుదురు. పురాణము లిట్లు చెప్పియున్నవి కించిత్ అమృతము వలన రాహుకేతువు లమరపదవినిఁ బొంది యిప్పటికిని జీవించియున్నారు. ఈ స్థితిలో పితరు లొకదినము తిండిలేక యుండరన్న నెంతటి యసంగతము ?

సౌమ్యశబ్దము పితృశబ్దముయొక్క పర్యాయ పదమని కొందరు చెప్పిదరు. సోముని యాదుండువారు గాన సౌమ్యులనఁబడుదురని వారి యభిప్రాయము. అట్లుకాదు సోమసంపాదకులకు సౌమ్యులని పేరు. ప్రాథమిక సమయమందు పితరులు సోమరసమును బలవీర్యాదులయొక్క వృద్ధికొరకు సేవించుచుండిరి. మరియు పితరులకు చంద్రుని సహాయ మత్యంత సహాయకము. చంద్రునిపేరు సోముఁడనిగలదు. సోమలతకును చంద్రునకును అర్థముగల సోమ శబ్దమే యీ ప్రవాదమునకు కారణమైయున్నది. పితరులకు సోమలతయును చంద్రుఁడును పరమ సహాయకములైనవి. గనుక నీ సంబంధము ప్రచలితమైనది. ఇదియుంగాక శ్రుతమందు "సర్వేషా మేనసోమానాం పత్రాణి దశపంచచ। యని శుక్లే చ కృష్ణే చ జయంతే నివతంతిచ। ఏకైకంజాయతేపత్రం సోమస్యా హరహ స్తథా। శుక్లస్య పౌర్ణమాస్యాంతు భవేత్ పంచ దశచ్ఛదః।" చంద్రుఁడెట్లు శుక్లపక్షమం దొక్కొక్క కళవంతున వృద్ధినొంది, కృష్ణపక్షమందు క్షీణించునో - అట్లు సోమలతయు

శుక్లపక్షమున నొక్కొక్క పత్రముగా వృద్ధిని బొంది కృష్ణ పక్షమునం దొక్కొక్క పత్రము రాలిపోవు చుండునని చెప్పఁబడినది. కావున సోమలతా చంద్రులయొక్క వర్ణనము సమానముగ నున్నది. మఱియు చంద్రుఁడు ఓషధీశుడు. ఇప్పుడు పితృలు చంద్రలోకమం దమృతపానము చేయుచుందురనుదాని యాశయము చదువరులకు వేద్యమయ్యెను గదా ?

సోమలతయే, చంద్రలోకము; దాని రసపానమే అమృతపానము. సోమరస ప్రధానముచేత ననేక పదార్థములు చేర్చి యొక రసమును తయారుచేసి పూర్వకాలమున బలాభివృద్ధి కొరకు పానము చేయుచుండిరి అది పౌరాణికుల కాలమందు చంద్రలోకమందలి యమృతముగ పరివర్తనమై నభించుట శూన్యమయ్యెను.

## పి తృ భో జ న ము.

"హవ్యకవ్యైర్దైవ పిత్రేఅన్నే పాత్రే సువాదికం" దేవాన్నము హవ్యమని పిత్రన్నము కవ్యమని చెప్పఁబడి యున్నది. కవిశబ్దము కావ్యకర్తయందును జ్ఞానియందును వర్తించును. 'కవిర్మనీషీధిషణాధీః ప్రజ్ఞాశేముషీమతిః' యని కోశము వృద్ధులకును దేశరక్షకులకును పితరులని పేరు. వృద్ధపితా - పితామహ-ప్రపితామహుల భోజనముకొరకు పరమచతురులును, పాకశాస్త్ర తత్వవేత్తలునగువారు, పాకమును సిద్ధపరచవలయును. ఎందుకన మిక్కిలి వృద్ధులగు పితరులకు శీఘ్రముగ జీర్ణించునట్టియు, జీర్ణించిన పిమ్మట, వానివలన పితరులకేవిధ

మైన పీడ కలుగజేయునట్టియు, శుద్ధమైనట్టియు, బలవర్ధకమై నట్టియు, పాకమును సిద్ధపరచవలయును. లేనిచో, పితృలకు నాపద సంభవించి యామూలముగ నన్నదాతకు పాపము సంభవించును. గనుక పూర్వకాలమందు మంచి యనుభవజ్ఞులగు వంటవారిని నియమించుచుండిరి. అట్టి కవులు సిద్ధము చేసిన యాహారమునకు కవ్యమని పేరు. ఈ యంశమువలన సంయుతము శ్రాద్ధము, జీవితపితరులకు, చేయదగినదనియు, మృతపితరులకుఁ గాదనియు సిద్ధాంతమగుచున్నది. అగ్నిష్టోమ, రాజసూయఁ, అశ్వమేధము, మొదలగు గొప్ప యజ్ఞముల యందు పితృగణములు పిలువఁబడుచుండిరి. ఇట్టి సమయము లందు పితరుల ఆమంత్రణమున ఋషులు కొన్నిటి నియమములు విధించియున్నారు. అజ్ఞాని, కుటిలుఁడు, దాంభికుడు, నాస్తికుడు మున్నగువారు ఆమంత్రణమున కర్హులుగారని చెప్పియున్నారు. కేవల వానప్రస్థాశ్రమీయైన మాత్రమున చాలదు. ధార్మికుఁడుగా నుండవలెనని ఋష్యాదులమంతవ్యము. సాధారణ పితృయజ్ఞములయందు యీ నియమము లేదు. ఈ యంశములను వివేచనచేసి చూచినను, శ్రాద్ధము జీవితుల కన్వయించునుగాని, మృతుల కన్వయించుట లేదు.

పితా - పితామహ - ప్రపితామహులకు ముగ్గురికి మాత్రమే శ్రాద్ధము చేయవలెనను విధికలదు. కొందరిప్పుడును ప్రపౌత్రులు గలవా రచ్చటచ్చట గలరు. ప్రపౌత్రులు గృహస్థులగువరకు జీవించెడు ప్రపితామహులుందురు. ఈ మూడు విధములగు పితృలకే శ్రాద్ధముచెప్పి అంతకుపైగా

విధిలేకుండుట సయితము శ్రాద్ధము జీవిత పితరులకేయని నిర్ధారణ మగుచున్నది. మృతపితరుల కైనయెడల యీ నియమముతో ప్రయోజన మెంతమాత్రముకులేదు. ఎట్లు అనంత దేవతలను ఆవాహన చేయుదురో అట్ల యనంతపితరులకు నావాహనము విధియగుచుండెను. ఎందరైననేమి ? ఆహారమును పెట్టుటయునులేదు. పెట్టినదానిని గ్రహించువారు లేరు. పిండములు చూపి సంతుష్టిపరచుట కెందరైనను కావచ్చును. అట్లుకాదు శ్రాద్ధము జీవిత పితరులయందు ప్రయోజనముగలదు. కావున సంభవమగు ముగ్గురి పితృలకే శ్రాద్ధము చెప్పబడియున్నది.

ప్రశ్న:—పితృ యజ్ఞము జీవిత పితృల కన్వయించు నెడల దర్శ పౌర్ణమాది మాసికశ్రాద్ధమేల చెప్పఁబడియున్నది? ఇతర కాలమంతయును ఆహారములేక యెట్లుజీవింతురు?

ఉత్తరము:— మాసిక యజ్ఞము మాత్రమేకాదు, దయినిక పితృయజ్ఞము సయితము కలదు. చూడుడు. "కుర్యా దహరహః శ్రాద్ధమన్నాద్యేనోదకేనవా! పయోమూల ఫలైర్వాపి పితృభ్యః ప్రీతిమావహన్" (మ) "అహరహః స్వధా కుర్యాదోదపాత్రాత్ తథైతం పితృయజ్ఞం సమాప్నోతి" [శత] ఇత్యాదిమను యాజ్ఞవల్క్య వచనములవలన ప్రతిదినము పితృయజ్ఞముచేయు విధి స్పష్టమగుచున్నది. ప్రాథమిక సమయమందు వానప్రస్థాశ్రమధర్మము చక్కగ పాలింపఁబడుచుండెను. వారికి నెలదినములకుఁ దగిన భోజన సామగ్రిని సమర్పించుటకు మాసిక యజ్ఞమనిపేరు. అమావాస్యను

గురించి రక్షక పితృగణముల విషయములో వివరించియున్నా రము. గృహస్థులు మాసమాసము వానప్రస్థుల సముఖము నకు వెళ్ళుచుండిరి. ఈవిధివలన వానప్రస్థులగు పితరులగు మరల గృహాశ్రమమందు ప్రీతిజనించక యుండును. దేనినుండి వెలువడియుండిరో దానియందు మరల బద్ధులగు చుండ లేదు. ఇత్యాది కారణములచేత మాసిక పితృయజ్ఞ మేర్పరచబడినది. ఇప్పుడు మనలో కొన్ని విశేషదినములందు బ్రాహ్మణభోజనము విధియైయుండినది. మరియు ప్రతిశుభ కర్మమందును పితురులను పిలిచి సత్కరించుచుండుట గృహస్థ ధర్మ - మై యున్నది.

ప్రశ్న:—వానప్రస్థపితరులు గృహములకు వచ్చుట విధియగునా ?

ఉత్తరము:—విధియును కాదు నిషిద్ధముకాదు. గృహ స్థుడు వానప్రస్థాశ్రమములకు వెళ్ళవచ్చునా! యను ప్రశ్న వలె యీ ప్రశ్నయు వ్యర్థమైనది.

ప్రశ్న:—పితృశబ్ద మెవ రెవరికి చెల్లుచున్నది? పితృ యజ్ఞ మెన్ని విధములు ?

ఉత్తరము:—వృద్ధులు, శిక్షకులు, ఆచార్యులు, సభా పతులు, న్యాయకర్తలు, సేనానాయకులు, పరోపకారపరా యణులు, పరమదేశభక్తులు, వానప్రస్థులు, మున్నగువారు పితృలనఁబడుదురు. దర్శయజ్ఞమునకు పిండపితృలనఁ బడుదురు. దర్శయజ్ఞమునకు పిండపితృయజ్ఞ మనియు, అథవా అన్వా

షోర్యమనియు, మాసికమనియు, నొక్క పితరునకుమాత్రము చేయుసత్కారమునకు ఏకోద్దిష్టమనియు, సంవత్సరమున కొక తూరిచేయుదానికి బృహత్ పితృయజ్ఞమనియు, ముగ్గురుని సత్కరించుటకు పార్వణమనియు చెప్పంబడును. ఏమనిపిలిచి యేమిపేరుపెట్టినను శ్రాద్ధము. జీవిత పితరులకొరకు యేర్పడి నది గాని మృతపితరులకు కాదు. ఆహారయోగ్యమగు సామ గ్రిని చేర్చుటకు నన్వాహారమనియు నొకమాసమునకు తగి నంత సామగ్రిని చేర్చుటకు మాసికమనియు చెప్పవచ్చును. సమస్తము పరివర్తనమై గ్రంథములు ప్రక్షిప్తములయి పోయి నందున యథార్థము అథఃపాతాళమునఁ బడిపోయినది. స్వార్థు లును దురభిమానులును హఠవాదు లధికమైయున్నవారు. ఉ దాహరణముగ నొకయంశమును సమీక్షచేయుదుము. ఈవర్త మాన సమయమందు సన్యాసులను శ్రాద్ధములలో రానీయరు. వారిని చూడనీయరు. వారు మృతులయిన తరువాత ముక్తిని పొందెదరు గాన వారికి శ్రాద్ధములు చేయరాదందురు. వారు కర్మత్యాగులు గనుక కర్మను చూడరాదని చెప్పుదురు.

గీతయందు "అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మకరోతి యః। ససన్యాసీచయోగీచ ననిరగ్నిర్న చాక్రియః" యనియు, మనుస్మృతియందు "అధియజ్ఞం బ్రహ్మజపేదాధిదైవికమే వచ। ఆధ్యాత్మికంచ సతతం వేదాంతాభిహితంచయత్" అని సన్యాసులకు యోగ్య కర్మలు విహితములని చెప్పంబడి యున్నది. ఒకడు వ్యాకరణమునుముగించి న్యాయమును ప్రారం భించిన తరువాత వాడు వ్యాకరణమును చూడఁగూడదను

నియమము యోగ్యమైనదా ? అన్ని యాశ్రమములును సమా నములై యున్నవి. ఇప్పటి యాచారప్రకారము శూద్రులకు సన్యాసములేదు. కనుక శ్రాద్ధము శూద్రులకు మాత్రము సిద్ధమా? కనుక సమస్తము వ్యత్యస్తమై కుసంస్కారములు వెలసెను.

గయాశ్రాద్ధము:—భారతీయులకు ప్రాచీనతీర్థస్థానము లగు కాశీ, ప్రయాగ, దండకారణ్య, బదరికాశ్రమ, సరస్వతీ, గంగా, నర్మదాదినదీ తీరములందును, అయోధ్యా, మధురా, రామేశ్వర, ద్వారకాదిస్థానములందును శ్రాద్ధము చేయుటలో మహిమయంతగా లేకయుండియు బౌద్ధస్థానమగు గయలో శ్రాద్ధము చేయుటలో నింతమహాత్మ్యము ప్రచలితమగుటకు కారణ మేమని గొప్పసందియముగలుగుచున్నదిగదా? ఈభేదమును తెలియుట వలన మృతక శ్రాద్ధము దేశమందెప్పుడు రూఢిలో వచ్చినది తెలియును. ఇతిహాసమువలన నొకప్పుడు మన దేశ మందధికాంశము ప్రజలు బౌద్ధధర్మమునందు విశ్వాసము గలిగి యుండిరనియు, చీనా, జపాన్, లంకలలో పూర్ణముగ బౌద్ధ ధర్మ మవలంబింపబడి యుండిరనియును విశదమగుచున్నది. అనేక ప్రదేశములందు బౌద్ధరాజ్యములుస్థాపింపబడియుండినవి. చీనా వారిలో బహుకాలమునుండి మృతకశ్రాద్ధము రూఢిలో నుండినది. ఒకరాజు మృతినొందినచో నతని శవమును దహింప జేయునపుడు దాస దాసీజనులను కొందరిని, కొన్ని గుఱ్ఱ ములను, రాజోచితమగు సామగ్రిని, అస్త్ర శస్త్రములను, భోజ్యపదార్థములను, నా రాజుపేరిట భస్మము చేయుచుండిరి.

ఇప్పటివరకు నీపద్ధతి కొంతవరకు రూఢిలోనున్నది. కొన్ని చోట్ల నిప్పుడు కాకితములతో దాసదాసీ వాహనములు మొదలగు వానిని నిర్మించి కాల్చివేయు చున్నారు. ఇవన్నియు స్వర్గముచేరి చేతన వంతములై, నిజరూపములను ధరించి, మృతపురుషుని సేవఁజేయునని చీనావారి నమ్మకము. ఇప్పటికిని స్మశానమందు మృతకభవనము లనేకములు చీనాయందు కలవు. ఆ దేశమందేమైన క్షామవ్యాధులు వ్యాపించినచో దానికి కారణము మృతులైనవారి యాగ్రహమని వారు నమ్ముచుండువారు. బౌద్ధమత వ్యాప్తికాలమందు చీనావారు 'గయా స్థానమునకనేకులు వచ్చుచుండిరి. బుద్ధునికి శ్రాద్ధము చేయుచుండిరి. బౌద్ధుఁడు పితరులకెల్ల పితరుఁడని వారి నమ్మకము. అతని తపోభూమి గయగానున్నందున వచ్చిన వారందరు గయలో శ్రాద్ధములు సదాజరుపుచుండిరి మనవారిలోగల యచ్చటిగంగా పుత్రనామధారులను ఖండాలును పురోహితులును. ఈ సాంప్రదాయ మవలంబించినచో తమకత్యంత లాభదాయక మగునని యీచీనాదేశజుల పద్ధతిని నవలంబించిరి. కొందరీ యవైదిక పద్ధతిని తమగృహములలో చేయించక విరోధించిరి. జేసినవారిని గర్హించుచుండిరి. అట్లు చేయించు వారిని మహాబ్రాహ్మణులని పిలువసాగిరి. అట్టిదానము స్వీకారయోగ్యముగాదనిరి. అయినను స్వార్థులు నదీతీరమునకు వచ్చి మృతభక్తులతో శ్రాద్ధములు చేయించి తమ స్వార్థమును దీర్చుకొనుచుండిరి. ఇట్లు క్రమక్రమముగ గృహములలో శ్రాద్ధమారంభమాయెను. ఈ యజ్ఞానరోగము దేశమం

తయు వ్యాపించెను. అయితే చీనావారు పదార్థములను వ్యర్థముగ భస్మము చేయుచుండిరి. మనవారట్లుచేయక లాభము పొందుచున్నారు. గయాశ్రాద్ధమువలన మృతకశ్రాద్ధము విదేశీయులనుండి గ్రహింపఁబడినట్లు స్పష్టమగుచున్నది.

---

# కథలు.

మహాభారతము అనుశాసన పర్వమందొక కథ గలదు. యుధిష్ఠిరుఁడు భీష్మునితో "హేపితామహా ! యేకాలమం దే మునీశ్వరుఁడు శ్రాద్ధముకల్పించె"నని ప్రశ్న చేసెను. భీష్ముఁడం దుకు యీక్రింది కథను చెప్పెను. అత్రిగోత్ర మందొక నిమియను ముని యుండెను. అతని కొక పుత్రుఁడు శ్రీమాౕ యను వాడుండెను. ఆ పుత్రుఁడు కొంత కాలమునకు చని పోయెను. అందువలన మునీశ్వరుఁడు శోక సంతప్తుఁడై రాత్రియు పగలును దారుణమగు పుత్రశోకము చేత శ్రీమా నుని ధ్యానమందే మగ్నుఁడయ్యెను. ఒక్కొక్క సమయ మందు జ్ఞానులు మునులు ధీరులు వీరులు సయితము వ్యాకుల ముచే మూర్ఛితులగుదురు. తమ్ము తాము మఱచిపోయి పరవశు లగుదురు.* ఈ నిమియు నాలాగే పుత్రుని చాల చలవమును వాని భోజనమును వాని పడకయును చూచుచు తలంచుచు విలపించుచు మిక్కిలి చంచలమానసుఁ డయ్యెను. అమావాస్య వచ్చెను. ఆ దినమందు బ్రాహ్మణులను పిలిచి వారికి లవణవర్జితమగు భోజనముఁ బెట్టి తన కొమరుని నామ గోత్రము లుచ్చరించుచు వానికి పిండములుంచెను. ఇట్లు మృతపుత్రుని పేర పిండముంచిన కొంత సేపటికి యా ఋషికి జ్ఞానోద్భవమై తాను చేసిన కుకర్మమును గురించి చిం తించెను. "అకృతం మునిభిః పూర్వంకిమయే దమనుష్ఠి తం। కథంనుశాపేన సమాంద హేయుర్బ్రాహ్మణాఇతి"॥ అయ్యో!

నేనెంతటి యనుచిత కర్మ చేసితిని? ఇట్టి కుకర్మను పూర్వ మెవరును చేసి యుండలేదు. బ్రాహ్మణులు నన్ను శపింప కుందురు గాత! యని దుఃఖించు చుండగా, అత్రిముని వచ్చి దుఃఖింపకుము. దీనిని బ్రహ్మసంకల్పించియుండెను. నీవుదానిని యారంభించితివి యని చెప్పెను. అప్పటినుండి యీశ్రాద్ధ మారంభమైనదని భీష్ముఁడు చెప్పెను. ఇదే కథ వరాహ పురాణమందు శ్రాద్ధోత్పత్తి ప్రకరణమునందుఁ గలదు. ఇచ్చట నారదఋషి వచ్చినట్లును, నారదునిఁజూచి నిమి భయభ్రాంతి యుక్తుఁడై గద్గద స్వరముతో "శోకస్నేహ పరిభావేణ ఏత త్కర్మ మయాకృతం।నచశ్రుతం మయాపూర్వం నదేవైఋషి భిఃకృతం॥ శోకస్నేహ భావముచే నేనిట్లు చేసితిని. నే నెప్పుఁ డును దీనిని విని యెఱుంగను. దేవ-ఋషు లెవరును యీ కర్మను చేసియుండ లేదు, అని విన్నవించెను. తరువాత అత్రిముని వచ్చి యథారీతి వచించినట్లు చెప్పఁబడి నది. ఈ యాఖ్యాయిక రూపమగు సంవాదము వలన మృతక శ్రాద్ధము ఆధునికమని విస్పష్టమగుచున్నది. ఈపద్ధతి విక్షిప్త దశలోనుండిన మనుష్యునివలన ప్రారంభింపఁబడినదని సిద్ధమ యినది. ఇది వేదవిహితమైనచో నిమికి భీతి జనించుచుండ లేదు. అత్రిముని వచ్చి చెప్పిన సమాధానము సమీచీనమై యుండ లేదు. ఇది పురాణశైలి ననుసరించినగాథ. సనాతన ధర్మరక్ష కాది నామధారులు పురాణములు నమ్మువారు. వారి పురాణ ములు సయితము మృతక శ్రాద్ధము సనాతనమని నిరూపించు చున్నవి. నిమి జీవిత పితరశ్రాద్ధము చేయుచు దానికి తోడుగా

విక్షిప్తదశలో మృతక శ్రాద్ధము చేసియున్నాడు. నిమి ద్వార శాహ శ్రాద్ధము చేయలేను. అమావాస్యనాడు బ్రాహ్మణు లను పిలిచి శ్రాద్ధము చేయుచూ అర్థాత్ పితృయజ్ఞము చేయుచు పుత్రి స్నేహముచేత పుత్రుని పేరుచ్చరించి పిండను నిచి స్మరించినాడు. గనుక మొదట జీవిత శ్రాద్ధమును తరు వాత విక్షిప్త చిత్తముతో పుత్రునికి సయితము పిండమునుంచి మృతకశ్రాద్ధము నాచరించినాడు. పురాణ నిర్మాతలకు సయి తము మృతక శ్రాద్ధమాధునికమని తెలిసియుండగా నిది సనా తనమని కొందరు వాదము చేయుచున్నారు పద్మ పురాణ మాత్తర ఖండములో నొక కథ కలదుగాని యది మృతక శ్రాద్ధమును ఖండించుచున్నది ఒకని మాతాపితలు వారిక ర్మాను సారముగ స్వపుత్రుని యింటిలో కుక్కగను యెద్దుగను జన్మిం చినట్లును, పుత్రుడు వీరికి మృతక శ్రాద్ధము చేసినట్లును, ఆనాడీ మృగములు రెండును యాహారము లేక పస్తుపడి యుండినట్లును, చెప్పబడి యున్నది. సారాంశ మేమన మృతక శ్రాద్ధమువలన మృతపితరులకేమియు లభింపదు గనుక నది వ్యర్థమనుటయే

విష్ణుపురాణమందొక కథ గల దదేమన:—

శ్రీకృష్ణుడు ఋక్షరాజుతో యుద్ధము చేయుటకు వెళ్ళునపుడు నే నిన్ని దినములలో మరలి రాకున్న నేచనిపో యినట్లు నిశ్చయించుడని తన వారికి చెప్పిపోయెను. కృష్ణుడు నియత తిథివరకు రానందున నతడు మృతినొందెనని గ్రహించి మృతక శ్రాద్ధము చేసిరి. కృష్ణుడు ఋక్షుని సంహారము చేయ

జాలక యోడిపోయి యొకచోట దాచుకొని యుండెను. ఇచ్చట శ్రాద్ధము చేయఁబడెను. శ్రాద్ధపిండమును కృష్ణుఁడు గ్రహించి సబలుఁడై ఋక్షరాజును సంహరించెను. ఈకథ మృతక శ్రాద్ధమును సిద్ధము చేయుటకై వ్రాయబడినది. కాని యిచ్చట జచ్చినవారికిఁ జేరవలసిన శ్రాద్ధపిండము బ్రతికియుండు వానికి లభించెను. గనుక లేఖకుని యుద్దేశము భంగమయ్యెను. ఇదియొక విధముగ మృతక శ్రాద్ధమునే ఖండించుచున్నది. భాగవతమున గోకర్ణ ధుంధుకారీ సంవాదము వలన గయా శ్రాద్ధము వ్యర్థమని నిరూపింపఁబడి యున్నది కొన్ని పురాణ ములు మృతక శ్రాద్ధము వలన పితరులకు సద్గతులు గలుగు ననియు చేయకున్న పితృలకు గతులు లేవనియు చెప్పుచున్నవి. పితరులయొక్క సద్గతులకు వారివారి స్వకర్మలు కారణములు గాక పుత్రులుచేయు మృతక శ్రాద్ధమువలన సద్గతి కలుగు ననుట, ఈశ్వర నియమభంగము. ఇందువలన కృతహానియు, నకృతాభ్యాగమ దోషమును ప్రాప్తించును. గనుక శాస్త్ర విరోధము. ఒకని తండ్రి పాతకుఁడైయుండి పుత్రుని శ్రాద్ధకర్మ వలన ముక్తిగతి లభించిన యెడల తండ్రిచేసిన పాపములకు శిక్షలేక పోయెను. అతఁడేమియుమంచికర్మచేయక నేమోక్షము లభించెను. గావున మృతకశ్రాద్ధము న్యాయదర్శనమునకు విరుద్ధమని యేర్పడు చున్నయది.

(దశగాత్ర పిండము.)

దాహక్రియానంతరము పదిదినములవరకు పది పిండము లియ్యఁబడుచున్నవి. ఈ పిండములవలన ప్రేత శరీర ముత్పన్న

మగునని యనుచున్నారు. ప్రథమ పిండముచే శిరస్సును, రెండవ దానివలన చెవులు నేత్రనాశికములును, మూడవ దానిచేత గళము భుజములు వక్షస్థలములును, నాలవదాని వలన నాభిలింగ గుదములును, యైదవ పిండముచే జానుజంఘ పాదములును, ఆరవదానివలన మర్మస్థానములును, యేడవ పిండముచే సమస్త నాడులును, యెనిమిదవ దానిచే దంత రోమములును, తొమ్మిదవ దానిచే వీర్యమును, పదియవ పిండముచే నాకలి దప్పియును, గలుగునని గలదు. ఈ శరీరము స్థూలమో సూక్ష్మమో దాని పరిమాణ మెంతయో యెచ్చటను వివరించి యుండలేదు. దృష్టిగోచరము కాదు గనుక స్థూలముకాదు. లింగాది సూక్ష్మశరీరములందమా స్థూలహారముచేత నేర్పడుట యసంభవము ఈ విషయ మధికముగ పెంచివ్రాయుట వివేకముగలవారి యూహాకే విడిచి పెట్టుట యుత్తమ పక్షము.

## శ్రాద్ధమందు భోజనము.

వేదమందు దేవయజ్ఞములో గాని పితృ యజ్ఞములో గాని మాంసభక్షణ మెచ్చటను చెప్పబడి యుండలేదు. పితృ యజ్ఞము ముఖ్యముగ పర వృద్ధుల కొరకేర్పడి యున్నది. వ్యస్తశస్త్రిలగు పెద్దలకు మహానిషిద్ధ మగునట్టియు మనుష్య యోగ్యముగానట్టియు, మాంసాహారము పెట్టుటకెట్లు వేదవాణి సమ్మతించును? (మాంసభక్షణ నిషేధమను గ్రంథమును జూడుడు) గనుక నీ విషయమై విస్తారము వ్రాయుననవసరము.

## (తర్పణము.)

ఇదివరకే జీవితపితరులకు భోజనయుక్తముగ సోమరసమును యిచ్చుచుండినట్లు వివరింపఁబడినది. సోమరసమును తయారుచేసి యిచ్చుటకు తర్పణమని పేరు. పితృయజ్ఞము జీవితులకు చేయుట తప్పినది మొదలుకొని సోమరసము చేయుటయును తప్పిపోయినది. నీటికిసహితము రసమనిపేరు గాన సోమరసమునకు మారుగ ఘనరసమును విడచుట తర్పణమనఁబడుచున్నది. మృతకశ్రాద్ధము ఈశ్వర నియమవిరుద్ధమై యున్నది. ఎవఁడెట్టి కర్మచేయునో వాఁడట్టి ఫలమును పొందుట ఈశ్వర నియమమైయున్నది. శ్రాద్ధమందీశ్వర నియమము భగ్నమగుచున్నది. పుత్రుఁడుచేయు కర్మకు పితృవు ఫలమును బొందుచున్నాడనుట వలన కృతహానియు, నకృతాభ్యాగమదోష ప్రాప్తియు సిద్ధించుచున్నది. ఇంక ధనాఢ్యులగు వారు పాపమునకు భయపడనక్కఱ లేదు. ఎందుకన నంత్య సమయమందు తనవారుచేయు మృతక శ్రాద్ధము వలన మంచిగతి ప్రాప్తించును. ఇఁక దరిద్రుఁడన్ననో సర్వదా దుఃఖములో నుండవలసివచ్చును. ఎందుకన తానెన్ని శుభకర్మము లాచరించినను దరిద్రదోషముచే శ్రాద్ధము జరుగదు గనుక సద్గతి లభింపదు. అనగా ధనికులు సర్వదా స్వర్గవాసులైరి. దరిద్రులు సదా నరకవాసులైరి ఇది ఈశ్వరీయ నియమ విరుద్ధము గనుక మృతక శ్రాద్ధము సర్వదా వేదవిరుద్ధమని సిద్ధమగుచున్నది. మృతక శ్రాద్ధమువలన సమస్త సుఖము లభించుచుండగా నింక శుభకర్మలతో నావశ్యకమేమున్నది? ఆక్షేపము

గ్రింథము దెచ్చుటనైన "నీవు భయపడవలదు. స్వేఛా చారివగుము! శ్రాద్ధమువలన నీ కన్నిసుఖములు ప్రాప్తించును!" అని చెప్పియుండుట గానము. జీవుల కేలోకమందెట్టి యాహారము కావలసిన నట్టి యాహారమును సృష్టించి యున్నవాఁడు గాని యొక లోకము వారికి వేరొక లోకము వారాహారాదులను మంత్రబలముచే పంపి వారలను జీవింపఁ జేయుదురనుట నితాంతముగ ప్రమాణ శూన్యము.

శంక:—స్వధాపితృభ్యోపృథివీషద్భ్యః స్వధాపితృభ్యో అంతరిక్ష సద్భ్యః స్వధాపితృభ్యోది విషద్భ్యః" అను వేద వాక్యమున కర్థమేమి?

సమాధానము:—ఈ మంత్రమునందు పితృలను పిలుచునట్టి వాక్యములు కనుపింపవు. పృథివీ పితరులగు మాతా పితాయాచార్యాదులను, అంతరిక్ష పితరులగు వాయుమేఘాదులను, ద్యులోక పితరులగు సూర్యకిరణాదులను మాత్రము యథా స్థితిలో నునిచి మాకు సుఖమును కలుగఁజేయుమను ప్రార్థనయై యున్నది.

శంక:—"శ్రాద్ధే శరదః" ఇత్యాది పాణిని ప్రమాణములవలన శరదృతువునందు శ్రాద్ధము చేయవలయును. శ్రాద్ధమున కీ ఋతువు విశేషమెందుకు చెప్పఁబడెను.

సమాధానము:—ఇది మృతక శ్రాద్ధమునకు సాధనము కానేరదు. మృతులకు మాత్రము శరదృతు విశేషమెందుకు? అనుశంకకు మీరేమి సమాధానమియ్యగలరు ? మా సమా

ధానము శరదృతువునందు వ్యాధి బాధలు పితృల కధికము గావున అన్ని ఋతువులలో జీవిత పితరులయందు శరదృతు విశేషము చెప్పఁబడియున్నది.

ప్రశ్న:—శ్రాద్ధము జీవితపితరులకునైన పక్షమున అది ముఖ్యకర్మ మగుచున్నదికదా ? అట్లయినచో వివాహాదుల వలె శ్రాద్ధ సంస్కార మెచ్చట చెప్పబడి యున్నది ?

ఉ:—శ్రాద్ధమునకు పితృయజ్ఞమని నామాంతరము. పితృయజ్ఞవిధి శతపథాది బ్రాహ్మణ గ్రంథములందున్నది.

ప్రశ్న॥ "శ్రద్ధయా యత్క్రియతే తచ్ఛ్రాద్ధమ్" యను నది శాబ్దిక అర్థమయ్యెను. శ్రాద్ధమునకు లాక్షణిక యర్థమేది? ఇతర కర్మలు శ్రద్ధతో చేయుండలేదా ? అన్నియు శ్రద్ధతో చేయువలయునన్న నన్నియు శ్రాద్ధముల గుచున్నవి. నిత్యభోజనము సయితము శ్రాద్ధమగునా ?

ఉ॥ శ్రద్ధాపూర్వకముగ పిత్రాదులకుపచారాదులు సేయుట శ్రాద్ధమనుయోగ రూఢివలన సిద్ధాంతహాని యేమియులేదు. మీరు మృతక శ్రాద్ధము శ్రద్ధతో చేయుదురేమి ? పతి, పత్నిని సమీపమునకు రమ్మనిన యెడల నుపనయన మగుచున్నదా ? ఆలాగుననే యితర కర్మలను మిగుల శ్రద్ధతో చేయుచున్నను శ్రాద్ధమని చెప్పబడవు.

ప్రశ్న॥ బ్రతికియుండువారికి శ్రాద్ధముచేసినప్పుడు చచ్చినవారికి వివాహము చేయవలసిన అవసరము కలదా ?

ఉ॥ ఇట్టి కుశ్శంకలు వ్యర్థమైనవి. ఆర్యులు వృద్ధులకు వివాహము చేయరు. సనాతన ధర్మనామధారులలో వృద్ధవివాహములు జరుగుచుండును. మీ శ్రాద్ధములు మృతులకు చేరునని నమ్ముచున్నారు. గనుక మృతులకును మీరు వివాహాదులు జరుపవచ్చును. మృతులపేరుపెట్టి సమస్తము నర్పింతురు. తులసీ సాలగ్రామ వివాహమువలె మీ శ్రాద్ధము మసంబవము. మీకసంభవదోషము లేదు. గావున "అధ్యాపయామాసపితౄన్ అనుటకు తోడుగ" వివాహయామాసపితౄన్ నయితము చలాయించుడు.

ప్రశ్న॥ "అసుంయ ఈయుః" యను నిరుక్త ప్రమాణము చొప్పున ప్రాణవాయుసూత్రసూక్ష్మదేహ ధారులగు పితలకు శ్రాద్ధము సిద్ధమగుచుండగా నది జీవితపితరుల కెట్లు సంఘటించును?

ఉ॥ పై మంత్రము చొప్పున పితరులు ప్రాణధారులు అర్థాత్ జీవితులని సిద్ధమైనది. మృతులని సిద్ధమగుచుండలేదు. లొట్టిపిట్ట కొండనెక్కఁబోయి క్రిందపడి నట్లయ్యెను.

ప్రశ్న॥ "యేానగ్ని రేవ దహన్తత్స్వదయతి తేపితరో గ్నిష్వాత్తా" అనఁగా నెవరిని యగ్నిదహించునో వారగ్నిష్వాత్తలని గలదు. మీ పితరులు జీవించియుండియు దహించుచుందురేమి? అథవా దహించియు బ్రతికియుందురేమి?

ఉ॥ అగ్నివలన దగ్ధమగునది శరీరముగాని ఆత్మగాదు. మీయాశయము పితరులు దహింపఁ బడుదురని తెలియు

చున్నది. ఇదియు కేవల మసంభవము. అగ్నివిద్యయందు నిపుణులకు నగ్నిష్వాత్తపితరు లోకొక్కటి సనుయమందు నగ్ని వలన బాధనొందు టసంభవమగుచున్నది. అట్టివారిని పిలుచుకొనివచ్చి శ్రద్ధతోనుపచారము సల్పుటయు సంభవమగుచున్నది. గాన మృతక శ్రాద్ధము సిద్ధము కాలేదు.

ప్రశ్న॥ "యే తేపూర్వే పరాగతాః" మంత్రమున పూర్వకాలమున వ్యతీతులగు పితరులకు తర్పణవిధానముచెప్పబడినది. కాని వర్తమాన మందలి జీవితపితరులకు కాదు.

ఉ॥ ఈ మంత్రమునకు పూర్వమంత్రమును చూడుడు. తరువాత "ఘృతకుల్యైతు శతధారాః" యను దానిని గమనించుడు. ఓహో! మీరు ఘృతదారలతో చేయుతర్పణ మొకటి కల్పించెదరా? మీకు సర్వత్ర తర్పణమే ప్రతీతమగుచున్నది. ఏల ప్రకరణ విరుద్ధరూపమునం బడెదరు?

ప్రశ్న॥ "మృతాః పితృషుసంభవంతు" మృతులైన వారు పితృయోనియందు ప్రవేశింతురని యీ మంత్రము వలన తెలియుచున్నది. ఇచ్చట మృతశబ్దము వచ్చియున్నది. గనుక మృతకశ్రాద్ధము సిద్ధమగుచున్నది.

ఉ॥ ఈ మంత్రమందు శ్రాద్ధతర్పణములు లేవు చచ్చిన వారు పితృయోనియందు ప్రవేశించుటకై ప్రార్థనయై యున్నది. దీనిచే మృతకశ్రాద్ధము సిద్ధము కానేరదు. అట్లయినచో (మృతస్యైకాదశాహేనైభుంజానఃశ్వాభిజాయతే) యనుటవలన మృతుని యేకాదశాహ శ్రాద్ధ భోజనముచే శునక

జన్మమందు ప్రవేశించినప్పుడు శునకమునకు తర్పణము సిద్ధమగునా? చచ్చినవారందరు పితరు లగుదురనుటయు వేదవిరోధమగుచున్నది. గనుక మృతక శ్రాద్ధము సిద్ధింపదు.

ప్రశ్న॥ "అథామాసి పునరామాతనో గృహాః" అను మంత్రప్రమాణమువలన పార్వణాది మాసిక శ్రాద్ధమందు పితరులయొక్క విసర్జనమును మాసపూర్తియైన తరువాత మరల నావాహనము (పిలుచుట)ను గలదు. జీవితపితరులకు నెలకొకసారి భోజనముఃబెట్టుట యసంగతముకాదా? అట్లు చేసితిరేని వారు బ్రతికియుందురా? దీనిచే మృతకశ్రాద్ధము సిద్ధమగు చుండలేదా?

ఉ॥ గరుడపురాణము ప్రేతకల్పమందు "ప్రత్యబ్దం పార్వణం కార్యం" ప్రతి సంవత్సరమందును పార్వణము జరుగవలెనని యున్నది. మీకది ప్రమాణగ్రంథము, మాసపార్వణము లేదు. మంచిది, మీమృతపితరులు మాత్రము నెలకొకసారి భుజించి యెట్లు జీవించగలరు? వారికి కవులకువలె వోడలలో సంచులుండునా? వానిలో నింపుకొని కొంచెముగ నెలవరకుతిని కాలక్షేపము చేయుదురా? జీవితపితరులు నిత్యప్రతి తమపురుషార్థముతో భుజించెదరు. వారిని పుత్రులు ముఖ్యదినములందు సత్కరించుట యావశ్యకముకాదా? మీరు ఆషాఢపౌర్ణమమందు గురుపూజా విధిని జరుపుచున్నారు. సంవత్సరమందొక్క దినము మాత్రము గురువును గౌరవించి తక్కిన దినములందు పూజింపకూడదని నిషేకలదా? లేదు. నిత్యపితృయజ్ఞమును కలదు. కొన్ని సమయములందు విశేష విధాన

మున్ను గలదు. మృతపితరులకు నిత్య విధిలేదు. మీ శ్రాద్ధ విధినిగురించి యిట్లు చెప్పియున్నారు. అది యొప్పిదమైయు న్నది.

"సీ॥ జీవితుండగు పితకుఁ జక్కనిటంగులు మృతుఁడైన పితకును మెతుకు ఘృతము। మనుమండు తండ్రితో మాట లాడుటసున్న చనిపోయినప్పుడు శ్రాద్ధమిలను। బ్రతికిన పితరున కతులిత వ్యథలును మృతుఁడైన పిదప సమ్మతిని తిథియు। జీవిత సిత్రుయాజ్ఞ చెవినిఁ జేరగరాదు పరలోక గతిఁబొంద పనులు మెండు॥ అకట పితృభక్తి భువి లోన వికటమయ్యె। కాడుఁ జేరిన పిమ్మటఁ గలిగె శ్రద్ధ। వింతయయ్యెడి మనవారి విధులరీతి। మననమునుఁజేసి ధ్యానించు డనవరతము॥

ప్రశ్న॥ "అపరాహ్ణః పితౄణామ్" అను ప్రమాణము చొప్పున మీ వృద్ధులకు మధ్యాహ్నము భోజనముఁ బెట్టుట విరుద్ధ పద్ధతి యగును. జీవితులకు మానవు లందరికి భోజన సమయము మధ్యాహ్నమై యున్నది. అపరాహ్ణము చెప్పినది గనుక మృతక శ్రాద్ధము సిద్ధమగు చున్నది.

ఉ॥ ఇదివరకే పితరులు వయస్సును బట్టి అపరాహ్ణ ముతో సమానులని చెప్పియున్నారము. మీరు మధ్యా హ్నము భుజించిన యనంతర ముచ్ఛిష్టమును పితరులకుఁ బెట్టె దరేమి? జీవితు లెవరును అపరాహ్ణము భుజింప కూడదని విధి యెచ్చటను లేదు. అనేక సమయములందు మీకుటుం

ఖములలో ననేకులు సమయానుసార మపరాహ్ణ భోజనము చేయుట సంభవించును. అప్పుడు వారందరు మనుష్యులు గారా?

ప్రశ్న॥ "సనిదధాతి యేరూపాణి" యను శతపథవాక్య ప్రకారము 'యేరూపాణి' మంత్రము చెప్పి పిండమునకు దక్షిణమున యగ్నిని యుంచ వలసిన విధి కలదు. జీవిత పితరుల సముఖమున నుంచుట వలన లాభమేమి? వసంతకాలమైనచో వారికి బాధ యధికము కాదా?

ఉ॥ అగ్నిలో నల్పముగ హోమ ద్రవ్యములను ధూపము చేయుటవలన భోజన సమయమందు దోమలు మొదలగునవి సమీపమున నుండక వెడలిపోవును. గనుక నిదియు జీవితులకే యన్వయించును గాని, మృతులకు గాదు. మీరు విగ్రహముల యెదుట దూపము వేయుదురు. కారణ మేమో చెప్పెదరా? కొంచెము యోచించుడు.

ప్రశ్న॥ ఓం పితరః శుంధధ్వమ్" అను మంత్రముతో నీరు తీసికొని దక్షిణాభి ముఖుఁడై భూమిమీద విడుచు విధి కలదు గదా? జీవిత పితరుల విషయములో నిదియు వ్యర్థక్రియ కాదా? పితరులను పరుండబెట్టి నోటిలో నీరు పోసెదరా?

ఉ॥ ఇది సమావర్తన ప్రకరణములోని మంత్రము. సమావర్తన సంస్కార సమయములో బ్రహ్మచారుల యొక్క మాతాపిత లందరు మరణించి యుందురని మీ యభిప్రాయమా ? మృతపితరులకు సంబంధమేలాగు ? మీమత ప్రకారము జీవితులకు గాకుగదా ? ఒకవేళ మాతాపితలు

చనిపోయియుండిన బ్రహ్మచారులు మాత్రము జలమును విడువవలయునదరా ? అట్లు యెచ్చటనైన చెప్పియున్నదా? చూపినప్పుడుత్తరము చెప్పెదము.

ప్రశ్న॥ "ఆమ్రాశ్చసిక్తాః పితరశ్చ తృప్తా ఏకాక్రియా ద్వ్యర్థ కరీప్రసిద్ధా" యను మహాభాష్య ప్రమాణము చొప్పున మృతపితరులకు తర్పణము సిద్ధమగుచుండలేదా?

ఉ॥ ఇది విధివాక్యముకాదు. ఒకానొక పూర్వపక్ష వాక్యమును భాష్యకారు లుదహరించి యున్నారు. మంచిది మహాభాష్యమందలి "ఏకో వృషంకంబల పాదుకాభ్యామ్" ఈ శ్లోకానుసార మెవరైనను, ఎద్దులకు పాదుకలు తొడిగించ గలరా ? ఇది బట్టల యంగడిలో రొట్టెల వ్యాపారమువలె నున్నది.

ప్రశ్న॥ "తృతీయాహ ప్రద్యోరితియ స్యాంపితరఆసతే" మంత్రమునందు ప్రద్యోనామక తృతీయ లోకమందు పితృలు వసింతురని యున్నది.

ఉ॥ మేము వాయురూప పితృవుల నమ్ముచున్నారము. సూర్యునికిరణములకు పితృశబ్దము గలదని చెప్పియున్నారము. మృతపితరులు మూడవ లోకమునుండి సూక్ష్మశరీరములతో వచ్చి స్థూలభోజనమును స్వీకరించెదరా? అట్లయిన చాక్షుష ప్రత్యక్షముగావలయును.

ప్రశ్న॥ "మృతానామిహ జంతూనాం శ్రాద్ధంచే త్తృప్తికారణం । జీవతామిహజంతూనాం వృథాపాథేయ కల్ప

నమ్" అనగా మృతులకు శ్రాద్ధములుచేయుట నిజమైనచో దూరదేశమునకు వెళ్ళినబంధువులకు నింటివారేల శ్రాద్ధములు చేసి వారికి చేరునట్లు చేయరాదను వాదము బౌద్ధచార్వా కాది నాస్తిక మతసిద్ధాంతము గనుక మీరు నాస్తికులని సిద్ధ మైనది?

ఉ॥ "నాస్తికో వేదనిందకః" యనునట్లు వేదప్రతిపాదము కానట్టి శ్రాద్ధమును మేము సిద్ధము చేయలేము. వేదమం దెచ్చటను మృతక శ్రాద్ధములేదు. గనుక మేము వేదమునుగాని ఈశ్వరునిగాని నిందించువారముగాము. వేదమతప్రచారకులము. మీరుచేయు కర్మలనేకములు వేదవిరోధములుగావున మీరే నాస్తికులగుదురు. సత్యమెచ్చటనున్నను గ్రహించవలసినదే. మృగములు భూమిమీద సంచరించునట్లే మీరును భూమిపై తిరుగుచున్నారు. గాన మీరు పశుతుల్యులని చెప్పువారెంతటి బుద్ధిశాలులో లోకమెరుంగగలదు. బుద్ధుడు భగవ దవతార మని నమ్ముచుండెడు మీరు నాస్తికులు గాకుండుట మిక్కిలి యాశ్చర్యము. చెడుగా యేల పుట్టితివన, మంచివారిని వెక్కి రించుట కన్నట్లున్నది.

ప్రశ్న॥ స్వామీ శంకరాచార్యులు అన్వీక్షకీవిద్యా ధురీణులైయుండియు మృతక శ్రాద్ధమువలన కృతహానియు నకృ తాభ్యాగమదోషము ప్రాప్తించుననుట యేల ఖండించి యుండ లేదు. మీరు నాస్తికులకు జడిసి వారిని యోచించలేక వారి సిద్ధాంతమును స్వీకరించినారని తోచుచున్నది.

ఉ॥ స్వామీ శంకరాచార్యులు తమపిత పితామహ ప్రపితామహులకు మృతక శ్రాద్ధముచేసి సనాతన ధర్మమహా బ్రాహ్మణులకు భోజనముఁ బెట్టినట్లు ప్రమాణములు చూప జాలరు. మేము వేదవిరుద్ధమగు ప్రతిదానిని ఖండించుచున్నారము. వేదోక్తమును స్వీకరించుచున్నారము. మీరుకుశ్శంకలు చేయక సత్యాన్వేషక బుద్ధితో ప్రశ్నింప వలయును.

ప్రశ్న॥ "తిరఇవవైపిత రోమనుష్యేభ్యః" మనుష్యుల కంటె పితరులు కనుపించని దశలో నుందురని శతపథ మందు గలదు. అదృశ్యులగు పితరులెవరు? జీవితులా? మృతులా?

ఉ॥ ఇచ్చట పితరశబ్దమునకు చంద్రలోకస్థమగు వాయువని యర్థము. అది అగ్ని ద్వారా కవ్య గ్రహణము చేయునని యున్నదిగాని మృతక శ్రాద్ధమును గ్రహించునని చెప్పఁబడి యుండలేదు.

ప్రశ్న॥ "పితృభ్యః స్వదాయిభ్యః"యీమంత్రము చెప్పి యొక గ్రాసమును దక్షిణదిక్కున నుంచుటకు హేతు వేమి?

ఉ॥ "సోమాయస్వాహా" యను మంత్రము చెప్పి పంచమహా యజ్ఞవిధియందు వేదికి దక్షిణభాగమందొక యాహుతి నిచ్చుచున్నారము. ఇందుకుగల హేతువే అందుకు గలదు.

ప్రశ్న॥ మీరు ప్రత్యక్ష ఫలమును మాత్రము నమ్మెదరు గాని యప్రత్యక్షమును నమ్మరుకదా? పరలోక సంబంధ

ములగు ప్రత్యక్షముల నెట్లు నమ్మెదరు? మృతకశ్రాద్ధ మట్టిదే కదా?

ఉ॥ వేదమందొకడు చేసినకర్మకు మరియొకడు ఫల మనుభవించునని చెప్పి యుండలేదు. మృతక శ్రాద్ధమువలన యొకరి కర్మవలన నింకొకరు ఫలము ననుభవింతురను వేదవిరుద్ధము సంభవించుచున్నది. వేద విరోధమును ఈశ్వర నియమ భంగమును దార్శనికమగు యుక్తికి విరుద్ధము నగుచుండుట చేత మేము నమ్మము. మీరు హేత్వాభాసములను నమ్మెదురా?

ప్రశ్న॥ "ఆత్మావై పుత్రనామాసి — ఆత్మావైజాయతే పుత్రః" ఇత్యాది స్మృతివాక్యములను మీరు నమ్మరా? పుత్రాదులు అంశరూపములుగారా

ఉ॥ పితాపుత్రులకు భేదము లేనప్పుడు స్వస్త్రీమాత కావలసివచ్చును. మీరుమాతృ విచ్ఛిటలాక్షణికార్థములను త్యజింపవచ్చునా? ఇచ్చట పితాపుత్రులయొక్క ప్రేమను వర్ణింపఁబడినదని తెలియవలయును. అనేకాత్మల నొక్కటి యనుట సృష్టివిద్యకు వ్యతిరేకమగుచున్నది.

ప్రశ్న॥ అవయవములు చేరియార్జించిన యాహారాదులు కడుపుగ్రహించు చుండలేదా? ఆలాగుననే అవయవరూపులగు పుత్రులుపెట్టిన శ్రాద్ధములు పితృలేల గ్రహింపరాదు?

ఉ॥ సర్వాంగములకు నధిష్ఠాతయగు జీవాత్మ ప్రత్యేకముగ గలఁడు. పుత్రుఁడును పితృవును ప్రత్యేక జీవాత్మలు

గనుక నీ యుపమానము యుక్తమైనది కాదు. వివేచన లేకుండ శంకించుచున్నారు.

ప్రశ్న॥ మనుస్మృతి తృతీయాధ్యాయములోని యనేక శ్లోకములు మృతక శ్రాద్ధమును స్థాపించుచున్నవి. సనాతనులగు టీకాకారులు సయిత నదే యర్థమును వ్రాసియున్నారు. మీరొకవేళ ప్రక్షిప్తమందురా, హేతువును చూపజాలరు.

ఉ॥ మీరు కుల్లూకభట్ట భాష్యమును సనాతనమని నమ్మి యామోదించినారు. మనుస్మృతిలోని "దేవతాతిథి భృత్యానాం పితౄణా మాత్మనశ్చయః । ననిర్వపతి పంచానాముచ్ఛ్వసన్న సజీవతి" యను శ్లోకమునకు కుల్లూకభట్ట భాష్యమును చూడుడు. "దేవతాశబ్దేన భూతానా మపిగ్రహణ తేషామపి బలిహరణే దేవతారూపత్వాత్ । భృత్యా అవశ్యం సంవర్ధనీయాః వృద్ధమాతా పిత్రాదయః సర్వత్ర ఏవ ఆత్మానం గోపాయేదితి శృత్యా ఆత్మ పోషణమవశ్యం కర్తవ్యం దేవతా దీనాం పంచానాం యోన్నం నదదాతి సశ్వస్నపి జీవిత కార్యా కరణాన్న జీవతీతి నింద యావశ్యకర్తవ్యతా బోధ్యతే" అని 'పితౄణాం' శబ్దమునకు విస్పష్టముగా వృద్ధమాతా పితాదులని వ్రాసియున్నారు. తృతీయాధ్యాయము 122 వ శ్లోకము నుండి 169 వ శ్లోకము వరకు పై భాష్యమును బట్టి ప్రక్షిప్తమని స్పష్టమగుచున్నది. 121 వ శ్లోకము తరువాత 170 వ శ్లోకము వరకు ప్రకరణ విరుద్ధమై యున్నయది. 121 వ శ్లోకముతో 170 వ

శ్లోకమునుండి సంబంధమై ప్రకరణాను సారమగుచున్నది. మరియు నీ ప్రక్షిప్తభాగము పురాణశైలిగానున్నదిగాని మనువుయొక్క సంస్కృతశైలినిం బోలియుండలేదు. ఇది యనేక విద్వాంసులవలన తీర్మానింపఁబడియున్నది. మరియు మనువు యింతకుమునుపే నిత్యశ్రాద్ధమును చెప్పి తద్విరుద్ధముగ నిచట మాసిక శ్రాద్ధము చెప్పుట పూర్వాపర విరోధమగును. నితాంతముగ మానవయోగ్యముగానట్టియు వేదవిరోధమైనట్టియు మద్యమాంస భోజనము యీప్రక్షిప్త భాగమందే గలదు. ఈ హేతువులవలన నీ భాగము ప్రక్షిప్తము.

ప్రశ్న॥ జీవిత మాతాపితాదుల సేవకొరకు శ్రాద్ధశబ్దము రావలసిన యగత్యమేమున్నది?

ఉ॥ శ్రాద్ధము పితృయజ్ఞమని యిదివరకే చెప్పినారము. శ్రద్ధాభక్తులు మృతులకొరకేల రావలయును? అది కేవలమసంభవము. భాగవతములో ప్రేతరూపమును ధరించిన ధుంధుకారి. "గయాశ్రాద్ధ శతేనాపి ముక్తిర్మేన భవిష్యతి। ఉపాయమపరం కించిత్ తద్విచారయ సాంప్రతం" నూరుల కొలది శ్రాద్ధములు చేసినను నాకు ముక్తి లభింపలేదు. రెండవ యుపాయ మేదైనను విచారించుము. అని చెప్పడము విచారించగా మృతపితరులకు శ్రాద్ధమసంభవమని సిద్ధమైనది. గనుక శ్రాద్ధ శబ్దము జీవితపితరులందే సార్థకమగుచున్నది.

ప్రశ్న॥ మీకు ప్రక్షిప్తమను భావమే సిద్ధాంతమై యుండకూడదా?

ఉ॥ ఇట్లు ధర్మాధర్మ విచారము చేయక యధర్మమునే ధర్మమని హఠము చేయువారితో వాదింపరాదని మనువు చెప్పియున్నాడు "అధర్మేణతుయః ప్రాహయశ్చాధర్మేణ పృచ్ఛతి। తయోరన్యతరః ప్రైతి విద్వేషం వాధిగచ్ఛతి" అన నన్యాయ పక్షపాత యసత్యగ్రహణ సత్యపరిత్యాగాది యధర్మలక్షణములు గలవారితో వాదించుటవలన నత్యంత ద్వేషము గలిగి చెడుగు సంభవించు నని తాత్పర్యము. ఇది మాకు స్వానుభవము.

ప్రశ్న॥ "స్వధర్మేనిధనంశ్రేయః పరధర్మోభయావహః" అను గీత ప్రమాణము చొప్పున స్వధర్మమును త్యజించి పరధర్మము నాచరింప కూడదు గదా?

ఉ॥ "ధృతిక్షమాదమోస్తేయం శౌచమింద్రియ నిగ్రహః। ధీర్విద్యాసత్యమక్రోధోదశకం ధర్మలక్షణం" అనియున్నది. మీరు స్వధర్మ పరధర్మములన జీవజడధర్మములని యర్థము చేయవలెను. లేనిచో ధర్మహానిసంభవించు చున్నది. మృతక శ్రాద్ధము జీవధర్మముగా నేరదు.

ప్రశ్న॥ మృతకశ్రాద్ధమును త్యజించిన యెడల బ్రాహ్మణత్వము పోవునని యుండలేదా?

ఉ॥ బ్రాహ్మణత్వమన నేమో తెలిసిన వారిట్టి ప్రశ్న వేయరు. "సువృత్తఃశీల సంపన్నః ప్రసన్నాత్మా త్మవిద్బుధః। ప్రాప్యేహలోకే సన్మానంసబ్రాహ్మణ ఇతిస్మృతః యస్యవాఙ్మనసీ స్యాతాం సమ్యక్ప్రణిహితేసదా తపస్త్యాగశ్చ సత్యంచ

సవైబ్రాహ్మణఉచ్యతే ॥ అధ్యాపన మధ్యయనం యజనం యాజనంతథా। దానంప్రతి గ్రహంచైవబ్రాహ్మణానామకల్పయత్ ॥ శమోదమస్తపః శౌచంక్షాంతిరార్జవమేవచ। జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజం ॥ అహింసానిర్మమత్వంచ దుష్కృత్య స్యచవర్జనం ॥ రాగద్వేష నివృత్తిశ్చ ఏతద్బ్రాహ్మణ లక్షణం ॥ క్షమాదయాదమోదానం సత్యం శౌచం స్మృతిఘృణా॥ విద్యావిజ్ఞాన మాస్తిక్య మేతద్బ్రాహ్మణ లక్షణం ॥ పారగం సర్వవేదానాం సర్వసద్గుణభూషితం ॥ ముక్తశ్చరతి యోధర్మం తమేవ బ్రాహ్మణంవిదుః ॥ నిర్మమోనిరహంకారో నిస్సంగో నిష్పరిగ్రహః ॥ రాగద్వేష వినిర్ముక్తస్తం దేవ బ్రాహ్మణంవిదుః ॥ సత్యందానం క్షమా శౌచ మానృశంశ్యం తపోఘృణా। విద్యంతే యత్రరాజేంద్ర సబ్రాహ్మణ ఇతిస్మృతః ॥ ఋజుస్తపశ్చ సంతుష్టః క్షమాహారి జితేంద్రియః। జ్ఞానిధ్యాతాదయాళుశ్చ బ్రాహ్మణో నవభిర్గుణైః ॥ బ్రహ్మచర్యం జపోహోమః కాలేశుద్ధాల్ప భోజనం। అరాగద్వేషలోభాశ్చ తప ఉక్తం స్వయంభువా ॥ జన్మనా జాయతేశూద్రః సంస్కారా ద్విజ ఉచ్యతే। వేదాభ్యాసాద్భవేద్విప్రో బ్రహ్మవిద్బ్రాహ్మణోభవేత్ ॥ ఇత్యాద్యనేక ప్రమాణములవలన సర్వసద్గుణ సంపన్నత్వము బ్రాహ్మణత్వమని సిద్ధమగుచున్నది గాని మృతకశ్రాద్ధము చేయుటయని యచ్చటను చెప్పబడియుండలేదు. మీరు గుణప్రధాన మంగీకరింపరా?

ప్రశ్న॥ పితృలకు శ్రాద్ధమువలన స్వర్గభోగములు లభించునని కొన్ని పురాణములందు గలదు. అందున కేమి చెప్పెదరు ?

ఉ॥ "సతిమూలే తద్విపాకోజాత్యాయుర్భోగాః" యను యోగదర్శన ప్రమాణము చొప్పున, జీవుఁడు కర్మాను సారముగ మనుష్య, పశుపక్షి, వృక్షాది జాతులను ఆయువును భోగమును పొందునని సిద్ధమగుచున్నది. పితాపుత్ర సంబంధము శరీరమునకుగాని ఆత్మకుగాదు. గనుక పుత్రుని కర్మ వలన పితృవునకు స్వర్గాది భోగములు లభించుట శాస్త్రవిరుద్ధము.

ప్రశ్న॥ ఈప్రకారముగ మంత్రములన్నియు జీవిత పితరులకు సంబంధముగ నుండియును అట్టియర్థ మగుచుండి యును, సంభవమును త్యజించి యసంభవమునేల మనవారు స్వీకరించి యున్నారు ? అందరునవివేకులగుదురా ?

ఉ॥ మనదేశమునందు అస్వీకృకీవిద్య క్షీణించినది మొద లుకొని స్వార్థులిట్టి యసంభవములను నమ్మించునట్లు చేసి తమ స్వార్థమును తీర్చుకొనుటకుఁ బ్రారంభించి యున్నారని యిది వరకే చెప్పియున్నారము. ఇప్పుడును హఠవాదులనేకులు గలరు. సంఘములన్నియో అంధపరంపర బాధనములో జిక్కు కొని స్వతంత్రహీనములై యున్నవి. ఆత్మబలముగలవా డొకడు సత్యమార్గ మవలంబించినచో వానిని దుష్టులగు స్వార్థ పండితులు మతశాసనములచేత శిక్షించుటకు ప్రారంభింతురు. ఇందువలననే "విద్యయా విమలయా హ్యలంకృతో దుర్జనః

సదసిమాస్తుకశ్చన। సాక్షరాహి విపరీతతాంగతాః కేవలం జగతితేపిరాక్షసాః ॥ యని విద్యచే యలంకృతుండైనను దుర్జనుడు సభకు యోగ్యుడు గాడని చెప్పబడినది. విపరీతమార్గ మవలంబించిన పండితులు సాక్షరులైనను రాక్షసులు అర్థాత్ సాక్షరాశబ్దము వారియందు తలక్రిందులై రాక్షసాయగుచున్నది అనగా వారు రాక్షసులని తాత్పర్యము. "సత్యం తపోజ్ఞాన మహింసతాచ విద్వత్ప్రణామశ్చ సుశీలతాచ । ఏతాని యోధారయతే సవిద్వాన్ నకేవలంయః పఠతేస విద్వాన్" అనగా సత్యశమదమాది సద్గుణములు గలిసిన వాడు విద్వాంసుడగుననియు చదువుకొన్న మాత్రమున విద్వాంసుడు గాడనియు ప్రాథమికులు చెప్పియున్నారు. "స్వార్థీదోషం నపశ్యతి" యన్నట్లు స్వార్థులు అసంభవ సంభవములను చూడరు. సత్యమును స్వీకరింపరు. అందరును అంధపరంపరను విడజాలక యాచరించుచున్నవారు.

ప్రశ్న॥ "దేవాః పితరోమనుష్యా గంధర్వాప్సరసశ్చయే" యను అధర్వమంత్రమువలన పితరులు వేఱని మనుష్యులు వేఱని విస్పష్టమగుచున్నది.

ఉ॥ యాస్కాచార్యులు నిరుక్తమందు "గంధర్వాః పితరోదేవా అసురారక్షాంసి ఇత్యేకేచత్వారో వర్ణానిషాదః పంచమ ఇత్యౌపమన్యవః" అని గంధర్వ, పితర, దేవ, అసుర, రాక్షస యీ యైదును మానవులలోని భేదములని చెప్పియున్నారు. ఈ విభక్తము వ్యవహారము కొఱకు చేయబడియున్నది. "గాంవాణీ ధరంతీతి గంధర్వాః" గాన విద్యా

నిపుణులు గంధర్వులు. "పాంతి పాలయంతీతి పితరః" దేశ రక్షకులు పితరులు. "విద్వాంసోహిదేవాః" విద్వాంసులు దేవతలు, నికృష్టవర్గము వారసురులు, అతి నికృష్టులు రాక్షసులు, ఎట్లు గుణ కర్మ స్వభావాను సారముగ నాలుగువర్ణములేర్పడి యున్నవో అట్లు గుణ కర్మానుసారము పంచమానవ భేదము లేర్పడి యున్నవి. పితృలలో సహితము భేదములున్నట్లు మేమింతకు పూర్వమే చూపి యున్నారము. ఐతరేయ బ్రాహ్మణమందు "పాంచజన్యాం వా ఏతదుక్థమ్। యద్వైశ్వదేవమ్। సర్వేషాంవా ఎతత్పంచ జనానాముక్థమ్ దేవమనుష్యాణాం గంధర్వాప్సరాణాం సర్పణాంశ్చ పితౄణాంచ ఏతేషాంవా ఏతత్పంచ జనానాంముక్థమ్। సర్వఏవ పంచజనా విదుః" అని చెప్పబడి యున్నది. ఈ విషయమందు ఆధునిక విద్వాంసులగు శ్రీయుత మహాశయరాయ శివనాథులు తమ ఋగ్వేద భాష్యమందు ప్రథమ మండలము 7-వ సూక్తము 9-వ మంత్రము నందలి పంచ మానవుల నిట్లు టిప్పణిలో వివరించి యున్నారు.

1 ఆర్యులు 2 మంగోలియన్‌లు 3 నీగ్రోలు 4 అమెరికన్‌లు 5 మలెయాతెగవారు. వీరు పంచ మానవులని వ్రాసి యున్నారు. మహాభారతాది పర్వములో "యదోస్తుయాదవా జాతాస్తుర్వ సోర్యవనాహః స్మృతాః। ద్రుహ్యోః సుతాస్తువైభోజా అనోస్తుమ్లేచ్ఛ జాతయః। పూరోస్తు పౌరవో వంశోయత్ర జాతోసిపార్థివ" యని, యదుని వలన యాదవ వంశమును, తుర్వసు వలన యవన వంశమును, ద్రుహ్యుని

షువలన భోజవంశమును, అనువువలన మ్లేచ్ఛవంశమును, పూరువవలన పౌరవంశమును గలిగెనని యున్నది. ఇత్యాదులను వివేచన చేసి చూచిన యెడల పితరులు మానవాంతర్గతులని తెల్లమగు చున్నది. బహు కాలమునుండి శబ్దములు విరకాములై పరివర్తన మగుటవలన భ్రమకు నాస్పదమేర్పడి యున్నది. భారతమందు భీష్ములకు పితామహుఁడను పేరు వాడఁబడి యున్నది. గనుక పితర శబ్దము జీవితులందే వర్తించుచున్నయది.

ప్రశ్న॥ బ్రతికిన వారు పితరులైన చచ్చివారి పేరేమి?

ఉ॥ చచ్చినతరువాత కళేబరమునకు ప్రేతమనియు జీవునికి భూతమనియు పేరు. భూతమనఁ గడచిపోయిన జీవుఁడని యర్థము. పృథ్వీలోకమును త్యజించి కాలాంతరుఁడైన జీవాత్మకు భూతమని పేరు. ప్రాకృతిక శరీరమును దహించుటకు ప్రేతసంస్కారమని పేరు.

ప్రశ్న॥ మృతపితరుల స్మరించుచు వారి జ్ఞాపకార్థమే కార్యము చేయవలదా? వలదన్న కృతఘ్నత కాదా?

ఉ॥ మృతులపేరిట యిష్టమైన స్మారకచిహ్నములను ప్రతిష్ఠింపవచ్చును. వారు గడించినదానిలో కొంతభాగమును వెచ్చించి విద్యానిలయములును, గ్రంథభాండాగారములును, కర్మశాలలును, అన్నదాన నిలయములును, గోరక్షణనిధులును, విద్యార్థి వేతనములును, మొదలగు సత్కార్యములను చేయవలయును. అయితే దీనికి స్మారక చిహ్నమని పేరు. శ్రాద్ధమనిపేరు కాదు. జీవించియుండగా చేయునది శ్రాద్ధము.

మరణా నంతరము వారి పేరిట స్థాపించునది స్మారక చిహ్నము. దీనిఫలము స్థాపించినవానికి సంబంధముగాని మృతునకుఁ గాదు. మీరు కృతఘ్నతకాదా, యని చెప్పితిరి. కృతఘ్నత యెవరిది? దానికి పాత్రులెవరు? మృతుఁడు కానేరడు. గనుక నిందేమియు కృతహానిలేదు. దోషమును లేదు.

---

# ప్రశ్నోత్తరములు.

ప్రశ్న॥ ఈశ్వర క్రమమందాది సృష్టియెక్కడయేర్పడినది? వారెందరు? వారెట్టిస్థితిలో సృష్టింపఁబడిరి? వారిభాష యేది? వారిజ్ఞాన మెట్టిది? వారియాయు వెంత? వారియాహార మేమి? అట్టి యమైథునసృష్టి యిప్పుడేల కలుగదు? డార్విన్ మత ప్రకార మాదిలో మృగ స్వరూపములుగానుండి మనుష్యాకారము ధరించినది నిజమా కాదా?

ఉ॥ అమైథునసృష్టి యుచిత పరిమిత సంఖ్యతో ప్రారంభమైనది. గనుక నది పరిమిత స్థలమందే చేయఁబడి యుండవలయును. ఒక పిడికెడు బీజముల వలన కొంత ప్రదేశము పంటపెట్టఁబడు చున్నది. ఆ ప్రదేశ ముచితమై యుండవలసినది. హిమాలయ మట్టి ప్రదేశమై యున్నది. దాని యంతటి యున్నత ప్రదేశము మఱెచ్చటను లేదు. గనుక త్రివిష్టప మని చెప్పఁబడు చుండిన టిబెట్‌పీఠభూమి యందే ఆది సృష్టి యైనది. దీనికి కైలాసమని స్వర్గమని దేవభూమి యని నామాంతరములు గలవు.

ఈశ్వరుఁడాదియందు స్వల్ప సంఖ్యగనే సృష్టించి యుండవలెను. ఒక బీజమున కనేకములగు బీజములుత్పన్నమగు చుండుట మనము సృష్టిమక్రమునఁజూచు చున్నారము. గాన యాదియందీశ్వర క్రమమున స్వల్పసంఖ్యగనే సృష్టింపఁబడి యుండవలెను. వారు మానవ జీవనోద్దేశములగు ధర్మార్థ కామ మోక్షముల బడయువారలై యుండవలయును.

వారనేక మందిగాయె యుండవలయునుగాని యొక్క స్త్రీయొక్క పురుషుడు అర్థాత్ యొక జంట మాత్రము కాదు. ఇప్పటి వివాహ పద్ధతి వలననే యాదియందొక్క జోడు మాత్రము సృష్టింపఁబడక యనేకమంది స్త్రీ పురుషులను సృష్టింపఁబడి యుండినట్లు విదిత మగుచున్నది. వారు సృష్టికి తగిన యవస్థలో సృష్టింపఁబడి యుందురు. వారికి రక్షకుల నావశ్యకులు.

ప్రత్యేక శరీరమునకు వృద్ధిస్థితి మరణములు మూడును నియమితమై యున్నవి. నరనారీ బీజములు కలసి మఱి యొక శరీరమును కలుగ జేయును. లోకమం దెవరైన రెండు గడియారములు కలిసి తమ సమానమగు వేరొక గడియారమును సృష్టించునట్లు నియమించిన వారు కలరా? ఈశ్వర నియమ మందొక జాతి శరీరములు రెండు చేరి మూడవదియగు శిశురూప శరీరము నేర్పడు నియమము కలదు. దీనికి సృష్టిక్రమమని పేరు. ఈశ్వర క్రమమందలి యమైథున సృష్టి అనగా నయోని సంభవులగు వారు సృష్టిక్రమ మందలి యోని సంభవులకంటె నధికమగు జ్ఞానము, నధికమగు యాయువు, నధికమగు బలాదులు గలిగి యుండి రనుట కేమియు సందియము లేదు. వారు నూతన ప్రాణులు. వారి యాహారము కందమూల ఫలాదులై యుండవలయును. జీవులు భగవంతుని యనాది ప్రజలైయున్నారు. వారి భాష దివ్యమగు సంస్కృతమై యుండినది. అమైథున సృష్టిలోని వారెట్లు సృష్టిలోని వారికి ఆదర్శరూపులై యుండిరో అట్లు సంస్కృత

భాషయు లోకములోని సమస్తభాషలకు నాదర్శమై కారణమై యున్నది. ఇట్టి ఆదర్శరూపములు యిప్పుడే చేయవలసిన యగత్యము లేదు. ఇది మధ్యకాలమగు సృష్టిక్రమ సమయము. అమైథున సృష్టిలో వావి వరుస లేర్పడవు, గనుక అయోని సంభవులలో వివాహ సంస్కారములందెట్టి యాక్షేపణలకును నవకాశము లేదు.

బల్లి గ్రుడ్డుల నుండి పక్షులుత్పత్తి యగునని చూపించినచో డార్విన్ మతమును నమ్మవలసినదే. పూర్వము కోతులుగా నుండి క్రమముగా మనమందరము మనుష్యులై యున్నామనియు, నొక ప్రాణి క్రమముగ వికాసమై మఱియొక ప్రాణియైన దనియు డార్విన్ వ్రాసెను గాని యనేక వేల సంవత్సరములుగా కోతులు కోతులుగానే యుండునదియు మనుష్యులు వికాసమైమరియొకజాతికాకుండ యథారీతిగనుండు నదియు, ప్రత్యక్షముగ నున్నది. ఇప్పుడుండు సూర్యుఁడు గాక రెండవ సూర్యుఁడు తనకు తానేసృష్టియైనప్పుడు డార్విన్ సిద్ధాంతము నిజము కావచ్చును. సృష్టి యంతయు నియమావృతమై యున్నదని యాతడు గ్రహించలేదు. ఈశ్వరుఁడనంత శక్తిమంతుఁడు. వాని యనంత జ్ఞానమువలన సమస్తము నియమ పూర్వకముగ సృష్టింపబడినది. ఉదాహరణముగ మానవ శరీరము (20) యిరువది సంవత్సరముల వరకు వృద్ధి యగును. డార్విన్ మత ప్రకారము అట్టి వృద్ధి సదా జరుగవలయును. ఎట్లన నిరువది వత్సరములకై దడుగులు పెరిగిన వారు నలువది సంవత్సరములకు పది యడుగులు పెరుగ వలయును. డార్విన్ మత ప్రకారము వృద్ధిస్థితి క్షయములయొక్క

నియమముండ కూడదు. గనుక అఖండ మగునీ నియమమును చూచియే డార్విన్ సిద్ధాంత మసంగత మని సిద్ధ మగు చున్నది. సృష్టి యంతయు సంస్కార రూపమని అతఁడు భ్రమించియున్నాడు.

ఒక చిత్రకారుడొక చిత్రమును వ్రాసి దానినుండి ప్రతికృతులను తీయునేర్పు కలిగి యున్నప్పుడు మరల యా చిత్రముల నేల వ్రాయ వలయును? ఆలాగుననే యమైథున సృష్టి యిప్పుడు చేయ బడదు. మరియు డార్విన్‌మత ప్రకారము మొదట నరుఁడు వానర శరీరములో జన్మించి క్రమ క్రమముగ వృద్ధినొంది మానవుఁడుగ నేర్పడెననుట వేద విరోధము. వానర శరీరము భోగయోని; మానవ శరీరము మిశ్ర యోని అథవా కర్మయోని. మానవుని జన్మ ముత్తమము. జీవుఁడు కర్మానుసారముగ జన్మమెత్తు ననుటకు విరోధముగ నుండును. ప్రత్యక్షముగ కోతి శరీరములనుండి కోతులును మనుష్య శరీరములనుండి మనుష్యులును, జన్మించు చున్నారు. గనుక డార్విన్ మతము సత్యము కానేరదు.

ప్రశ్న॥ దేవుడెందుకు యీ సృష్టిని చేయువలెను? దీని వలని లాభమేమి?

ఉత్త॥ నేత్రమునకు పదార్థము లగుపడు చున్నవి. అయినను కన్నులకేమి లాభము గలదు? ఆలాగుననె జగత్తును నిర్మించుటలో దేవునికి లాభము లేదు. దాని మేలు జీవాత్మలకు గలదు. జీవుల కొరకే సృష్టి చేయఁబడు చున్నది. సృష్టి ప్రకృతినుండి యుత్పన్నమగు చున్నది. నైన్య

శక్తి వలన జయాపజయములు కలుగును. కర్త మాత్రము రాజగును. ఆలాగుననే ప్రకృతి వలన సృష్టి యయినను కర్త ఈశ్వరుఁడగు చున్నాడు. కర్మనిమిత్తము సృష్టి యగు చున్నది.

ప్రశ్న॥ కొందరు జీవుఁడే దేవుఁడను చున్నారు. ఆ జ్ఞానము వలన జీవుఁడు సంసారమందు బంధనుఁడై యున్నాడనియు జ్ఞానియైన తరువాత అసలు తనచేతనధామమందుఁ జేరు చున్నాడని చెప్పుదురు నిజమా?

ఉ॥ వారిని మీరిట్లు యడుగవలెను. చేతనధామ మేది? దానినుండి జీవుఁడెట్లు వచ్చెను?

ప్రశ్న॥ చేతనధామము సత్యలోకము. సూర్యుడెట్లు యొక స్థానమందున్నను, వాని కిరణము సర్వత్ర వ్యాపించునో అట్లు ఈశ్వరాంశములగు జీవులు లోకమంతయు వ్యాపించి యున్నారు. అని వేదాంతులు చెప్పుదురు. దీనికి మీరేమి చెప్పుదురు? ఇనుములో నగ్ని వ్యాపించు చుండ లేదా?

ఉ॥ సూర్యుఁడు జడపదార్థము శాస్త్రము ప్రకారము సూర్యుఁడు యీలాగు తన తేజమును క్షీణింపఁ జేసికొని ప్రళయమందు వినాశమైపోవును. ఈశ్వరుఁడాలాగే తనయంశములను త్యజించి నశించునా? అతఁడొక జడపదార్థమా? ఏకదేశీయుఁమా యని మీరడుగ లేదా? ఈశ్వరునికిని ఈశ్వరాంశమునకును లక్షణభేదము లేమి యున్నప్పుడు వారేమి చెప్పుదురో వినవలయును. ఇది నాస్తిక మతముగును ఏమర్త్యాగులో దీనిని శంకరసూత్ర మని లోకమందు ప్రచారము చేసి

యున్నారు. దర్శన శాస్త్రము లందు జ్ఞా- జ్ఞాతా- జ్ఞేయ- స్థూల- సూక్ష్మ- వ్యాపక- దృష్టాంతాదుల లక్షణములను చూడుడు. అప్పుడు మీకిది నాస్తికమని బోధపడగలదు, భారత సూర్యోదయ మను వైదికాంధ్ర గ్రంథమును పఠించుడు. అందు మేమీ విషయమును విపులముగ చర్చించి యున్నారము. ఇనుములో నగ్ని వ్యాపించినను వ్యాప్య వ్యాపకములు రెండు నొక్కటిగా నేరవు. అగ్నియు నినుము రెండును జడములు. ఈశ్వరుఁడు జీవుఁడు. ఇద్దరును చేతనములు. ఇనుము స్థూలము అగ్ని సూక్ష్ము స్థూలమందు సూక్ష్మము. వ్యాపించును. ఈ యుపమానము జీవుఁడే దేవుఁడనుటకు నుపయోగింపదు. ఈశ్వర జీవలక్షణములను గురించి భక్తి ప్రార్థనోపాసన మను గ్రంథమును చూచినచో సందేహము నివర్తించును.

ప్ర॥ దేవుఁడ చలుఁడా? చలుఁడా? చలనము గలిగిన వాడన్న స్థలావకాశము కావలెను. ఏకదేశీయుఁడయ్యెను. చలనము లేనివాడన్న స్వయం చలనములేనివాడు జగత్తును చలింపఁ జేయ నేరడు.

ఉ॥ దేవుఁడు చలనము లేనివాడు. చలనములేని సూది ముక్కురాయి సూదులను చలింపఁ జేయునట్లు అచలుఁడగు దేవుఁడు జగత్తును చలింపఁ జేయుగలడు. ఆతఁడు ప్రకృతి యధిపతియై యున్నాడు. ఆతని న్యాయ నియమాది శక్తు లన్నియు సచలములైనవి. ఆతఁడు సమవ్యాపకుడుగా నున్నాడు. విభువ్యాపకునకు చలనము లేదు అతఁడు నిరాకారుడు.

ప్ర॥ నిరాకారవస్తువు సీమారహితమై యుండవలెను. అట్టి నిరాకారమేగల జీవుఁడు సీమాబద్ధుఁడగుటెట్లు?

ఉ॥ ఆకార రహితమగు పదార్థము యేకరసముగ నుండుట విధికాదు. నిరాకార వస్తువు లనేకములు సీమాబద్ధములై యున్నవి. మనోబుద్ధ్యాదులు నిరాకారములైనను పరిచ్ఛిన్నములై సీమాబద్ధములై యున్నవి. జీవేశ్వరు లిద్దరును నిరవయవులుగా నున్నను జీవునికంటెను దేవుఁడతి సూక్ష్మము గలవాడు గనుక జీవునియందును వ్యాపించి యున్నవాడు. మామాలికలోని తత్వజ్ఞానమను గ్రంథమును పఠించుడు.

ప్ర॥ ఈశ్వరుఁడు జ్యోతి స్వరూపుడని గలదు. నిరాకారుడు జ్యోతిస్వరూపు డెట్లగును? సూక్ష్మమన నేమి?

ఉ॥ ప్రకాశము- స్వప్రకాశమని పరప్రకాశమని రెండు విధములు. స్వప్రకాశము వలన పరప్రకాశము కలుగుచున్నది. స్వప్రకాశ మగోచరమైనది. పరప్రకాశము గోచరించునది. ఇచ్చట జ్యోతియన బాహ్యమగు ప్రకాశమని యర్థము కాదు.

ప్ర॥ ఈశ్వరుఁడు మానవ హృదయ మందు నివసించి యున్నాడని యుపనిషత్తులు చెప్పుచున్నవి. హృదయము సీమాబద్ధమై యుండలేదా? లేదన్నహృదయమే యీశ్వరుఁడగునా?

ఉ॥ పరిశుద్ధమైన హృదయము గలవాడు పరమాత్మ నెఱుంగ గలడని లాక్షణికార్థము. హృదయము నందే పరమాత్మ లక్షణములు తెలియబడు చున్నవి. హృదయమనునది యాంతర్య నేత్రము. అథవా జ్ఞానచక్షువు. అంతఃక

రణశుద్ధిగల జీవుడట్టి యాంతర్య చక్షువుచేత పరమాత్మని తెలియ గలడు. కంటి కగుపడని మనోబుద్ధ్యాదులు వాని కార్యమునుబట్టి తత్వవేత్తలు సాకారమను చున్నారు. దృష్టి యందు నిరాకార మనబడు చున్నవి. అలాగున హృదయ ములోనున్నాడనుటకు హృదయమునకు వేద్యుఁడని యర్థము. ఆకాశమంతట నిండియున్నది. అయినను ఆకాశములోని పదార్థము లాకాశము కానేరవు. ఈశ్వరుఁడంతట వ్యాపించి యున్నాడు గాని యంతయు దీశ్వరుఁడు కాడు మరియు సీమా బద్ధుడు కానేరడు.

సూక్ష్మమన స్థూలమునకంటె రూపాంతర మైనది. మంచుగడ్డ స్థూలము. దానికి సూక్ష్మము నీరు. స్థూలమగు నీటికి సూక్ష్మమేది యన్నప్పుడు బాష్పమని చెప్పఁబడుచున్నది. నీటియావిరి కంటెను సూక్ష్మమైనది యాకాశ రూపమగు జల రేణువగు చున్నది. ఈశ్వరుఁడిట్టి సూక్ష్మమగు రూపముగల వాడని వేద శాస్త్రములందు లేదు. అతఁడు నిర్వికారుడు నిరాకారుఁడని చెప్పఁబడి యున్నది.

ప్రశ్న॥ జీవుఁడు మరణ సమయమందే యింద్రియముల ద్వారా శరీరమునుండి వెడలిపోవును? పోయి యెచ్చట నుండును? యెన్నినాళ్ళుండును?

ఉ॥ జీవుఁడు పిండాండమందు ప్రవేశించు నప్పుడే యింద్రియముగుండ ప్రవేశించి యుండునో వెడలునప్పు డదే యింద్రియముగుండ వెడలిపోవును. వెడలిన జీవుఁడు యమ లోకము అర్థాత్ వాయులోక మందు కొంత కాలము [12

దినములు] వరకు నుండి తరువాత కర్మానుసారముగ జన్మిం చును. ముక్తజీవుఁడు "తేబ్రహ్మలోకేషు పరాంతకాలే" యని ముండకోపనిషత్తు చెప్పినట్లు 311040000000000 సంవత్సర ములు అనగా పరాంతకాలము వరకు మోక్షము నందుండును. ముక్తిదశలో ననగా బ్రహ్మాండములో సంచరించు కాలమందు కర్మ చేయఁడు. సాధారణ స్థితియందు జీవాత్మ సుషిప్తి యవ స్థలో నుండును. తరువాత ప్రారబ్ధానుసారము పిండాండ మందు ప్రవేశించును. తత్వజ్ఞానమను గ్రంథమును జూడుడు.

ప్ర॥ ఆత్మస్వతః శరీరమును విడుచునా? లేక దేవుఁడు తన శక్తి వలన తొలగించునా? ఆత్మస్థానమేది?

ఉ॥ ఈ విషయములో మొదట యీశ్వర సంకల్పము తరువాత జీవసంకల్పము తటస్థమగును. తత్వజ్ఞానమను గ్రంథ మునఁ జూడుడు.

ఆత్మస్థానము భ్రూమధ్య భాగమని కొన్నిచోట్లను హృదయమని మరికొన్ని చోట్లను చెప్పఁబడియున్నది. జీవుఁడు భ్రూమధ్యమున నివసించి నేత్రములగుండ లోకమును జూచునని చెప్పియున్నారు. ఉపనిషత్తులందు హృదయాకాశ మున జీవుడుండునని చెప్పఁబడియున్నది. జీవుఁడు శరీర మంతయు వ్యాపించి యుండునని కొందరూహించు చున్నారు.

ప్ర॥ పిండమందు జీవుఁడెప్పుడు ప్రవేశించును?

ఉ॥ ఈ విషయమందును భిన్నాభిప్రాయములు గలవు. ఎవడైనను యిల్లు సిద్ధమైన తరువాత తన సాధనములతో నింటి యందు ప్రవేసింప వలయును. అలాగుననే గర్భమందు

పిండము వాసయోగ్యమై సిద్ధమైన తరువాత జీవుఁడు ప్రవే శింప వలయును. జీవుఁడు ప్రవేశించిన తోడనే గర్భమందు శిశువు కదలుట కారంభమగును. గనుక నారంభమందే ప్రవే సించును.

ప్ర॥ జీవునకు జ్ఞానము స్వాభావికమా? నైమిత్తికమా?

ఉ॥ రెండును గలవు. భోగయోనులగు పశ్వాదులందు స్వాభావికజ్ఞాన మధికముగ నుండును. మనుష్యులందు నైమి త్తికజ్ఞాన మధికమై యుండును.

ప్ర॥ ఏనుగు గొప్పశరీరము అధిక బలముగలది. చీమ చిన్న శరీరము అల్పబలముగలది. ఈ బలాబలమును జీవుని యందా? దేహములందా?

ఉ॥ ఒకతులము తుపాకిమందుకు నిప్పంటించిన నో నది మందు పరిమాణమునకు తగినశబ్దము నిచ్చి దానిబలము కొలది పనిచేయును. అదే యగ్నిని యొక మణుగుతూకము గల మందు కొట్టున కంటించినయెడల దానికి తగిన శబ్దమును పనిని చేయును. జీవుని కెంత ప్రకృతి బలము లంభించునో అంతపని చేయుచుండును. జీవుని పరిమాణమందు భేదము లేదు.

ప్ర॥ ధర్మమన నేమి? దాని లక్షణమేమి?

ఉ॥ "ధృతిక్షమా దమోస్తేయంశౌచమింద్రియ నిగ్రహః । ధీర్విద్యాసత్యమ క్రోధోదశకం ధర్మలక్షణాం" ధైర్యధారణము, యుచితక్షమము, మానసవృత్తి నిగ్రహము, మానస వాచక కాయకములగు చౌరవృత్తులు లేకుండుట,

అంతఃకరణశుద్ధము, ఇంద్రియ నిగ్రహము, వివేచనయుక్త మగు బుద్ధియు, యదార్థజ్ఞానముతో గూడిన విద్యయు, ప్రియ మైనట్టి సత్యమును, అక్రోధము, యీపది గుణములు ధర్మము యొక్క లక్షణములు.

ప్ర॥ శూద్రులకును స్త్రీలకును వేదాధికారము లేద నియు వారు వేదము పఠింపరాదనియు వినకూడదనియు చెప్పు చున్నారు. మీ యభిప్రాయమేమి?

ఉ॥ దేవుఁడిచ్చిన దానియందు మానవ మాత్రులంద రికిని యధికారము కలదు. వేదాధ్యయనము చేయించ వల యును. అందువలన నెవరు గ్రహించ జాలక పోయెదరో- యెవరికి వేదవిద్య రాదో వారందు కధికారులు కారని తెలిసి కొనవలెను. మాకు వేదాదికారమున్నదని మాట మాత్రము చెప్పుకొనువా రెందరో వేద మెఱుంగక యున్నారు. వేదము లను పఠింప రాదనువారు ఈశ్వర ద్రోహులగుదురు.

ప్ర॥ వేమునందు నొసటియందేమి ధరింప వలయునని చెప్పఁబడియున్నది?

ఉ॥ నొష్టిపై బొట్టునుధరించు విషయము వేదమం దెచ్చటను లేమ. కొన్నిచోట్ల "ఊర్ధ్వపుండ్రంత్రి పుండ్రచ వర్తులం చతురస్రకం। అర్ధచంద్రాది వాలింగం వేదనిష్ఠోన ధారయేత్" అని వైదికులు నొష్టియందేమియు ధరిం పరని చెప్పఁబడియున్నది. పూర్వము ప్రతిదినము గృహములలో అగ్నిహోత్రములు చేయు చుండిరి. అట్లుచేసి నదుకు చిహ్నముగా హోమ కుండము నందలి

భూతిని నొష్టిపై ధరించి గృహాములనుండి వెడలు చుండిరి. క్రమముగా నంధపరంపరలు వ్యాపించి ముఖ్య కర్మ నశించి పోయి చిహ్నాలు మాత్రము ధరింప బడుచూ వచ్చి తుదకవి మతమతాంతర సాంప్రదాయక చిహ్నములుగా పరిణమించి యున్నవి. మా మాలికలోని మతమతాంతర పురోహిత మహాసభ యను గ్రంథమును చూడుడు.

ప్ర॥ వైద్యము నానావిధము లున్నదా? అందేవిధమైన వైద్యము శ్రేష్ఠమైనది? చికిత్స చేయవలయునా? కూడదా?

ఉ॥ ఓషధుల వలన తయారు చేయునది యౌషధ వైద్యము. విషము వలన సిద్ధముచేయునది విషవైద్యము. నీటికి శీతోష్ణములు కలుగజేసి యుష్ణోపచార శైత్యోపచార ములు సలిపి రోగములు కుదుర్చునది నీటివైద్యము. ఆలాగే వాయువును ప్రయోగించుట వాయువైద్యము. అగ్నిని దాని ప్రకాశమును ప్రయోగించుట యగ్నివైద్యము. రంగులను ప్రయోగించుట వర్ణవైద్యము. విద్యుత్తును ప్రయోగించుట ద్యుతివైద్యము. ఆకర్షణమును ప్రయోగించుట యోగ వైద్యము అథవా యింగ్లీషులో మెస్మరిజం-హిప్నాటిజమ్ అని చెప్పెదరు. ఆయుధముల నుపయోగించి చేయు దానికి శస్త్ర వైద్యము. ఇత్యాది వైద్య విధములు గలవు. సూర్యుని కిరణములను ప్రయోగించియు నవ్వించియు నితర యుక్తులు చేసియు మనస్సంబంధమైన వ్యాధులకు భ్రమ నివారణమగు నుపాయములు చేసియు రోగములను నివర్తి చేయుదురు. సమస్త చికిత్సలకును పథ్యము కలదు. అన్నియు సకాల

మరణమును నివారించుటకు గాను చేయఁబడు చున్నవి. సర్వ రోగములకు నొక్కటి పనికి రానేరదు. రోగభేదములనుబట్టి చికిత్సాభేదము లుండవలయును. చికిత్స యనునది కర్మానుభవమగు ప్రాయశ్చిత్తము. అకాల మరణమును గురించి తత్వజ్ఞానమను గ్రంథములో చూడుఁడు.

ప్ర॥ దయ్యములు పట్టుట నిజమా-అబద్ధమా?

ఉ॥ అదియు మానసికవ్యాధి యని చెప్పవచ్చును. ఎందుకనగా- బ్రతికి యుండినవారు మరియొకరికి దయ్యమై పట్టి బాధించినది మేమెఱుంగుదుము. మఱియు హిప్నాటిజం చేయబడిన వారు చేయు పనులు చూడగా దయ్యము లోక భ్రమతో గూడిన యావేశములని స్పష్టమగు చున్నది.

ప్ర॥ సుఖానందములు రెండు నొక్కటియేనా? భేదము గలదా?

ఉ॥ సాధారణముగ నింద్రియజన్యములగు వానిని సుఖములనియు నాత్మజన్యము నానందమనియు చెప్పుదురు. సుఖము శాశ్వతము కాదు. ఆనందము నిత్యమైనది యని చెప్పుచున్నారు. ప్రకృతి సంబంధమైనది సుఖమనియు నీశ్వరసంబంధమైనది యానందమని తత్వవేత్తలు చెప్పుచున్నారు. గీతయందు "ఇంద్రియములకు పరమైన బుద్ధిలో గ్రహింపఁబడు దానికి యాత్యంతిక సుఖము" అని చెప్పఁబడినది. దీనికే యానందమని పేరు.

ప్ర॥ గర్భమందలి శిశువునకు మలమూత్ర విసర్జనములు గలవా? ఊపిరి సల్పుచుండునా?

ఉ॥ అది ఈశ్వర క్రమములోని యంశ మనవలయును. ఈశ్వరక్రమము ఈశ్వరునకే తెలియునుగాని మానవునకు తెలియదు. ఇట్టి విషయములలో కొందరూహించి వ్రాసి యుండినను వానినే సిద్ధాంతములని నమ్మకూడదు. జీవ ముండగా గర్భమునుం దెఱచిచూడగలుగువా రెవరు గలరు? దీనికితర సంగతులను పోల్చి చెప్పుటసయితము దుస్తరముగా నున్నది. అమైథున సృష్టిని గురించి మనమెట్లు జిజ్ఞాస చేయ కూడదో అట్లు ఈశ్వర క్రమమును గురించి ప్రశ్న వేయ రాదు.

ప్ర॥ ఆప్తోపదేశము ప్రమాణమని గలదు. ప్రతివారికిని ఆప్తులుందురు. వారిమాటలు ప్రమాణములగునా?

ఉ॥ "రజస్తమోభ్యామస్పృష్టం మనో యేషాం మహా త్మనాం। ఆప్తాః శిష్టాం విబుద్ధాస్తే తేషాంవాక్యమసంశయం" ఎవరు రజోగుణ తమోగుణ విరహితులై కేవల సత్వగుణ ప్రధానులై యుందురో వారికి ఆప్తులని విబుద్ధులని పేరు. అట్టి వారి మాటలకు ఆప్తోక్తియని పేరు.

ప్ర॥ బ్రాహ్మణుఁడు సేద్యము చేయరాదనుచున్నారు. నిజమా?

ఉ॥ చేయవచ్చును. అనేక ప్రమాణములు గలవు. "క్షుధితం తృషితంశ్రాంతం బలీవర్ధం నయోజయేత్ ।హీనాంగం వ్యాధితం క్లీబం వృషం విప్రోనవాహయేత్" అనఁగా కృషి కర్మయందు ఆకలి దప్పిగొని నట్టియు బలహీన మైనట్టియు వ్యాధియుక్తమైనట్టియు నలసియున్నట్టియు పశ్వాదులనుబ్రాహ్మ

ణుఁడుప యోగింప కూడదని యుండుటవలన బ్రాహ్మణుఁడు శేద్యము చేయవచ్చునని సిద్ధమగుచున్నది.

ప్ర॥ మీరు ప్రతి విషయమును షడ్దర్శనము యొక్క ప్రమాణములతో పరీక్షించి నమ్మవలయునను చున్నారు. గీతయందు "సంశయాత్మావినశ్యతి" యని యే విషయమందు గాని సంశయింపక నమ్మవలయునని చెప్పబడి యున్నది. ఇందేది నిజము?

ఉ॥ ఒకడు మరియొకనిని చంపుటకై విషమును పెట్టు చున్నాడు అథవా తానును భ్రమించి మరి యొకరికిచ్చు చున్నాడు పుచ్చుకొను వాడు సంశయము లేకుండ భక్షించు చున్నాడు. అట్లు నిస్సంశయముగ విషమును దిన్నవాడు బ్రతుకఁ గలఁడా? బ్రతుక జాలడు. సంశయము గలిగినవాడు దాని భక్షింపక పారవైచి బ్రతుకు చున్నాడు. ఇప్పుడు 'సంశయాత్మా వినశ్యతి' యేమైనది? దాని యర్థము సంశయ యుక్తమగు నంశమును త్యజించి గాని పరీక్షించిగాని సంశయ నివారణము గాంచవలెనని యగుచున్నది. దేని నైనను మూర్ఖముగ నమ్మవలయునని యర్థము కాదు. వేదము సయితము "సత్యేనావృతా శ్రియా ప్రావృతా యశసా పరీవృతా (ఋ) ఇదమహమనృతాత్సత్యముపైమి" (యు) యని- సత్యగ్రహణ మొనర్చుట యందును అసత్యమును విస ర్జించుట యందును సర్వదా యుద్యుక్తుఁడై యుండవలెనని చెప్పఁబడి యున్నది. మతమతాంతర సాంప్రదాయములును వాని సిద్ధాంతములును వైదిక విద్వాంసులు పరాఙ్ముఖులగుచుండుట

చేత నన్నింటిని కన్నులు మూసికొని సత్యాసత్య వివేచన చేయకను సంశయించకను నమ్మవలయునని బోధించుచు గీతాశయమున కనర్థము చేసియున్నారు.

ప్ర॥ ఏకలవ్యుడు ద్రోణాచార్యుల నొక ప్రతిమగా పూజించియూ విగ్రహమును నమ్మి ధనుర్విద్యను లభింపం జేసికొనెననుట సత్యమా కాదా? విగ్రహపూజ వలన నష్ట మేమి?

ఉ॥ వాడు ప్రతిమార్చన మాత్రముచేత ధనుర్విద్యను పొందలేదు. పట్టుదలతో అభ్యాసము చేసినందున లభించినది. విగ్రహపూజ వలననే లభించునని ఏకలవ్యుడు నిరీక్షించినవాడు కాడు. పురుషప్రయత్నము వలన వానికది లభ్యమైనది. విగ్రహారాధన వలన మూర్ఖము వ్యాపించును. సర్వాంతర్యామియను సత్యమునశించి దేవుండే దేశీయుండను మిథ్యాజ్ఞానము లభించును. స్వార్థుల కడుపు కూటికి మాత్రముసాధనమై యుండును. పూజ యన గౌరవముం జూపుట యగుచున్నది. మనము ప్రతి వస్తువును పూజించి గౌరవించు చున్నారము. పాదరక్షలనుం దుడిచి శుభ్రము చేయుట కూడ నొకవిధమగు పూజయే యగుచున్నది. ఈ స్థితియందు నష్టమేమియు లేదు గాని విగ్రహపూజ వలన ముక్తి లభించు ననుకొనుట వ్యర్థము. విగ్రహమందు దైవభావ ముంచుట అభావమగును. భారత సూర్యోదయమను గ్రంథమును చూడుడు.

ప్ర॥ శాస్త్రార్థమెట్లు జరుగ వలయును? మౌఖికముత్తమమా? లేఖబద్ధ ముత్తమమా?

ఉ॥ మత సంబంధమైన వివాదము లేఖబద్ధమై యుండ వలయును. ఉభయ వాదములను లోకులు పఠించి సత్య సిద్ధాంత మిదియని తీర్మానించు కొందురు. నోటిమాటల మూలమున జరిగిన వాదమందెవరి వాదము శ్రేష్ఠము యెవరి వాదము నికృష్టమనుటకు వీలుండదు. గనుక శాస్త్రార్థ వివాదము లిఖిత మూలముగ జరుగుట మేలు. మేమట్టి పద్ధతినే యవలంబించి యున్నారము.

ప్ర॥ ధర్మము పది లక్షణములతో గూడియున్నదంటిరి. అనేకులు వారివారికిఁ దోచిన దానిని ధర్మమను చున్నారు. లక్షణములమాట యుండనిచ్చి ధర్మాధర్మా భేదములను వివరింపుడు. ధర్మమన నెట్టిది? అధర్మమన నెట్టిది?

ఉ॥ కటికవాడు జంతువును జంపుట ధర్మమనుచున్నాడు గాని యది ధర్మముకాదు. ఎందుకన తన్నాలాగే యితరులు జంపుటకు నెత్నించి నప్పుడు ధర్మమని యొప్పుకొనడు. శి. వి. పాకయ్య, చి. అప్పయ్య, యస్. నాగవీరయ్య, మొదలగువారు జంతువులను బలియిచ్చుట ధర్మమని వాదించు చున్నారు. గాని తమ్ము నాలాగే నరమేధ యాగమునందు ముగ్గురినిఁజంపుటకు సమ్మతించ గలరా? బలవంతమునఁబట్టి జంపునప్పుడు సయితము ధర్మమని సంతసింతురా? సర్వథా సమ్మతింపరు. అధర్మమని దుఃఖింతురు. అందరికి సమానముగ బోధమగునది ధర్మము. అందరికి సమానముగ మేలుఁ గూర్చునది ధర్మము. అన్ని కాలములందును అందరును భేదములేక యాచరింప గోరునది ధర్మము. ఇందుకు వ్యతి

రేకమైనది యధర్మము. ధర్మాధర్మ భేదమింతయే. దీని తెలిసికొన్నవాడు ధర్మజ్ఞుఁడు. ఈసూక్ష్మ మెఱుంగని పాక యాదుల వంటి వారధర్మపరులు.

ప్ర॥ తపస్సననేమి? అది యెన్ని విధములు.

ఉ॥ వేదశాస్త్రములందు వర్ణించియుండు తపస్సు విద్వాంసుల యొక్క మనన దశయగుచున్నది. ఇది పామరుల మననముకంటె విలక్షణమైనది. పామరులు లౌకికచింతావస్థ యందు తమ మనస్సును బుద్ధిని యింద్రియములను మగ్న పరచి యుందురు. విద్వాంసులు పరలోక చింతయందు మగ్నులై యుందురు. గనుక రెండు విధములని చెప్పవచ్చును.

ప్ర॥ బ్రహ్మచర్య మెన్నివిధములు. వానిలాభములేవి?

ఉ॥ ప్రాకృత, వైజ్ఞానిక, వైదికములని మూడువిధ ములు. ప్రకృతిని యనుసరించినది ప్రాకృతము. ఇది పశు పక్ష్యాదులందు విస్పష్టము. వీర్యరక్షా రూపమైనది వైజ్ఞానిక బ్రహ్మచర్యము. యజ్ఞోప వీతధారణచేత జీవేశ్వర ప్రకృతు లను గురించి పూర్ణముగ నెరుఁగుట వైదికము. మఱియు 48 సంవత్సరముల పర్యంత మాచరించునది బృహద్బ్రహ్మ చర్యము. ఒకానొక కారణముచేత నియమముగా కొంతకాల ముండునది అతిరాత్రము. గృహస్థుఁడగు వరకు స్వీకరించునది ఉప కుర్వాణము. ఆజన్మ పర్యంతము పాలించునది నైష్ఠిక బ్రహ్మ చర్యము. ఇత్యాది భేదములు కొన్నిగలవు. మానవ శరీర రక్షణము కొరకు భోజనము, నిద్ర, బ్రహ్మచర్యము నీ మూడును ముఖ్యము లైనవి.

ప్ర॥ అనేక పండితులును శాస్త్రిలును నా నా మత ములను యవలంబించి యున్నారు. వారెందుకు సత్యమును గ్రహింపరు? సత్యముచెప్పరు? సత్యము నాచరింపరు?

ఉ॥ "శాస్త్రాణ్యధీత్యాపి భవంతిమూర్ఖాః" యన్నట్లు వారు చదివిన మూర్ఖులు. ఈ విషయమును భగవద్గీత రెండవ యధ్యాయము 42 వ శ్లోకములో స్పష్టముగ చెప్పియున్నది. యథార్థజ్ఞాన జిజ్ఞాస వారియందు లేదు. అన్వేషకీ విద్యకును వారికినిబద్ధవైరము. కోర్టులో తిరుపతి వెంకటేశులు వచ్చి సాక్ష్య మిచ్చెదనని యొకభక్తునికి స్వప్నమందు చెప్పినట్లును, గడువు దినమున కోర్టులో నొక గులాబీ పుష్పము యొక్క రేకు లుపడినట్లును వర్తమానపత్రికలు ప్రచురింపగా యెందరో దానిని విశ్వశించిరికాని వివేచన చేసినవారరును. సాక్ష్యము చెప్పెదనని మాటయిచ్చిన వెంకటేశుడు అట్లు చెప్పక పూల రేకులను వేయుడమేమి? దీనినిచేసిన తంత్రజ్ఞుడు స్వోక్తి వ్యాఘాతదోషమెఱింగిన వాడుకాడు. ఇట్టివిద్య లనేకములు మేముచేసి మాస్నేహితులకు జూపియున్నారము. అంతయు తంత్రము. ఈ మహావంచకునకు వ్రాసి మేము కోరినట్టి నిద ర్శనము జూపగలవా యని యడుగగా బదులు చెప్పలేదు. అనేకులు చదువుకొన్నవారుసయితము తంత్రములను గనిపెట్ట లేకను వేదశాస్త్రములందు నభ్యాసము లేకను ఈశ్వరలక్షణము తెలియంగకుండగనే యాసత్యములను సత్యములని భ్రమించు చున్నారు. గనుక చదివిన మూర్ఖులెందరోగలరు.

ప్ర॥ యథార్థ జ్ఞానమెట్లు లభించును? మనస్స్థిరత యెట్లగును?

ఉ॥ సాంఖ్య దర్శనము నాల్గవ యధ్యాయమునఁజూడుము. విశదమగును. యథార్థ జ్ఞానము గలుగు నిమిత్తమే షట్‌శాస్త్రములు రచింపఁబడి యున్నవి. వానిని షడ్దర్శనము లందురు.

ప్ర॥ మీతో నెవరైనను జిజ్ఞాస చేయవచ్చునా?

ఉ॥ మా గ్రంథములన్నియు పఠించిన తరువాత శంకలు గలిగినయెడల మాకు తెలిసినంతవరకు సమాధానమియ్యగలము.

ప్ర॥ మీరు జ్ఞానులా ? అజ్ఞానులా ?

ఉ॥ మాకు తెలిసినదానియందు జ్ఞానులము. తెలియనివిషయమందజ్ఞానులము. లోకమందన్నియుఁ దెలిసినవాడు లేడు. ఏమియు తెలియని వాడును లేడు. మానవ మాత్రుఁడు కేవలము జ్ఞానియనిగాని యజ్ఞానుఁడనిగానిచెప్పబడడు. జ్ఞానాజ్ఞానములు రెండునుగలిగియుండును.

ప॥ కుతర్కమన నేమి ? యొక యుదాహరణము చూపగలరా?

ఉ॥ జ్ఞానము సుఖదాయకమని అజ్ఞానము దుఃఖహేతువనివేదశాస్త్రములు చెప్పుచున్నవి. ప్రత్యక్షముగజూచుచున్నారము. దీనిని ఖండించుటకు" ఒకయింటిలో పామున్నదని తెలిసినవాడు సుఖముగ నిద్రింపడు. తెలియనివాడు నిద్రించును.

గాన జ్ఞానముదుఃఖదాయకమని అజ్ఞానముసుఖదాయకమని వాదించుటకు వితండవాదము అథవా కుతర్కమనిపేరు.

ప్ర॥ మీ స్వీయచరిత్రమును క్లుప్తముగ జెప్పగలరా?

ఉ॥ మా కనేకులు యీవిషయమై వ్రాయుచుండుట చేత సయితము సంగ్రహముగ మా చరిత్రను పాఠకులకు నివేదించుచున్నారము. మేము అక్షయ సంవత్సరమునకు సరి యగు క్రీస్తుశకము 1866 వ సంవత్సరమందు కల్యాణదుర్గం తాలూకా లక్ష్మంపల్లి యను గ్రామమున జన్మించితిమి. మాతల్లి నారమాంబ. తండ్రి గురుమూర్తి. తల్లిగారిప్ప టికి జీవించి యున్నారు. మేము ముగ్గురు సోదరులము నాకు 12 సంవత్సరముల వయస్సు వచ్చువరకు 1878 సం॥ములో లక్ష్మంపల్లి గ్రామమునందే మాతండ్రిగారు మృతినొందిరి. అది మొదలు మా అన్నగారగు గురుమూర్తిగారి వద్ద విద్యాభ్యా సము చేయుచుండి నాతోడి బాలురును నేనును ముగ్గురుచేరి దేశాంతరము వెళ్లితిమి. అచ్చటచ్చట శ్రమపడి విద్యాభ్యా సముచేసి 1886 వ సంవత్సరమం దుపాధ్యాయ వృత్తియందు ప్రవేసించినారము. అట్లు కొంతకాలము జరిపి గృహములో కొన్ని మరణములు సంభవించి నందున నాకు వైరాగ్యము గలిగి మరల స్వేచ్ఛగా దేశాంతరము నేనొక్కడనే వెళ్లి పోతిని. అచ్చటచ్చట కొందరి సాధువుల వద్దను కొందరు యోగుల వద్దను కొంతకాలము గడిపి బళ్లారిలోని థియసాఫి కల్ సంఘమువారి సన్మార్గబోధిని సమాజమందు బోధకుం డుగా చేరితిని.

మతసిద్ధాంతముల శోధింప ప్రారంభించితిని. థియసాఫికల్ సొసైటీవారిలో ముఖ్యులగు మేడం బ్లావట్స్కీ కర్నల్ ఆలాట్కు మిస్టర్ కైట్లీ మొదలగువారితో నాకు పరిచయము కలిగినది. దివ్యజ్ఞాన సమాజమువారు నాస్తికులని నాకు విస్పష్టమయ్యెను. వెంటనే వారి సంఘమును విడిచి స్వగ్రామమునకు వెళ్లి విజ్ఞానవర్ధని యను మాసపత్రికను స్థాపించితిని. కొంతకాలమైన తరువాత దానినే ఆంధ్రకేసరి యను వారపత్రికగా చేసితిని. పత్రిక సౌకర్యము కొరకొక ముద్రాయంత్రమును స్థాపించితిని. ముద్రాయంత్రము బళ్లారిలో నొకరివలన నష్టమైపోయినది. కూలియిచ్చి కొంతకాలము పత్రికను నడిపితిని గాని లంచగొండులగు నుద్యోగులు కొందరు బ్రాహ్మణ నామధారులును నాకపాయము జేయుటకు సకల విధముల ప్రయత్నించిరి. నాపై ఋద్రన విద్యను ప్రయోగించిరి. ఈ యపకీర్తి బీజమును చిట్టూరు గ్రామమందు లక్ష్మీనృసింహశాస్త్రులను వారు నాటిరి. తరువాత విషముఁ బెట్టిరి. అటుపిమ్మట యసత్యములగు నభియోగములు దెచ్చిరి. ఒక దుర్మార్గుండు నన్ను బరిమార్చుటకు పది మందిని చేర్చి ప్రయత్నించెను. దైవసహాయమున నన్నియాపదలును నివారణ మాయెను. ఈ సమయమందు లంచ గొండులగు నుద్యోగు లనేకులు చెరపట్టి నన్ను చెరుప నెత్నించి తామే నష్ట కష్టములకుఁ బాల్పడిరి. మాయింటి వారీ విషయమున జడిసిరి ఇట్టి యవాంతరములలో పత్రికను నడుపుట కడు దుస్తరమైనసం

దానినిమానుకొని ఉత్తరదేశసంచారము వెళ్లితిని. అట్లు ళ్లి బొంబాయి మొదలగు గొప్పగొప్ప నగరములను జూచి యు కాంగ్రెస్సులలో ప్రవేసించియు నాదేశమందలి గ్రంథము లను పఠించుటకై యక్కడి వారివద్దకొన్ని మాసములవరకు విద్యార్థినై హిందీభాషను నేర్చుకొంటిని. గొప్పగొప్ప విద్వాం సులను దర్శించితిని, వారి యుపన్యాసములను వ్యాఖ్యానము లను శాస్త్రార్థములను వింటిని. శంకాసమాధానములను గమ నించితిని. ఈలాగున నుత్తరదేశమందలి, సనాతనధర్మమండలి, బ్రాహ్మణమండలి, ఆర్యమండలి, మున్నగు సంఘములవారి సిద్ధాంతములనుగ్రహించితిని. ఇట్లు కొంతకాలము గడపి మరల స్వగ్రామముచేరితిని. కొందరి స్వకీయ జనసహాయముతో ఆర్య క్షత్రియ మహాసభను స్థాపించితిని. ఒక గ్రంథమాలికను ప్రచు రించుటకు ప్రయత్నించితిని. దానికిని విఘ్నములుకలిగెను. గృహస్థాశ్రమమును స్వీకరించితిని. మరల యుపాధ్యాయ త్వము వలంబించి కొంతకాలము పత్రికలకు వ్యాసములు వ్రా యుచుంటిని. ఈ స్థితిలో 1905 వ సంవత్సరములో కుటుంబస మేతముగ (ఇద్దరు కూతురులు నొక్కకుమారుడు భార్య) వెళ్లి హిందూపురముచేరితిని. మా అన్నగారును తమ్ముడును తల్లి గారును స్వగ్రామమగు కుంకుర్తిలోనే యుండి నాకు సహాయ ముచేయుచుండిరి. హిందూపురమునందు కొందరి మహాశయుల మైత్రిని సంపాదించి గ్రంథమాలను ప్రారంభించితిని. ఇచ్చటను కొందరు మతద్వేషమును చూపుచు కొన్నివిఘ్నములు చేయు సాగిరి. ఇచ్చట గృహము నొకదానిని స్వంతముగ నుంచుట

మేలని) సంపాదించితిని. ఇంతలో నాభార్య 24 డిశం॥ 1911 సం॥ స్వర్గస్థురాలయ్యెను. ఆర్య క్షత్రియ సభనుగురించి విశేషప్రయత్నములుచేసి భిన్న భిన్న శాఖల వారగు క్షత్రియ సాంప్రదాయకుల నొక్కటిగా చేర్చుటకుఁ బూని నా పెద్ద కుమార్తెను సికిందరాబాదులోని యొక్క క్షత్రియకుమారునకిచ్చి వివాహము చేసితిని. ఈ వివాహము క్షత్రియసభయందే శ్రీ ఆదిపూడి సోమనాథరావుగారి యొక్కయు బెంగుళూరు శేషగిరిశర్మగారియొక్క పౌరోహిత్యముచేత వైదికరీతిగ జరుపఁబడెను. రెండవ కూతురు నాలాగె చేయనిశ్చయించియుండు నంతలో 10-10-1917 సం॥కలరావలన (సుభద్రయనుకన్య) చనిపోయెను. అయినను ధర్మలక్షణములలో మొదటిది యగు ధృతినివదల లేనుగాని అన్నపానములకు మిగుల కష్టము సంప్రాప్తమాయెను. అప్పుడు మేమేకాంతముగఁ గూర్చుండి యిట్లు తలంచితిమి. ఒక గుఱ్ఱము బండిని లాగు చున్నది. దానికొక తొందర కలిగినప్పుడు బండిచి యాపి వేసి సారథిని కాళ్ళతో తన్ని తాను పరుండి నితాంతముగ బండిని యాపుటగాని అథవా బండిని వెనుకకు మునుపున్న చోటికిగాని తేవచ్చును. ఇట్టిస్థితి కొన్ని సమయములందు మనుష్యునకు సంభవించు చున్నది. అయినను దానికేమియు లాభముండదు. అది నిజముగ విశ్వవిరోధము. ఇహమును విరోధించి మానవుఁ డేమిచేయ గలఁడు? లోకమును కాల్చి భస్మముఁ జేయగలుగునా? సముద్రమును శోషింపఁ జేయుట యున్మత్తముతో గూడిన ప్రయత్నము గాదా? గనుక దానికి

...ఖాయుగ నొక యోడనుసిర్మించి సాగరమును దాటుట సముం... మనుష్యుఁ డాపదలకు లోంగి పోకూడదు అని ...చి——

ఈ సమయమందే మా వైదికాగ్రంథములను ఖండించుచు వైదికధర్మవిరోధులు కొందరు బైలుదేరిరి. వారి వ్రాతల నెల్ల ప్రతిఖండనముఁ జేయుచు వైదిక సిద్ధాంత మండనములను వర్తమాన పత్రికలో ప్రచురించితిమి ఆంధ్ర దేశమునందు మాకు సాధ్యమైనంత వరకు వైదిక ధర్మ ప్రచారమును జేసినారము. కొన్ని ఆర్య సమాజములను స్థాపించినారము. గృహస్థాశ్రమమును చాలించి యింక కొద్ది కాలములో తృతీయాశ్రమమును స్వీకరించుటకై తగిన ప్రబంధములను చేయుచున్నారము. ఈ సంకల్పమును పరమేశ్వరుని సన్నిధికి నివేదించి, కార్యము నారంభించి యున్నారము. ఇప్పటికింతయే మా జీవన సంగ్రహము.

ఓం శాంతిః శాంతిః శాంతిః

---

అయ్యా !

తాముచేయు దేశసేవకుమిక్కిలి సంతోషమైనది. తమ గ్రంథము సిద్ధమైన సిమ్మట 200 రెండువందల ప్రతులు మా శిష్యవర్గములో ప్రత్యేక ప్రత్యేకముగ గొనువారు సిద్ధముగా నున్నారు.

(ఇత్యాది)

శ్రీ మత్పరమహంస జగద్గురువు- శ్రీ గోపాల సచ్చిదానంద బ్రహ్మేంద్రసరస్వతీస్వాములు కొల్లూరు, గుంటూరుజిల్లా.

ఆర్యవర్యా !

మీరు శి. వీ. పాకయాజి, చి. అప్పయ్యాశాస్త్రి, బుచ్చయ్యాశర్మ, నాగయ్య, మున్నగువారినెల్ల నెదిరించి వారి లేఖల నన్నింటిని ఖండించుచు స్వసిద్ధాంతములను మండనము చేయుచు ప్రత్యక్షాది ప్రమాణములచేత నాంధ్రప్రకాశికలో ప్రచురించిన వ్యాసముల నన్నింటిని పుస్తకరూపమున ముద్రించినచో దేశమునకు మహోపకారమగునని నాయభిప్రాయము.

(ఇత్యాది)

టి. రామానుజయ్యా,

మదరాస్.

మహాశయులారా !

లోకుల అజ్ఞానాంధకార బంధురమును బాప ప్రయత్నించుచున్న భవదీయ సుధీరత్వమునకు నానందము గలిగినది.

(ఇత్యాది)

సూర్యదేవర రాఘవయ్యా,

కొల్లూరు, తెనాలి తాలూకా.

శ్రీ

# అభిప్రాయములు.

ఆర్యకులదీపమా!

ఉ॥ చూచితిసుప్రకాశికను చోద్యపువ్యాసములన్ లిఖింపఁగా
నోచితిఁగాంచ నేడుసుమనోజ్ఞములౌ తమగ్రంథముల్ రహిన్
గాంచితినందు పితృజన కాంక్షితముల్ వివరింప సాధ్యమా
నాచవి జూచువారుయవనాదుల జ్యోతిషముల్ దలంతురే।

చం॥ ఫలితములెల్ల నిక్కమని పామరులీభువి మోసపోయిచి
క్కులఁబడిద్రవ్యమూడ్చుకొని కోరినసత్ఫలమందలేక మా
ఫలమిటు లయ్యెనంచు తమ ఫాలతలంబునవ్రాసెనంచు ది
క్కులఁబలికించుచుందురది కోర్కినొసంగగ జాలదంచు నీ
ఫలితపుశాస్త్రఖండనము బంధురలీల రచించి లోకమూ
ర్ఖుల తనుఁద్రెంచఁ బూనితిరి కాదనువారెవరీధరాస్థలిన్?॥

ఉ॥ కాయపుఁగష్టమోర్చి ఘనకావ్యములెల్లఁ బరీక్షఁజేసియ
న్యాయపు శాస్త్రసంగతుల నంతట ఖండనమాచరించి మీ
నాయము వెల్లడించి భువినందరి మెప్పునుఁబొంది తార్య నా
రాయణమూర్తి నీచరిత రాణవహించు ధరాస్థలంబునన్॥

ఇట్లు విధేయమిత్రము,

యన్. బి. డి శేషాచార్యులు,

వైఖానసమండలి ఈగావారిపాళెము.

చెంగల్పట్టు జిల్లా.

శ్రీ

# పోషకులు

పోశెనశెట్టి రామమూర్తిగారు,
అడవికొలను నిండ్రకొలనుపోష్టు తాడేపల్లిగూడెం తాలూకా

తోట శ్రీరాములుగారు,
మునిపిడి. బందరు తాలూకా బంటుమిల్లిపోష్టు

భోగిరెడ్డి గోపాలంగారు,
యనమదుర్రు భీమవరంపోష్టు భీమవరంతాలూకా

గణేశ్న బంగారయ్యగారు,
సీసలి వుండిపోష్టు భీమవరంతాలూకా

తోట రాజగోపాలరావుగారు,
డిటో

నంద్యాల శీతారామయ్యగారు,
కుప్పనపూడి ఆకివీడుపోష్టు భీమవరంతాలూకా

నిమ్మల వెంకటరెడ్డిగారు,
కాళ్ల ఆకివీడుపోష్టు భీమవరంతాలూకా

గనిశెట్టి రామమూర్తిగారు,
డిటో

యాళ్లరామస్వామిగారు,
చిన్నగొల్లపాలెం కాళీపట్నంపోష్టు బందరుతాలూకా

పులపర్తి మాధవరాయుగారు,
డిటో

కరింశెట్టి మాధవరాయుడుగారు,
డిటో

చందు స్వామినాయుడుగారు,

చిన్నగొల్లపాలెం కాశీపట్నంపోష్టు ంద్రయతాలూకా

గొర్తి బ్రహ్మయ్యగారు,

కొమరాడగొల్లమూడి భీమవరం పోష్టు భీమవరంతాలూకా

పోట్లూరి లక్ష్మినరసయ్యచౌదరిగారు,

చెబ్బ్రొకాయలపూడి

పసల సోమయ్యనాయుడుగారు,

డి॥ మెంటారు వెంటపాడు

దాసూ రాంచంద్రమాళిగారు,

మర్చెంటు చీరాల

కొప్పాడ వెంకటావుగారు,

నీళ్లరేవు

కొప్పాడ అప్పారావుగారు,

సరుకు కరణిలడిపో కాకినాడ

గుర్రాల వెంకటావునాయుడుగారు,

కరవరం

కొత్తపల్లి నరశింహమూర్తిగారు,

ల్యాండులార్డు ఎలమంచలి

వాడపల్లి సూర్యనారాయణరాజుగారు,

ఇంజన్ డ్రయివరు తెనాలి

బండారు జగపతిరావునాయుడుగారు,

కాళ్ల భీమవరంతాలూకా.



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPL A104 B103 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 177 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI,12,168,BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Navya |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |